# మనస్స్వాతంత్ర్యము

## తృతీయ భాగము

# Rationalistic Free Thought

## PART III





వల్లూరి సూర్యనారాయణరావు
బి. యె., బి. యల్., యల్. టి.
హైకోర్టు అడ్వకేటు
కొవ్వూరు

# మన స్వాతంత్ర్యము

## మూడవ భాగము

## (Rationalistic Free Thought)

**PART III**




వల్లూరి సూర్యనారాయణరావు

బి. ఎ., బి. యల్. యల్. టి.

హైకోర్టు అడ్వకేటు

కొవ్వూరు


[వెల 0—8—0]

# ఉపోద్ఘాతము

ఈగ్రంథము యొక్క ప్రథమ రెండవ భాగములలో వలెనే, యీమూడవ భాగములోకూడ, నేను వార్తాపత్రికలలో వ్రాసిన వ్యాసములు కొన్నియున్నవి. నా యభిప్రాయములు కొందరకు రుచించకపోయినను, నేను సత్యమని నమ్మినదానినే లిఖించితినని వారు నమ్ముదురని తలచెదను. ఏయిద్దరు వ్యక్తులకును, అన్ని విషయములలోను యేకాభిప్రాయములుండుట యెన్నటికిని తటస్థపడదు. ఎవరికితోచినవి, ప్రజల యెదుట పెట్టుటయు, వానిలో కొన్నిటిని కొందరంగీకరించుటయు, కొందరు నిరసించుటయు జరుగుచునే యుండును. ఎటులైనను, యెవరికివారు తమ స్వతంత్రాలోచనశక్తి నుపయోగించి, హేతువాదనలతో వానిని పరిశీలించి, ఖండించవలయును, లేక, అంగీకరించవలయును. ఇట్టి మనస్స్వాతంత్ర్యమును సామాన్య ప్రజలలో యీగ్రంథ మేమాత్రమైనను కలిగించుటకు తోడ్పడినయెడల నేను ధన్యుడను. సృష్టిపరిణామవాదమును ఒప్పుకొన్నయెడల, నీతి మత, సాంఘిక రాజకీయ విషయములలో, యీగ్రంథములోని యభిప్రాయములను, స్వీకరించుటే న్యాయము.

వల్లూరి సూర్యనారాయణరావు.

The seven perils of the world:—(1) Politics without principles (2) Wealth without work (3) Pleasure without concience (4) Knowledge without character, (5) Industry without morality (6) Science without humanity (7) Worship without sacrifice—Canon F. L. Donaldson.

ప్రపంచములో యేడు గొప్ప అపాయములున్నవి:— (1) నీతి నియమములమీద నాధారపడని రాజకీయతత్వము. (2) పాటుపడకుండ వచ్చిన అయిశ్వర్యము (3) ధర్మాధర్మ విచారణలేని సౌఖ్యసంపాదనము (4) సత్ప్రవర్తనలేని విద్య (5) నీతిమార్గము తప్పిన ధనార్జనము (6) పరమదయాళుత్వములేని శాస్త్రజ్ఞానము (7) త్యాగములేని దైవపూజ.

నీతి సత్పథములనే, నిజముగా మతమని వ్యవహారింపవచ్చును. యోగ్యతయే మతమనిపించుకొనును—సర్. సర్వేపల్లి రాధాకృష్ణన్‌గారు.

An idol does not excite any feeling of veneration in me—Mahatma Gandhi.

నేను దేవాలయములోని విగ్రహమును చూచినపుడు, దానిని పూజించవలెననెడు బుద్ధినాకు కలుగదు—మహాత్మాగాంధి.

Every race is inferior to the race it tramples upon and robs.......No nation founded upon injustice can permanently stand— Col. Robert Ingersoll.

అణఁగ ద్రొక్కఁబడు జాతికంటె, దానిని బలవంతముఁగ దోపిడిచేయు ప్రతిజాతియు హీనమైనదే—ఇంగర్సాల్.

Hinduism should shed the distinction between high and low and there should be in it neither high caste, nor low caste nor out caste whether by birth or in fact. A sinner is equal to the saint in the eye of God. Both will have equal justice and both an equal opportunity to go forward or to go backward. Both are His children, His creation—Mahatma Gandhi.

ఉత్తమవర్ణము, అధమవర్ణము, బహిష్కృతవర్ణము అనునవి హైందవ మతములో నుండకూడదు. భగవంతుని కంటికి పాపాత్ముడును, పావనపురుషుడును సమానులే. ఇద్దరికిని, సమానమైన న్యాయమును, ముందుకుగాని, వెనుకకు గాని పోవుటకు సమాన యవకాశములను ఆయన యిచ్చును. ఉభయులును ఆయనపిల్లలే. ఆయనచే సృష్టించబడినవారే—మహాత్మాగాంధి.

# విషయసూచిక



# మన స్వాతంత్ర్యము

## 1 వ అధ్యాయము

### లింగపురాణము

పదునెనిమిదిపురాణములలో కొన్ని శివోత్కర్ష ప్రతిపాదికములు, మరికొన్ని విష్ణుభక్తిపూరితములు. వీనినన్నిటిని వ్యాసులనెడు ఒకగ్రంథకర్తయే వ్రాసిరని యెంచవలయునా? లేక అనేకమంది వ్యాసులనువారు వీనిని వ్రాసియుందురా? వేదమునకు భాష్యమునువ్రాసిన వేదవ్యాసులును, యీ పురాణకర్తలగు వ్యాసులును భిన్నభిన్నవ్యక్తులా, అందరును ఒకరేనా? ఈ గ్రంథములన్నియు యిటీవల కొన్నిశతాబ్దములక్రిందటనే అనేకమార్పులు చెందుటవలన యీ గ్రంథములనన్నిటిని ఒక వ్యాసులే వ్రాసెనని సమన్వయించునట్లు వీనిలో కొన్నిచోట్ల నుల్లేఖింపబడియుండవచ్చును. జ్ఞానమార్గమును ప్రతిపాదించు వ్యాసులు, పామరులకు భక్తిమార్గమును ప్రతిపాదించుటకైనను, సత్యముతప్పి అనేకపిట్టకథలను స్వవచనవిరోధముగ యేర్చి కూర్చుటగాని, ఒకేకథను తిరిగితిరిగి చెప్పుచు దానిమార్చుటగాని యసంభవమని నేనుతలచెదను. ఇట్లు జనసామాన్యము

పవిత్రములని యెంచబడు పురాణములను గురించి నేనుచేయు విమర్శనలు కొందరుపూర్వాచారదురభిమానులకు కర్ణకఠోరములుగ నుండవచ్చును. అయినను నేనునమ్మిన సత్యమును వెల్లడించెదను. నా విమర్శనలో లోపములను కనుపరచిన యెడల వానిని సవరించుకొనెదను.

ఈ పురాణగ్రంథరాజములు కొంతవరకు పూర్వరాజుల చరిత్రలను మనకు ధర్మోపదేశముకొరకు అపూర్వగాధలతో వర్ణించుచు, పామరులకును, పిల్లలకును చెప్పు కట్టుకథలను బోలియుండునేగాని, యివి మతగ్రంథములు కావనియు వీనిలో ప్రతికథాంతమున దానిని చదివిన, వ్రాసిన, వినిన మోక్షము కలుగునని వ్రాసినది నమ్మవలదనియు నా ప్రార్థన. ఇప్పుడు వ్యాసులువ్రాసినట్లు చెప్పు లింగపురాణములోని కథలనే ఆయనవ్రాసినట్లు చెప్పేభాగవతము మొదలగు వైష్ణవపురాణములతో చెప్పినవానితో పోల్చి చూచుకొని యెవరికివారు సత్యమును నిర్ణయించుకొనుడు.

### 1. క్షుపదధీచోపాఖ్యానము.

క్షుపుడనురాజు క్షత్రియులే బ్రాహ్మణులకంటె గొప్పవారనియు, వారు విష్ణుసంభూతులనియు వాదించగా, దధీచి యను బ్రాహ్మణుడు రాజులను తలదన్నిన బ్రాహ్మణపుంగవులనేకులుండిరనియు, శివుడను దేవదేవుడే బ్రహ్మవిష్ణులకంటె పైస్థానమునాక్రమించుననియు ప్రతివాదనచేయనారంభించగా,

తుదకు కొట్లాటలో దిగి దధీచి క్షుపుని కాలితో దన్ని పరిభ
వింపగా క్షుపుడు విష్ణువుతో మొఱబెట్టుకొనెనట! అపుడు
విష్ణుమూర్తి దధీచితో పోరి బలహీనుడై తుదకు తనచక్రమును
కూడ అతనిమీద ప్రయోగించినను ఆ బ్రాహ్మణునికి శివుని
సహాయముండుటచే అనుపయోగమైనదట! విష్ణువు తననిజ
స్వరూపమును ఆ బ్రాహ్మణుని భయపెట్టుటకు కనబరచినను
ఆయన తనయిష్టదైవమగు శివునినే ప్రార్థించుకొనగా ఆయన,
దధీచియందు పంచభూతములను సమస్తచరాచరములను కను
పరచెనట! అపుడు విష్ణువు క్షమాపణవేడెనట! ఇట్లు విష్ణువు
కంటె శివుడేయధికుడని యీ గ్రంథకర్త నిరూపించెను.

## 2. పద్మయోని యండయోనిత్వాదికథనము.

తత్పురుషకల్పంబున జగత్రాతయైన రుద్రుడొక్కడే
జ్యోతిస్స్వరూపుడైయుండి తనశరీరమునుంచి నారాయణుని
సృజించి అతనియందు తనకుగల పుత్రవాత్సల్యముచేత అతనికి
సకలసృష్టి కర్తృత్వము నొసగెనట! బ్రహ్మను తనదక్షి
ణాంగమునను, విష్ణువును తనవామాంగమునను, శివుడు సృష్టిం
చుటచేత, బ్రహ్మగారు, తానే యెక్కువవాడనియు, తనకే
సృష్టికర్తృత్వము నీయవలసినదని శివునివేడగా ఆయన అట్లే
అంగీకరించెనట! అప్పుడు బ్రహ్మ క్షీరసాగరమందు శంఖచక్ర
గదాధరుడై నిదురించుచున్న విష్ణువునులేపి, తన్ను పూర్వము
ఆయన ధిక్కరించినట్లుగా యిప్పుడాయనను ధిక్కరించుచు

న్నానని పల్కఁగా, విష్ణువు అండోద్భవుండగు నా బ్రహ్మముఖ ములో ప్రవేశించెనట! అప్పుడు బ్రహ్మగారు తిరిగి తనభ్రూ మధ్యమున ఆ విష్ణువును సృజించెనట! అప్పుడు శివుడు ప్రత్య క్షముకాగా బ్రహ్మ విష్ణువులిద్దరు ఆయనయే జగదీశుడనిపొగడి తమయిద్దరిలో యెవ్వరు సృష్టికర్తగా నున్న నేమి, తమరిద్దరు శివునిలోనుండి పుట్టినవారేగనుక తగవులు పడకుండ రాజీ నామా చేసికొనిరి. ఈ రాజీప్రకారము విష్ణువు వరాహరూప మున భూమిని లేవనెత్తి చదనుపరచినాడట! దానిమీద విత్త నములునాటి బ్రహ్మగారు చరాచరముల నన్నిటిని సృష్టించె నట! కల్పాంతములయందు ఒకప్పుడు బ్రహ్మ విష్ణువును సృజిం చును. మరియొకప్పుడు బ్రహ్మను విష్ణువు సృజించునట! శివుఁడు తనయందు పార్వతిని సృష్టించుకొని, ఆమెను తనభార్యగాచేసి కొనెనట? ఈమెయే శివునియాజ్ఞతో సరస్వతి లక్ష్మిమొద లగువారిని సృజించెనట! బ్రహ్మదేవుడే విష్ణ్వాదులకు లింగా ర్చనావశ్యకత్వ ముపదేశించవలసివచ్చెనట! కాబట్టి యీ బ్రహ్మవిష్ణుమహేశ్వరులు సమానులు, సర్వజ్ఞులనువారు యీ కథల నెట్లుసమన్వయింపజూతురో చూడవలెను.

### 3. హిరణ్యాక్షునికథ.

హిరణ్యాక్షుని విష్ణువువధించి అతనిరక్తపానముచేత మత్తుడై జగములనన్నిటిని కలంచుచుండుటవలన, దేవతలందరు శివునిప్రార్థింపగా ఆయనవచ్చి సామవాక్యము లెన్ని చెప్పినను

విష్ణువు తిరస్కరించుటచేత శివుడు ఆయజ్ఞవరాహమూర్తిదంష్ట్రను లాగివేసి, తాను దానిని దాల్చి విష్ణుమూర్తికి గర్వాపహరణముచేసెనట! ఈ కథయంతయు వ్యాసులవారి భాగవతపురాణమందేల మృగ్యము?

4. హిరణ్యకశిపునికథ.

నృశింహమూర్తి హిరణ్యకశిపుని చంపిన తరువాత ప్రహ్లాదుడును బ్రహ్మాదులును యెంత మొఱబెట్టుకొన్నను తన యుగ్రరూపమును వదలకపోవుటచే ఆమూర్తికోర్వలేక శివునితో చెప్పుకొనగా ఆయన వీరభద్రుడను వానిని సృజించి సామముచే గాకున్న దండముచేతనైనను నృశింహమూర్తికి గర్వభంగము చేసిరమ్మని ఆజ్ఞాపించెనట! వీరభద్రుడు సౌమ్యముగ యెన్నినీతులు కఱపినను వినక తన్ను తిరస్కరించగా వీరభద్రుడు శరభావతారమెత్తి నరసింహమూర్తిని పరాజితుని చేసెనట!

అప్పుడు నరసింహమూర్తికి తెలివివచ్చి యీశ్వరుని స్తుతించి తన తేజము నుపసంహరించుకొనెనట! ఈకథ విష్ణుపురాణ భాగవతపురాణములలో లేకపోవుటకు కారణమేమి? ఈ పురాణములు ఒకవ్యాసులచేతనే రచింపబడినయెడల, ఆయన సత్యమును తనయిష్టమువచ్చినట్లు మఱుగుపరచెనని యందురా? లేక యీ గ్రంథకర్తలు వేరువేరని యెంచవలెనా?

### 5. జలధరుని చరిత్రము.

జలధరుడనువాడు బ్రహ్మవలన అనేకవరములు గొని దేవతలనందరిని హింసించి, విష్ణువును కయ్యమునకు పిలువగా అతనితో విష్ణువుయుద్ధముచేసి పలాయితుడాయెను. అటు పిమ్మట శివుని యుద్ధమునకు రమ్మని పిలువగా శివుడు తన చక్రముచేత అతనిని వధించెనట! ఈ చక్రమునే, తన్ను వేడు కొనగా శివుడు విష్ణువునకిచ్చెనట! విష్ణువు అప్పటినుండి యీ చక్రముతో దానవులను సంహరించుటకు శక్తుడాయెనట!

### 6. దక్షప్రజాపతి యజ్ఞము.

ఈ యజ్ఞమును ధ్వంసముచేయుటకు శివుడు వీరభద్రుని పంపగా అతడు బ్రహ్మను, విష్ణువును, సూర్యచంద్రులను, యింద్రాదిదేవతలను హింసించి పారదోలినకథ యందరికిని తెలిసియే యున్నదికదా! ఈ పురాణములను ఒకవ్యాసుడే వ్రాసి యున్నయెడల వీరిలో దేవదేవుడెవడని నిశ్చయపరచెను? బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులుముగ్గురు సర్వేశ్వరుని రూపములే యందురా వీరొండొరులకు తీసిపోవుటేల? వీరిసర్వజ్ఞత్వము నకును సర్వశక్తికిని లోపము వాటిల్లలేదా? జ్ఞానియగు వేదవ్యాసులు సత్యమునంతయు యేలస్పష్టముగ ఒకపురాణము లోనే వెలిబుచ్చలేదు? తరుచుగా బ్రహ్మదేవుడు విష్ణువునకు శివునిమహిమను తెలుపుచున్నట్లు యీ లింగపురాణములో వివరింపబడుచున్నది. విష్ణువు శివపాదప్రక్షాళనముచేసి తరిం

చెనట! విష్ణుమూర్తి రాక్షసులదుండగములను యీశ్వరునితో చెప్పుకొనగా అతనిని ఓదార్చి గజాననాదులను సృజించి శివు డాదానవులను సంహరించెనట!

### 7. పర్వత నారదులకథ.

పర్వతనారదు లిద్దరు మునలివాండ్రును, అంబరీషుని కూతురగు శ్రీమతిని వివాహమాడుటక్కై ఆమెతండ్రిని వేడగా శ్రీమతి వీరిలో నెవరిని ఒప్పుకొనక విష్ణుమూర్తిని ప్రార్థించెనట. ఆయన యీ శ్రీమతిని తాను వివాహము చేసుకొనుటతో తృప్తినొందక ఆ మునలివాళ్లిద్దరను వేధించుటకు తన చక్రమును బంపెను. ఆయనను వారెంతప్రార్థించినను దానిని విష్ణుమూర్తి ఉపసంహారించక నిరాకరించగా వారు శివుని ప్రార్థించి దానిబాధను నివారణచేసికొనగలిగిరట!

ఇట్టికథలతో భాగవతపురాణములోని విష్ణువు జగన్మోహనావతారమెత్తి శివునకు కలుగజేసిన భంగపాటు బాణాసురకథాసందర్భమున శివుని అపజయము మొదలగుకథలను పోల్చి చూచినయెడల యీ పురాణములన్నియు ఒండొంటితో కొంతసంబంధము కలుపుచు వేరువేరు గ్రంథకర్తలచేత వ్రాయబడి యెవరి యిష్టదైవమును వారుత్కృష్టదైవమని యెంచి వారివారికి తోచినట్లు కథల నల్లిరని నాకుతోచుచున్నది. అట్లుకానిచో ఒకే గ్రంథకర్తయగు వ్యాసులకు స్వవచనవిరోధము, సత్యమును పూర్ణముగ చెప్పక మరు

గుపరచుట మొదలగుదుర్గుణములను మనమాపాదించవలసి వచ్చును. చర్విత చర్వణదోషమునకు కూడ ఆయన గురి యగును. వీనిలో మొదటియూహయే సరియని నాకుతోచెడిని.

ఈ పురాణములనుపోల్చి చదివినకొలది యీ బ్రహ్మ విష్ణుమహేశ్వరులలో యెవరును ఆదిదేవుడుకారనియే నమ్మ వలసివచ్చును. వీరుముగ్గురు యేకేశ్వరుని భాగములే అయిన యెడల అందరునుసమానజ్ఞానులును సమానశక్తులును కలవారు గానే యుండవలెనుగాని, ఒకరినొకరు భంగపాటొనర్చుకొనుట వేరువేరుపార్టీలకు మద్దతుచేసి తమలో తగారు జగడమాడుచు రాజీపడుచుండుట యెట్లు తటస్థించును? ఒకరినొకరు గ్రహిం చలేకపోవుట యెట్లు సంభవించును? ఈ ముమ్మూర్తులలో బ్రహ్మనులిగాడుగా యీ పురాణములలో చూపబడుటకు కారణమేమి? ఈ బ్రహ్మయే విష్ణువునకు శివునిమహిమను తెలుపవలసివచ్చుటేమి? వీరిద్దరుకూడ శివుడు లింగాకారమై యుండగా దాని తుదిమొదళ్లను కనుగొనలేకపోవుటేమి? నిజ ముగా దేవుడొకడు సర్వసాక్షి, సర్వశక్తుడు, సృష్టిస్థితిలయకారు డుగా నున్నయెడల ఆయనను యీ వ్యాసుళ్ళేగాక మరియెవ రును గ్రహించలేదనియు, పామరులకొరకు వారివారికి తోచి నట్లు కొన్నిమూర్తులను సృజించుకొని వారికీర్తిని ప్రతిపాదిం చుటకు అనేకపిట్టకథలను చమత్కారముగనల్లి వానిలో తమకుతోచినధర్మములను బోధచేయుచు, దైవభక్తిని కలుగ చేయుటకు ప్రయత్నించిరనియు నేను నమ్ముచున్నాను. ఈ

పురాణములలోని అంతరార్థములు, గూఢార్థములు నాకే మియు తెలియవని వట్టిబూకరింపులు, పేలవపుమాటలు, కట్టి పెట్టి యీ వివిధపురాణములలోని కథలను దురహంకారమును వదలి నెమ్మదిగా సమర్థించగలిగిన యెడల నా యభిప్రాయ ములను మార్చుకొనుటకు నే నెల్లపుడు సిద్ధుడనేయని మనవి చేయుచున్నాను.

---

## 2వ అధ్యాయము

### హైందవమత పీఠాధిపతులు

శృంగేరి, విరూపాక్షము, పుష్పగిరి, కుంభకోణము, ఉడిపి, అహోబలము, శ్రీరంగము మొదలగు ద్వైతాద్వైత విశిష్టా ద్వైత మతగురువులు మన దక్షిణ యిండియాయందు కలరు. ఇతరప్రాంతములలోనున్న వారినిగురించి మన కంతగా తెలియక పోయినను, మన మతగురువుల నిత్యాచర్యలను బట్టి యీ వివిధ పీఠముల నిరుపయోగమును మన మిప్పుడు బాగుగా గ్రహిం పగలుగుచున్నాము. ఈ గురువులందరు సన్యాసాశ్రమమును స్వీకరించినవారే. ఈమఠములకు వేలకొలది ఆదాయమువచ్చు ఆస్తి కలదు. లక్షలకొలది శిష్యులవలన పాదపూజలను యీ గురువులు సదా స్వీకరించుచుందురు. కాని స్మృతులలో వీరి కేర్పడిన విధ్యుక్తధర్మములను వీరాచరించుటలేదు. వీరు తమ

స్థానములను వదలి గ్రామాదులలో ప్రచారముచేయుచు జనులకు మతబోధ సదా చేయుచుండవలెను. ఎన్నడో వీరుతమ పీఠముతో బయలుదేరినను, ఆందోళికలు, యేనుగులు, గుఱ్ఱములు, గొప్ప పరివారమును తమతోకూడ యుంచుకొని అట్టహాసముతో వెడలెదరు.

విజయనగర రాజ్యములో మంత్రిపదవి ననుష్ఠించి సమస్తవిద్యాపారంగతుడును, రాజకీయ వేత్తయునగు మాధవాచార్యులుగారు తాను సన్యాశాశ్రమమును స్వీకరించిన తర్వాతకూడ తన పూర్వాశ్రమాడంబరమును వదలలేక రాజఠీవితో శృంగేరీ పీఠాధిపత్యము వహించెను. అప్పటినుండి యీయన తరువాత యీపీఠము నలంకరించినవారు వీరితో పోల్చదగినవారు కాకున్నను యీ యాడంబరములను నిలుపుకొనుచు మైసూరు, కాశ్మీర మహారాజులవలన గ్రామములు ధనముసంపాదించుకొని తాముకూడ రాజాధిరాజులవలె ప్రవర్తింప మొదలిడిరిగాని, ఆదిశంకరాచార్యులవారివలె పాదచారులై దేశాటనము సల్పుచు ప్రజలలో జ్ఞానవిజ్ఞాన బీజములను వెదజల్లుటకెట్టిప్రయత్నములు వీరు కావింపలేరు. వీరినిచూచి తక్కిన పీఠాధికారులుకూడ వీరిమార్గమునే యవలంబించిరి.

ఈశైవ, వైష్ణవ, మధ్వగురువర్యు లెవరును ప్రజలతో కలసిమెలసి యుండరు. అతి గాంభీర్యము, దర్పముతో మెలంగెదరు. తోకచుక్కలవలె యెన్నడో తమపీఠము వదలి, అన్య

గ్రామములకు తమపల్లకీలు, గుఱ్ఱములు, బంట్రోతులు, శిష్యులు, యేనుగులు, పరివారము మొదలగువానితో పాదపూజలను శిష్యులవలన స్వీకరించుటకు బయలుదేరుచుందురు. ఎన్న డోగాని, వీరి ఉపన్యాసముల వినుభాగ్యము లభింపదు. వీరిలో అనేకులకు అక్షరజ్ఞానము లేదు. నానావిధమైన వ్యసనములకు అక్కడక్కడ కొందరు మత గురువులు లోబడుచున్నారు. "యథారాజాతథాప్రజా" యను సామెతనుబట్టి వీరిని బరివే ష్టించు శిష్యబృందముకూడ వీరివలె మెలంగుటలో నాశ్చర్య మేమియులేదు. వీరు వృద్ధాప్యము, రుగ్మత మొదలగువాని వలన బయటకు పోజాలకపోయినను, ఉత్తములైన పండితులనై నను మతప్రచారకులుగా తమయొద్ద మూలుగుచున్న ధనమును ఖర్చుపెట్టి పట్టణములకు పల్లెలకు పంపరు. దేశకాలాను సారముగ చేయతగిన మత సాంఘికాచారములలో నెట్టిమా ర్పులు వీరికి గిట్టవు. ఈ విషయములలో ప్రజలలో కలుగు సందేహములను బాపుటకు వీరు ప్రయత్నింపరు అనేక శతాబ్ద ములక్రింద యాచరణలోనుండిన మతసాంఘికసూత్రములనే పట్టుకొని వ్రేలాడుచు కాలము గడుపుకొనుచుందురు. ఆధునిక విషయజ్ఞానము సున్న. అన్యమతసాంఘికజ్ఞానము పాలుశిక్క యగుటచే ప్రపంచములోని వివిధ మతసాంప్రదాయములను పోల్చి, మతపరిణామమును గ్రహించుటయన నేమో వీరికి బొత్తిగా తెలియదు. వీరికి విశాలదృష్టిగాని, పరమత సహాస ముగాని బొత్తిగా లేదు.

ఈమధ్య ఒక హైందవమత ప్రచారకుడును, పండితుడునగు సుబ్బరాయశర్మగారు మఠాధిపతులచే మొదట సన్మానింపబడినను, యీమఠాధిపతుల విధ్యుక్తధర్మములను గురించియు, వీరికిగల వ్యసనములను విసర్జించుటనుగురించియు, ఉపన్యాసములనిచ్చుటకు మొదలిడగా మఠాధిపతులలో నొకరు, వీరియెడల కొన్ని దౌర్జన్యములు జరిగించుటయేగాక, మానన ష్టమునకు క్రిమినలు చార్జితెచ్చి యీయనను శిక్షింపజేసిరి. తరువాత, యీయన అప్పీలుచేసికొని ఆశిక్షను రద్దుపఱపించుకొనెను. ఇప్పుడీయన శృంగేరీకిపోయి, అక్కడ మన పీఠాధికారుల విధ్యుక్తధర్మములను గురించి ఉపన్యసించుచు, వైశ్యులు వేదకర్మానుష్ఠానమున కనర్హులనియు, నిప్పటి వైశ్యులు, క్షత్రియులు వేదకాలమునాటి వారి సంతతిలో చేర రనియు, వాదనగలిగిన సదరుపీఠమునుండి వెలువడిన గ్రంథమును విమర్శింప దొరకొనిరి. ఈవిషయమై శ్రీవారి సముఖమందు వారిపండితులతో వాదము చేయుటకు అంగీకరింపవలెనని యీయన యెంత ప్రాధేయపడినను, శంకరాచార్యులుగారి దర్శనముకూడ కలుగకుండ వారి యేజంటుగారు ఆజ్ఞలనిచ్చియున్నారట! ఇప్పటి వైశ్యులు, క్షత్రియులు, వేదములో చెప్పబడినవారి సంతతి కాకపోవచ్చును. ఇప్పటి బ్రాహ్మణులగతియు నంతే కదా! మనశరీరములలో నెన్నిజాతుల రక్తము కలసి ప్రవహించుచున్నదో యెవరికెరుక? కాబట్టి యిప్పటికి కూడ నాక్లయంటుగానున్న మా శృంగేరి పీఠాధ్యక్షులు, ఈవిష

యములో యెక్కువ సహానమును చూపింపవలెనని ప్రార్థించు చున్నాను.

సుబ్బరాయశర్మగారు, వేదకాలమునాటి వర్ణాశ్రమ ధర్మములను పునరుద్ధరింపవలెననియు, బ్రాహ్మణులలోను, వైశ్యులలోను, శూద్రులలోను, అంతఃశాఖలను సమ్మేళనము చేయవలెననియు ఈ యుద్యమమునకు వివిధసాంప్రదాయములుగల పీఠాధిపతులందరు చేయూతనొసంగి, తమ పలుకుబడిని ధనమును, విద్యయుఉపయోగించి,అన్యోన్య అంతఃశాఖా వివాహములకును భోజన ప్రతిభోజనములకును వారిచే అంగీకరింప జేయవలెననియు, మన పీఠాధిపతులు నిజమైన సన్యాసులుగా నుండి తమశిష్యబృందముతో యెల్లప్పుడు సంచారము చేయుచు జన బాహుళ్యములో హైందవ మతజ్ఞాన విజ్ఞాన బీజములను వెదచల్లవలె ననియు గంపెడాశతో ఈయుద్యమములో దిగిరి. ఇది కొనసాగిన మంచిదే కాని "గోడనేసి తల కొట్టుకొనుట"యే యని నా యభిప్రాయము. తుర్కీ దేశములో కాలీఫును స్థానభ్రష్టుని చేసినట్లు ఈమఠాధిపతులను తొలగించి ఈమఠముల ఆస్తినంతయు పరిపాలకులు స్వాధీన పరచుకొని హైందవ జ్ఞాన విజ్ఞానాభివృద్ధికి, మరల్చుటకు తగిన మార్గముల నేర్పాటుచేయవలసియున్నది. పూర్వవర్ణాశ్రమ ధర్మములు నశింపక తప్పవు. విశాలదృష్టితో ఈ మఠద్రవ్యమును నైతికాభివృద్ధి కుపయోగింపవలసియున్నది. ప్రపంచములోని వివిధ జాతులవారి వేరువేరు విజ్ఞాన సంపదను తరచిచూచి దానిలో

అక్కరకు వచ్చునదెల్లను మనలో జీర్ణింపజేసికొనుటకు మనము మఠములకు గల కోట్లకొలది ధనమును ఉపయోగింప ప్రయత్నించవలెను. గాని, ఈ మఠములను, ఈ మఠాధిపతులను ఆధునిక యుగమున కనుగుణముగ నడిపించగలచుట యెన్నటికిని పొసగనేరదు.

---

## 3 వ అ ధ్యా య ము

---

### ప్రత్యేక వర్ణసభలు

ఈమధ్య ప్రత్యేక వర్ణసభలు లెక్కకు మిక్కిలిగా మన రాజధానిలో సమావేశ మగుచున్నవి. వీనిలోని తీర్మానములన్నియు ఒకేవిధముగా నుండి సంఘములోని బాలుర విద్యాభివృద్ధిని గురించియు, సంఘ సంస్కరణలను గురించియు ప్రతిపాదింపబడుచుండును. ఈ వివిధసభల నడుమ యెట్టి ద్వేషభావమూ లేదు గాని వీని ప్రత్యేకతను స్థిరపరచు స్వభావము వీనియందు కలిగి వర్ణైక్యతకు అడ్డుతగులుచున్నవి. నీటికంటె రక్తము యెక్కువ చిక్కన యను ఆంగ్లేయ సామిత యిక్కడ వర్తించి ప్రతి సంఘముయొక్క పురోభివృద్ధికిని యీ సమావేశములు తోడుపడుట స్పష్టమే. అయినను యెట్టిమేరలు లేక యివి మితిమీరి పోవుచున్నవి. బ్రాహ్మణులలో నియోగి

సభలు, వైష్ణవుల సభలు, మధ్వ సభలు, వీనిలో తిరిగి అంతః శాఖల సభలు బయలుదేరినవి. నియోగిసభలు శ్రాద్ధాల కాన్ఫరెన్సులని యీసడింపులచేత, చంపివేయబడినట్లే యెంచ బడవలసి యుండును. మా కోటీశ్వర శర్మగారికి ఓపిక తగ్గినది. మా మార్కండేయశర్మగారు మొదటినుండి కార్యాంతరము లందు మగ్నులగుటచేత వీనితో అంతగా సంబంధము పెట్టు కొనలేదు. ఇక వైశ్యులు, క్షత్రియులు వేరువేరుగా ప్రత్యేక సభలను జరుపుకొనుచున్నారు. శూద్రులలో యిట్టి సభల కంత మున్నట్లే కనుపడదు. రెడ్డి, కాపు, దేవాంగ అగ్నికుల క్షత్రియ, గౌడ, వెలమ, బలిజ, శైవ, లింగాయతు, కంసాలి, వేశ్య మొదలగు సభ లెన్నియో ప్రతిసంవత్సరము కూడు చున్నవి. ప్రయాణము భోజనపు ఖర్చులు కొన్ని తీర్మాన ములు మాత్రము కనుపడుచుండును. సంఘాభివృద్ధికి మొత్తము మీద తోడుపడుచుండుటలేదు. సరికదా శాఖాభిమానము వృద్ధిచేయుచున్నట్లు కనుపించుచున్నది. స్వరాజ్య సంపాదనకు ఆటంకము కలుగజేయుచున్నవి. కొందరు, జాతీయాంతర్జాతీయ విషయ చర్యతో యీ వివిధవర్ణ సమావేశములను పోల్చెదరు. కాని యది సరికాదు. జాతీయాభివృద్ధిని గమనించుచు అంత ర్జాతీయసభ్యతను పెంపొందించవలసియున్నదనియు, అట్టి సభ్యత, సమానముగా పూర్ణస్వాతంత్ర్యముల ననుభవించు జాతులమధ్యనే కుదురుచు గనుక, జాతీయతను ముందుగా బలపరచుకొనుట మిక్కిలి అవసరమని, గాంధి టాగోరు మొద

లగు విశ్వమానవకోటియొక్క సౌభ్రాతృత్వమును వాంఛించు వారు కూడ యెంచుచున్నారు. ఈ చర్చ యంతయు రాజకీయార్థికాభివృద్ధితో మాత్రమే సంబంధించినది. వారు వర్ణ సమ్మేళనము, జాతిసమ్మేళనములను గురించి యెన్నడు యెట్టి వాగ్వాదము పెట్టుకొనలేదు. మన సంఘముల ప్రత్యేకసభలు మతచర్చలతోను, సాంఘిక చర్చలతోను కూడినవై యున్నవి. రాజకీయరంగములో యీ శాఖాసభల కెట్టి స్థానమును లేదు. కాబట్టి, ప్రజలలో విద్యావ్యాప్తికి గాని దురాచారములను సంఘమునుండి పాఱద్రోలుటకు గాని, యిట్టి ప్రత్యేక సభలు అవశ్యములు కావసియు, మన భారతీయులలో భేదభావములను మరింత బలపరచుచు, మన వర్ణములలోని శాఖోపశాఖలను శిలారూపము దాల్చునట్లు చేయు ననియు, మనము వానిని నిరసించవలెను.

---

## 4 వ అధ్యాయము

### వర్ణసమ్మేళనము

హిందువులలోని వర్ణములు కలసిపోవుటకు చాలా కాలము పట్టునని తోచుచున్నది. అట్లు జరుగుటకు ప్రయత్నించుట వర్ణసంకర మను మహాపాపమున కొడిగట్టుటయే యని, ప్రతి వర్ణమువారియొక్కయు అభిప్రాయము. "తండ్రి

మధ్వాచారి, తనయుడారాధ్యుండు, తల్లి కూచిమతస్థురాలు" అను పద్యమును హేళనగా ప్రతివాదును మనమీద ప్రయోగించువాడే. సంఘసంస్కరణవాదులు, రాజకీయనాయకులు, మహాత్మాగాంధిగారి యనుచరులుకూడ దీనిని తమ జీవితములో ఆచరణలో పెట్టలేకపోవుటయేగాక, బహిరంగముగా ఈవర్ణసమ్మేళనమును ఆమోదించుటకు కూడ వెఱతురు. మహాత్ముని యభిప్రాయములు తన యాచరణవలననే స్పష్టపరచెను. అంత్యజుల పిల్లను తాను పెంచుకొనెను. తన కుమారుడు భిన్నవర్ణములో చేరినస్త్రీని వివాహము చేసికొనుటకంగీకరించెను. వర్ణవ్యవస్థను పాటింపక, తాను హైందవ మతస్థుడనని గర్వించును. సమస్తమతములయందును, సత్యముకలదని, వానిని గౌరవించుచు, తన హిందూమతమును విడువనని చెప్పుచుండును. ప్రస్తుత హిందూమతమునకు పునాదులగు వర్ణాశ్రమధర్మము, పూర్వ జన్మకర్మలు, ఈయన యంగీకరించనట్లు స్పష్టమేకదా! అంతర్వర్ణవివాహములు, అంతర్వర్ణ భోజన ప్రతిభోజనములు, యథేచ్ఛగా జరుగునపుడు, ఊహాజన్యములగు ఆధ్యాత్మిక వాదనలలో వివిధజాతులలోను వ్యక్తులలోను యెన్ని భేదాభిప్రాయములున్నను విశ్వమానవ కోటిలో మానవసౌభ్రాతృత్వమునకు యీ ప్రస్తుత మతములు అడ్డురావు. ఈమతములు క్రమక్రమయగా నశించుననియే నమ్మవచ్చును.

కాని, సాంఘిక పరిణామమును గమనించినయెడల, ఈ మతనిర్మూలనము శఘ్రుకాలములో సంభవించదు. అక్క

డక్కడ సముద్రములోని కాకిరెట్టవలె కొంద రీవర్ణసంకరము నాచరించుచున్నను, ప్రతిసంఘము మొత్తముమీద మిక్కిలి నెమ్మదిగా నడచుటయే దానిస్వభావము. హిందువులలో ముఖ్యముగా అనేక వేలసంవత్సరములనుండి మతసూత్రము లతో ముడిపెట్టబడిన వర్ణవ్యవస్థ యెప్పుడో యేదో గొప్ప సాంఘిక విప్లవమువచ్చిననేతప్ప, మాటలతోను చేతలతోను వ్యక్తులవలన రద్దుపడదు. మొట్టు నాలుగువర్ణములు కలియక పోవుట యటుండ, వీనిలోని అంతశ్శాఖలలోనే పట్టుదలలు నానాటికి విజృంభించుచున్నట్లు కనబడుచున్నవి. ఇతరమత ములలో ఈ పిచ్చిసాంఘికాచారములు నశించగా మనలో యీ కట్టుబాటులు మరింత బిగింపబడుచున్నట్లు వివిధశాఖా సభలు స్పష్టపరచుచున్నవి. భారతదేశములో మన దక్షిణ ప్రాంతమందు, కొంతవరకైనను విశాలదృష్టిని కనబరచిన ఆర్య సమాజమతము వ్యాపించలేదు. ఇక బ్రహ్మసమాజమతమును గురించి చెప్పనక్కరయేలేదు. దీనికి కారణము మన బ్రాహ్మణ మతమే. దీనిలోని ఉపనిషద్వాక్యములనే మన మంగీకరించి వానిని ఆ చరణలో పెట్టినయెడల, మనమందరము బౌద్ధసం ప్రదాయములో చేరియే యుందుము. ఇతరమతములవా రందరు మనలో చేర్చుకొనుటచే, ఆధ్యాత్మిక విషయములలో వ్యక్తులకు ఎట్టి యూహాలున్నను మానవసౌభ్రాత్రత్వము సం ఘములో వృద్ధినొందియుండును. అప్పుడు ఈ ప్రస్తుతమత నిబంధనలన్నియు నమసిపోయి నైతికసూత్రములను హేతు

వాదముమీదనే ఆధారపరచుచుందుము గాని కర్మకాండలు ఆచారములు స్వర్గనరకములు దైవము పూర్వజన్మకర్మములు మొదలగు కొన్ని మతవిశ్వాసములమీద నాధారపడియుండము. కాని యిదియంతయును నువ్వగింజసామెత. గాలిలో మేడలు కట్టుటవంటిది. నెమ్మదిసమయములలో ఇట్టిమార్పులు విద్యాధికులలోనే కలుగనపుడు సామాన్యజనులలో నెప్పటికి వ్యాపించును? మనపూర్వుల నాటినుండి వచ్చు అలవాటులను సంప్రదాయములను పోగొట్టుకొనజాలము. నా నీడనుండి నేనెట్లు దాటిపోలేనో, అటులనే నాసంఘమును, నాభార్యబిడ్డలను, బంధువులను విడిచి పోజాలను. పోయి యేసంఘములో చేరగలను? మాట, కట్టు, బొట్టు, శుచిత్వము, విద్య మొదలగు విషయములలో సరిసమానముగా నున్న ఒక బ్రాహ్మణకుటుంబము, ఒక శూద్రకుటుంబము, వియ్యమొందె ననుకొనుడు. ఈ రెండు కుటుంబములవారికి సమీపబంధువులు అనేక కుటుంబములుండి, ఒకేభాష మాట్లాడువారైనను భిన్నాచారవ్యవహారములు కలిగి యున్నపుడు, ఏవగింపుకు అనేక కారణము లుండును. మానవుడు సాంఘికజీవి. తాను సౌఖ్యపడవలె నన్న, తనసంఘమును వదలక దానిని సంస్కరించుటకు ప్రయత్నించును గాని, దానిని త్యజించి మరియొకవర్ణము వారిలోనికి పోవ ప్రయత్నించినను దానిలోకూడ చేర్చుకొనబడడు. ఈభయమే, అనేక సంఘసంస్కరణవాదులను మాటలచే కోటలు దాటించును గాని, ఆచరణలో పిల్లులుగ

చేయుచున్నది. ఈ వర్ణసంప్రదాయములు స్త్రీలలో మెండు. వీరిని ఒప్పింప జాలనిచో పురుషు లెంతముందుకు దూకవలె నన్నను, తమజీవితము మిక్కిలి దుర్భర మగునట్లు వారు చేయగలరు.

నాలుగువర్ణములలో తక్కువ యెక్కువలులేవని మన మంగీకరించెదము. కాని, వీనిఅన్యోన్య సంసర్గములో భేద ములు అనుదినము కనపరచుచున్నాము. దీనికి బ్రాహ్మణుల నొక్కరినే నిందించిన లాభమేమి? అన్నివర్ణములవారును వారిలో అంతఃశాఖలవారును, తుదకు మాలమాదిగలును, తమతమ వర్ణములను వదలకుండనున్నారు. కాబట్టి యీ మత ములనే వానినే త్రోసివేసి, శాఖాహారులు, మాంసాహారులు కూడ, మతములేని నూతన సంఘమును యేర్పాటు చేసికొన వలయును. లేదా, ప్రస్తుతము ప్రచారములోనున్న మతము లలో, కర్మకాండయను మూఢనమ్మకములు సాధ్యమగువరకు త్యజింపబడిన బౌద్ధమతములోచేరవలయును. ఇదియే, కొంచెమిం చుమించుగా ఉపనిషన్మతము. ఇది ఆర్యులపూర్వమతములోచేరి యున్న దేగనుక, దేవుడు, దయ్యము, వేదము మొదలగుఅనుల్లంఘ నీయమగు గ్రంథములు, లేకపోవుట తటస్థింపగలదు. అన్యోన్య వివాహములకును భోజనప్రతి భోజనములకును, యీ ప్రస్తుత వర్ణాశ్రమ ధర్మవ్యవస్థ ఆటంకము కలిగించి, మనఐకమత్యమును వేదకాలమునాటి నుండియు చెరచి, మనలను, విదేశీయులకు బానిసలనుగ జేసి వైచినది. ఇట్టి రాజకీయార్థిక దాస్య

ములకు లొంగిపోయి, యింకెక్కడనో వ్యక్తులకు మోక్షము కలదనియు, యీ భౌతిక విషయములను ఆలోచింపక, అట్లు ఆధ్యాత్మిక సుఖమునకే ప్రయత్నింపవలెననియు, తనసంఘాభివృద్ధిని గురించి విచారింపనవసరమే లేదనియు వాదించువారితో యీ చర్చ అనగత్యము. సంఘసంస్కరణవాదులకే నా సందేహములు తెలియజేయుచున్నాను. వారు సాంఘిక పరిణామమును గుర్తించుచున్నారుకదా? ఏదియో ఒక మతము, సంఘమునకు అవసరమా? అట్లగుచో ఊహాజన్యములగు పరలోకవిషయములను, వ్యక్తులకు వదలివేసి, శిలారూపముదాల్చిన యీ వర్ణపట్టింపులను విడగొట్టుటెట్లు? భోజన ప్రతిభోజనములు, అన్యోన్యవివాహములు స్వల్పవిషయములు కావు. ఇవి సంఘబలమునకు పునాదులే. అనుల్లంఘనీయమగు మతసాంప్రదాయములను బోధించుగ్రంథములను విసర్జించిననే గాని మనసంఘములో పైనుంచి క్రిందవరకు గల యీ భేదబుద్ధి అంతరించదని నా యభిప్రాయము. సాంఖ్యులు, కాణాదులు, చార్వాకులు మొదలగువారి నందరిని తనలో యిముడ్చుకొన్న ఉపనిషన్మతమును వదలివేసి, వేదమతము, బ్రాహ్మణమతమను వానిని అంటి పెట్టుకొన్నంత కాలము, ప్రపంచములో మరియెక్కడను కని విని యెరుగని యీ శిలారూపమైన వర్ణములు మనలను పీల్చి పిప్పిజేయక తప్పవు. మానవసేవయే దైవసేవయని యెంచి అనేక లక్షల సంవత్సరముల అనుభవమువలన యేర్పడిన నీతి సూత్రములమీద

నాధారపడిన ఉపనిషన్మతముగాని, బౌద్ధమతముగాని మనకు శరణ్యమని తోచుచున్నది. మనకట్టి సంఘము ప్రతిదేశ విభాగములో యేర్పడినగాని వేషభాషలలో వ్యత్యాసము లేని సంఘములు బయలుదేరవు. ఇవుడున్న ఆర్యసమాజ బ్రహ్మసమాజములతోపాటు మరియొక సంఘము కు కొన్ని కుటుంబములు ఆయాదేశ విభాగములలో లేవదీసిన నేమి ప్రయోజనమని కొందరు ప్రశ్నింపవచ్చును. మనది మతమను నదియే లేని సంఘము గనుక, దీనిలో ప్రపంచములోని యే జాతి వాడైనను చేరవచ్చును. నూతనముగా పేరుపెట్టి క్రొత్త సంఘమును యేర్పరచుట అసాధ్యమని యెంచినయెడల, మన మందరము బౌద్ధమతములో చేరితిమని ప్రకటించుట మంచిది. దీనికి చదువరులు యేమనెదరో వ్రాయకోరుచున్నాను. ఈ చర్చలో సనాతనధర్మవాదులమని యనుకొను వారికి తావులేదు. వర్ణైక్యతను కోరుసంఘ సంస్కర్తల యభిప్రాయము లెట్లున్నవో తెలిసికొను కోరికతో యీ వ్యాసమును వ్రాసితిని. కాల ప్రవాహముతో సంఘములో వర్ణసంకరము రాక తప్పదు. కాని ప్రస్తుత ప్రత్యేకసంఘప్రాతినిధ్యాందోళనము, హిందూమహమ్మదీయ వైషమ్యములు, బ్రాహ్మణ, బ్రాహ్మణేతర సమస్య మొదలగునవి సంఘఐక్యతను భంగ పరచి రాజకీయార్థికాభివృద్ధికి అడ్డుకలిగించుచున్నవి. బ్రాహ్మణ మతమను దానిని త్రోసిపుచ్చినగాని, యీ వర్ణవ్యవస్థ మనలను వదలదు. అది వదలనంతవరకు పరులచేతులలో

మనము బానిసలమై యుండకతప్పదు. మతమనునదియే మనకు లేకపోయిన యెడల క్రైస్తవులు, మహమ్మదీయులు, పార్శీలు వారివారి మతములం దెంత అభిమానమున్నను, వారిని మనము సోదరులుగానే చూచుకొన్నపుడు మనయందు యెవరికిని మతవైషమ్య ముండనక్కరలేదు. ఈ పైయభిప్రాయములలో అనేక లోపములుండవచ్చును. గాన, వానిని నెమ్మదిగ విమర్శించి సంఘసంస్కరణవాదులు తమ యభిప్రాయములను తెలియజేయుడని ప్రార్థించుచున్నాను.

---

## 5 వ అ ధ్యా య ము

## అ ష్టా ద శ మ హా పా పి

శ్రీ దుగ్గిరాల రాఘవచంద్రయ్య సచ్ఛాస్త్రిగారు బ్రాహ్మణమతమనుదానిని ఖండించుటతో తృప్తినొందక శ్రుతిస్మృతులలో నుదహరించబడిన వర్ణవివక్షతయనుపాపమునకు ఈనాటి బ్రాహ్మణులను ప్రాయశ్చిత్తముచేసికొని, కార్యాచరణలో దిగవలసినదని యుద్ఘోష చేయుచున్నట్లు నాకగుపడుచున్నది. ఆయాకాలపు పరిస్థితుల కేర్పడిన మతములు యీ కాలములో పనికిరాకపోయినంత మాత్రమున అప్పుడుకూడ అల్పసంఖ్యాకులగు బ్రాహ్మణులు, తమ స్వార్థముకొరకే, యీదేశ

ములోని బహుజనులను తమవశము చేసికొనుటకు వానిని కల్పించిరని చెప్పుట సాహసము. హేతుపూర్వకములుగాని యీ మతములన్నియు ఒట్టి మానవకల్పితములై, అనాగరికులుగ నున్న సామాన్యమానవులకు నీతికరవుటకే గాక, అప్పటి వారు నిజముగా నమ్మినదానిని వ్యాపింపజేయుటకే, ఈ పిచ్చిమతములు యేర్పడియుండును. కాని యిట్టి వేరువేరు మతములు, మానవసౌభ్రాతృత్వమునకు అడ్డుతగలకూడదను మాటసత్యమే. కాని, మనదురదృష్టము వలన మనదేశములో యీ మతసాంప్రదాయములు అనేకముగ వెలసి వేల సంవత్సరములకొలది వివిధవర్ణములు శిలారూపము దాల్చి మనల నందరిని ప్రత్యేక సంఘములలో బంధించివైచినవి. దీనికి మన రాఘవచంద్రయ్యగారు మతకర్తలగు పూర్వ బ్రాహ్మణుల నాడిపోసికొనుటవలన యేమి లాభము? వారు మానవసౌభ్రాతృత్వమునకు వేదాంత గ్రంథములగు ఉపనిషత్తులను గీతయుకూడ రచించిరి. కపిలుడు కాణాదుడు మొదలగువారి సిద్ధాంతములకు వీరు యేమనియెదరు?

ఆధునిక యుగములో గత రెండువందల సంవత్సరములనుండి మన విదేశప్రభువులు యీ దేశములోని అన్నిజాతులకు సమానసౌకర్యములను విద్యార్జనలో కలుగజేయగా, బుద్ధుడు రామమోహన్ దయానందసరస్వతి మొదలగు మతకర్తలు మానవసౌభ్రాతృత్వమునకు దారులు చూపుచుండగా, యేకారణముచేత మన బ్రాహ్మణేతరులు తమ యంతఃశాఖా

వైషమ్యములను నేటికిని వదలలేక అన్యోన్య వివాహములు భోజన ప్రతిభోజనములు జరిగించుటలేదు? హరిజనుల అస్పృశ్యత మన బ్రాహ్మణేతరులేల తొలగించలేదు? తమలో తాము యేల కలియుటకు ప్రయత్నించలేదు? దీనికి బ్రాహ్మణశాఖను యెట్లు ఉత్తరవాదులుగ చేయగలము? దీనికి కారణము, మన మందరము పూర్వపు మత శృంఖలములలో తగుల్కొని విడువనేరకున్నాము. ఈమతమునే త్రోసివేసిన కాని, వర్ణాశ్రమ ధర్మము లడుగంటవు. ఈపని జరుగుటకు గొప్పసాంఘిక విప్లవము కలిగిననే తప్ప మనమందరము, మనగా స్వస్వార్థ సౌఖ్యములకు, మన సంఘములను, యిట్లు నెమ్మదిగ రాజ్యము జరుగుచున్నంత కాలము, యెన్ని న్యాయశాస్త్రనిబంధనలు చేయబడినను, మనము వదలము. అంతశ్శాఖలే కలియుటకు, శూద్రాదులు యిచ్చగించ నవుడు, శాకాహారుడై, వంట యింటి శుచికి అలవాటు పడినవాడై, అను శ్రుతముగా, వంశ పారంపర్యముగ వచ్చు తన అలవాటులను పోగొట్టుకొన జాలని బ్రాహ్మణుడెట్లు తక్కినవర్ణములలో కలియగలుగును? ఇట్లే హిందువులలో ప్రతి సంఘములోని వారును, తమ స్వసంరక్షణ కొరకు తమ సాంప్రదాయములను విడువరు. మాల మాదిగలు మొదలగు వర్ణములనుండి బ్రాహ్మణులవరకు కాలానుసారముగ యెన్ని మార్పులు కలుగుచున్నను, వారి వారి ప్రత్యేకత, వివాహభోజనములలోనైనను స్పష్టముగా కనుపడుచున్నది. దీనికి కారణము, తమరు పుట్టిన సంఘ

మర్యాదలను విడనాడజాలకపోవుటయే. మానవుడు సాంఘిక జీవి. తన సంఘములో తనకు యెన్ని హేతురహితాచారము లున్నను, స్వసంరక్షణకును స్వసౌఖ్యమునకును దానిని విడ నాడలేడు. మరియొకసంఘములో చేర్చుకొనబడుటకూడ కష్టమే. తన నీడనుండి తానెట్లు విడిచిపోలేడో, తన సంఘ మర్యాదలను విడువజాలడు. దీనికొక దృష్టాంతము. కవుతరం గ్రామములో బియ్యపుమర క్రొత్తగా స్థాపించినపుడు ఒక విందుచేసిరి. అప్పడు నేను, మరికొందరు బ్రాహ్మణులము కమ్మవారితో సహపంక్తిని భోజనముచేయుటకుద్యుక్తులమై మాప్రక్కకు మాయందరిస్నేహితుడైన సామ్యుయల్ గారిని భోజనమునకు కూర్చొన బెట్టుకొంటిమి. బ్రాహ్మణుడే మా కందరికి వంటచేసి వడ్డించ మొదలుపెట్టెను. తక్షణము ఆంగ్లేయవిద్యాధికులగు మా కమ్మస్నేహితులందరు మమ్మును విడిచి లేచిపోయిరి. పాపము! వారు బ్రాహ్మణు లెక్కువ వారనియు, వారినిక్రిందకుదింపి వారితో తాముభోజనముచేయ వచ్చునుగాని తమ క్రిందివర్ణములవారితో కలసి భోజనము చేయ కూడదనియు, వారు త్రికరణశుద్ధిగనమ్మియే అట్లుచేసిరి. ఈయభి ప్రాయమే అన్ని వర్ణముల వారికిని, వీరిలో అంతఃశాఖలవారి కిని, అస్థిగతమై నేటికినికలదు. ముఖ్యముగా వీరి స్త్రీలో కము యెక్కువపట్టుదల చూపించెదరు. బ్రాహ్మణునికి తాము అన్నము పెట్టితే తమ రెండు నేత్రములు పోయి రౌరవాదినరకములో పడుదుమనియే వారి యభిప్రాయము.

మన రాఘవచంద్రయ్యగారు దీనినెటుల మాన్పించ గలరు? నేను, యీయన, యెక్కడికోపోయి కలసి భోజ నముచేసెదము. మా వంటయింటిలో మా ఉభయులకు కలపి నాభార్యయు, ఆయన యింటిలో ఆయన భార్యయుకూడ అన్నముపెట్టుటకు తప్పక నిరాకరించుదురు. ఇట్టి భేదభావము నేను నా వర్ణాంతరస్నేహితులుకూడ కనువరచినంతవరకు, మా కైకమత్యము నిజముగ నెట్లు చేకూరకలదు? స్వగౌరవముగల శూద్రుడు, దీనికి ఒడంబడునా? కాబట్టి బ్రాహ్మణుని బ్రాహ్మణమతమును దానిని దూషించుటకు బదులు, ఆ మత మునే విసర్జించి, మన రాఘవచంద్రయ్యగారు అన్యోన్య వివా హములు, భోజనములకును యెట్టి అడ్డంకులు లేని సంఘము నకు పోవలసివచ్చును. ఆ సంఘములోకూడ మధ్యవైష్ణవు నకు వచ్చినట్లు, న్యూనత రాక తప్పదు. కుటుంబసౌఖ్యము, బంధువుల ఆదరణ మొదలైన సౌకర్యములు కోల్పోవలసి వచ్చును. ఇట్లు తెగించిపోవువారు మిక్కిలి అరుదు. కనుకనే మన హరిజనులు తండాలు తండాలుగానే క్రైస్తవులగు చుందురు. ఆ క్రైస్తవులైన వారిని పూర్వ వర్ణ వాసనలు పీడించుచునే యుండును. కాబట్టి కాలమే యీ వర్ణభేదము లను క్రమక్రమముగా నశింపజేయును. ప్రజాస్వామిక ప్రభుత్వ ములోకూడ నిరంకుశ కార్య నిర్వాహకులుండి రాజకీయవిప్లవ ముతోపాటు, సాంఘికవిప్లవము చొప్పించనంతవరకు, యిట్టి నెమ్మదిగల రాజ్యపరిపాలనలో మనప్రత్యేకసాంప్రదాయములు

అలవాట్లు ఆచారములు వదలలేము. ప్రతిసంఘము విద్య లోను ఆర్థికవిషయములలోను వృద్ధినొందినగాని సంఘములో సమానత్వము రాదు. అది రానంత వరకు మనకు స్వరాజ్య ప్రాప్తి చేకూరుట కలలోనివార్త. ఈ ప్రస్తుతవైషమ్య విష వహ్ని మన దక్షిణదేశములో తక్కిన ప్రాంతములకంటె యెక్కువగనున్నది. మనకు యీ ప్రస్తుత కర్మకాండతో చేరిన యీ బ్రాహ్మణమతమును రాఘవచంద్రయ్యగారు త్రోసివుచ్చవలెనన్న పిడివాదములు, అభూతకల్పనలు, వెర్రి నమ్మకములతో నిండిన మతములనన్నిటిని మూలచ్ఛేదము చేయుటకు ఆందోళనచేయుటయే సరియైనమార్గము. మనము చెప్పునది ఆచరణలో పెట్టజాలకపోవుటకు కారణము ప్రత్యేక ముగ వ్యక్తులు తమసంఘములను సామాన్యముగా వదలజా లకపోవుటయే. విప్లవసమయములలో ఒక్కసారిగా తండాలు తండాలుగ ఒకసంఘమును నిర్ణయించుకొనుటయో, లేక ఆర్య సమాజ బ్రహ్మసమాజములలో యెన్ని పిచ్చినమ్మకము లున్నను, వర్ణభేదము పాటింపబడదు గనుక చేరుటయో తటస్థపడవచ్చునేమో! ఇట్లు జరుగనంతకాలము రాజకీయ ముక్తికి మనలో తగిన అయికమత్యము కుదరనేరదు.

---

## 6 వ అధ్యాయము

### వర్ణము జన్మసిద్ధమా ?

శ్రీ బంకుమల్లి మల్లయ్యశాస్త్రిగారు "వర్ణమీమాంస" యను వ్యాసములో యీ విషయమై నిర్ణయించిన సారాంశములను శ్రీ జటావల్లభుల పురుషోత్తంగారు ఖండించిరి. వీరుభయులు వేదప్రామాణ్యము ఒప్పుకొన్నట్లు కనపడుటచేతనే ఈ చర్చ సనాతనధర్మవాదులకు రంజకముగా నుండవచ్చునుగాని ఆధునికభౌతికశాస్త్ర పరిశోధనలనుబట్టి పరిణామవాదమును అంగీకరించువారికి యిది నిరుపయోగమేగాక వేదములోని యీ వివిధవర్ణసృష్టినిగురించి వ్రాయబడినదంతయు శుద్ధ పొరబాటని గోచరింపకతప్పదు. మల్లయ్యశాస్త్రిలుగారు వర్ణము జన్మసిద్ధముకాదనియు భగవద్గీతలో సూచించునట్లు గుణకర్మలనుబట్టి యేర్పడినదనియు సాధించదలచిరిగాని, పురుషోత్తంగారు, వేదములోని యితరభాగములనుండి, జన్మవలననే వర్ణము యేర్పడినట్లు కొన్నికారికలు చూపించిరి. ఒక విధముగా వీరి రెండుఊహలను సమన్వయపరచవచ్చును. మొదట వర్ణములు, జన్మవలనకలిగినను, తరువాత వానిని గుణకర్మలవలన మార్చుకొనవచ్చును. (Nature and Nurture) అట్లు మారినట్లు శృతిస్మృతిపురాణములలో అనేక దృష్టాంతము లున్నవి. ఇదిగాక వేదభాగము లన్నియు యేక కాలమందే వ్రాయబడలేదు. చతుర్వేదములలోని మంత్రము

లన్నియు తారుమారై యుండవచ్చును. వీనినన్నిటిని సమన్వయించుట పొసగనేరదు. ప్రస్తుతమందు శిలారూపములు దాల్చిన వర్ణములు పూర్వకాలమందు ఒకజన్మలోనే మారుచుండినట్లు మన వేదశాస్త్రములే వెయినోళ్ల ఘోషించుచున్నవి.

ఈ చర్చవలన మరికొన్ని సందేహములు బయలుదేరుచున్నవి. ఇట్టి వర్ణవ్యవస్థలేని దేశములలోని మానవులెట్లు వర్ణరాహిత్యముగ పుట్టిరి? అక్కడివారు గుణకర్మలచేతనే విభాగింపబడుచున్నారా? వారికి మన వేదప్రామాణ్యమేల లేదు? వారి మతగ్రంథములలో సృష్టిక్రమము వేరుగానుండుటకు కారణమేమి? వీరందరు తగవులాడుటకేనా, భగవంతుడు, యీ వివిధమతముల నేర్పాటుచేసెను? నిజమేమనగా యీ మతగ్రంథములన్నియు' దేవుడు బోధించినవి కావు. వీనిలోని విషయము లన్నియు ఒట్టి ఊహాజన్యములు. అభూతమానవ కల్పితములు. సంఘములు శైశవదశలో నున్నపుడు వానిలోని కొందరు ప్రబుద్ధులకు తోచినట్లెల్ల చెప్పుకొనదొడంగిరి. ఇట్లు నేను వ్రాయుట మనలో అనేకమందికి కష్టముగానున్నను, సత్యమును గ్రహించవలయునని, నిద్రనుండి లేపుచుండుట విధియని నా యభిప్రాయము.

పురుషోత్తముగారు లిఖించిన వేదమంత్రమే దీనికి దృష్టాంతము. దీనిని నమ్మువారిని యీ కాలములో పిచ్చివారనియు, అనాలోచనపరులనియు పిలువవలసియుందుము.

మీదుమిక్కిలి, దీనిని నమ్మకపోయినను, తమ మతము కూలి పోవునేమోయను భయముచేత చీటికిమాటికి సమర్థించుకొనఁ జూచు పెద్దలను లోకవంచకు లని పిలువకతప్పదు. దేవునికి మనకువలెనే కొన్ని అవయవము లున్నట్లును, అతని ముఖము నుండి బ్రాహ్మణుడు మేకయు తరువాత అతని బాహువుల నుండి రాజును గొర్రెయు, అతని ఊరువులనుండి వైశ్యుడు, ఆవును అతని పాదములనుండి శూద్రుడు గుఱ్ఱమును పుట్టి నట్లును, నమ్ముట యెంతవెర్రి? మానవులలోని వర్ణములవలె, యీ చతుష్పాదజంతువులలో కూడ ఉచ్చనీచదశలున్నవి కాబోలును. ఈభేదములను మనము పాటించుటలేదు సరికదా మనకెక్కు డుపయోగకరమగు గోవునకే అగ్రస్థానము నిచ్చు చున్నాము. బ్రాహ్మణునికంటె గోవే యెక్కువ పవిత్రము, శ్రేష్ఠము. దానితోపాటు పుట్టిన వైశ్యున కేల అగ్రస్థాన మీయరు?

ఇట్టి చర్చలవలన ఒకలాభ మున్నది. వేదప్రామా ణ్యము నంగీకరించువారి వాదములలోని స్ఖాలిత్యములను ప్రజ లకు కనపరుచుచుండుటవలననే యీమతము లన్నియు విశ్వా సపాత్రములు కావని జనులు గ్రహించెదరు. వేదములలో పైనచెప్పినసృష్టిక్రమము భౌతికశాస్త్రములమీదనాధారపడిన పరిణామసిద్ధాంతమునకు కేవలము వ్యతిరేకము. దీనిని తెలిసి కొనకుండకనే ఆర్యప్రజాసంఘముల పూర్వగ్రంథములలో వ్రాసినదంతయు సత్యమని సమర్థించు విద్యాధికుల నేమన వలెనో, చదువరులకు వదలివేయుచున్నాను.

---

## 7 వ అ ధ్యా య ము

## లో క వ ం చ కు లు

మన హిందువులలో ప్రకృతిశాస్త్రములలో పరిశ్రమ చేసినవారుకూడ, వానిలోని సూత్రములకు విరుద్ధములైన పూర్వాచారములను పట్టుకొని వ్రేలాడుచుందురు. ఈ యా చారములు శుద్ధమౌఢ్యము లని తమకు తెలిసియున్నను సంఘ ములోని పూర్వపద్ధతులను విడువజాలకనో, లేక జనసామాన్య ముచే తాము పొగడబడవలెననో, యిట్లు చేయుచున్నారు. తమ తల్లిదండ్రులు ముప్పదిసంవత్సరములక్రింద చనిపోయినను వారింకను మనమిచ్చు మెతుకులను నీళ్లను స్వీకరించి బ్రతుకు చున్నారనియు యీభౌతికశరీరము వదలిన యాత్మగాని దాని సూక్ష్మశరీరముగాని మరియొక యుపాధిని అప్పుడే చూచు కొని యున్నదని మన వేదాంతమే ఘోషించుచున్నను, వీరు, వీరికొమాళ్లు, మనుమలు, మునిమనుమలు మొదలగువా రందరు, పెట్టుచున్న నీళ్లు మెతుకులు 14 తరములవారికి ముట్టుచున్నవనియు, వీరు యీ తిథిప్రయోజములు చేయుచునే యుందురు. దీనికి లిమిటేషన్ లేదు. ఇట్లే తమ భౌతికశాస్త్ర జ్ఞానము నంతయు వదులుకొని గ్రహణస్నానములు, పుష్కర స్నానములు, విఘ్నేశ్వరపూజలు, యేకాదశివ్రతములు మొద లగువానిని చేయుచు పైపెచ్చు వీని నన్నిటిని సమర్థించ చూచెదరు. తమ అజ్ఞాన సోదరులకు మార్గదర్శకులై వీనిని

త్యజించుటకు బదులుగా తామే వాని నాచరించుట కడు శోచనీయము. వీరు ప్రతిస్మార్తకర్మలోను పాల్గొనుచు తమకేల దానిని చేయుచున్నారో తెలియక తమనోట నుచ్చరించున దేమో తమ పురోహితులతో పాటు తమకే తెలియక అట్టి కర్మలను చేయుటకు వీరికేల సిగ్గులేదో!

దైవమును గురించి అనుదినము ఊహాజన్యములైన వేదాంతచర్చలలో మునిగి తేలుచు, నానావిధ వికృతరూపము లుగల రాళ్ళను పూజించుటకేల వీరు దేవాలయముల కరిగె దరో నేను గ్రహించజాలకున్నాను. వీరిని ఆత్మవంచకులను టకు బదులు లోకవంచకులనియే చెప్పనొప్పును. కేవలము మూఢవిశ్వాసములతో నమ్మిన సామాన్యజనులను నేనెన్నడు నిందించను. వారి అజ్ఞానమునకు జాలి చెందెదను. కాని త్రిక రణశుద్ధిగ నమ్మని విద్యాధికుల చర్యలనే నేను నిరసింతును. వీరట్లు నమ్మలేదనియు నమ్మిరనియు, వీరి దినచర్యయే స్పష్ట పరచుచుండును. కళాశాలలో భూగోళశాస్త్రమును విద్యా ర్థులకు నేర్పుఉపాధ్యాయుడు గ్రహణముకలిగినపుడు పట్టువిడుపు స్నానములు చేయుట, భోజనము మానివేయుట, గర్భవతియగు తనభార్యను గ్రహణము చూడవలదని నిర్బంధించుట, విఘ్నే శ్వర చవితినాటి చంద్రుని శమంతకమణి చరిత్ర చదివి అక్ష తలు నెత్తిమీద వేసికొనిగాని చంద్రుని దర్శించకపోవుట యీ మొదలగు పిచ్చిపనుల చేయుచుండినయెడల వారి నేమనవల యును? ఇది యంతయు లోకసంగ్రహార్థమే కాబోలును!

గణితశాస్త్రము. (౨) ఖగోళశాస్త్రము, వేదాంతశాస్త్రములు మొదలగునవి నేర్పు కాలేజి పండితులు తమ బుద్ధియు జ్ఞానము నుపయోగించక గ్రహఫలములను చెప్పు జ్యోతిషమును నమ్ముచు తమ యిండ్లలో జరుగు శుభకార్యములన్నిటికిని చంద్రతారాబలములు, సుముహూర్త దుర్ముహూర్తములు, సుదినదుర్దినములు, తిథివార నక్షత్రములు, వర్జములు శకునములు మొదలైనవి పాటించుచున్నారు. వీరినడత నెట్లు తమ విద్యార్థుల యెదుట సమర్థింప జూచెదరో నే నూహింపజాలకున్నాను. కొందరు తమకు తెలిసినట్లు నటించుట యితరులను మోసపుచ్చుటయే యని యేలతలచరో దురూహ్యము. ఇట్టివారు సత్యాన్వేషణమున కునికిపట్టులగు కళాశాలలలో బోధకులుగా నుండుటవలన వానికపకీర్తిని తెచ్చుచున్నారని నా యభిప్రాయము. మూఢత్వమును పారద్రోలుట కేర్పడిన ఈ శాస్త్రపండితులు తమరు విశ్వసించని, విశ్వసింపజాలని తమ శాస్త్రములచే సమర్థింపబడని యిట్టి విషయములు సత్యములని, తమశిష్యులను నమ్మునట్లు తమ చర్యలవలనను మాటలవలనను కనుపరుచుట కడుశోచనీయము. ఇట్టివారు యెంత శీఘ్రముగ తమ పదవులనుండి వెడలగొట్టబడిన ప్రజల కంతశ్రేయోదాయకము. ఇట్టి లోకవంచకులు ముఖ్యముగా విశ్వవిద్యాలయములలోను వానికనుబంధములగు కళాశాలలలోను పాఠశాలలలోను ఉండతగరు. వీరివలన తరిబీతగు విద్యార్థులు యెట్టి విమర్శజ్ఞానమును లేని లోకవంచకులు కాకతప్పదు.

---

# 8వ అధ్యాయము

## స్వధర్మ పరధర్మములు

శ్రేయాన్ స్వధర్మోవిగుణః । పరధర్మాత్స్వనుష్ఠితాత్
స్వధర్మే నిధనం శ్రేయః । పరధర్మోభయావహః ॥

గీత అ. 3. శ్లో 35.

తా॥ పరకీయమగు ధర్మము సుఖముగ నాచరించుటకు వీలయినను దానికంటె తన ధర్మమే విగుణము అనగా దోష సహితమైనను మిక్కిలి శ్రేయస్కరమైనది. స్వధర్మానుసారముగ ప్రవర్తించునపుడు మరణించినను కళ్యాణము కలదు కాని పరులధర్మము భయంకరమైనది—

[తిలకుమహారాజు గీతారహస్యము.]

పై వాక్యములను తరుచుగా సనాతనధర్మవాదులు తమ వాదబలమున కుపయోగించుచుందురు. ఇక్కడ స్మృతికారులు చాతుర్వర్ణ్యవ్యవస్థానుసారముగ ప్రతి మనుజునకును శాస్త్రము విధించిన వ్యాపారమని తిలకుగారు అర్థముచేయుచు, ఈ వ్యవస్థలేని ఇతర జాతులలోని వివిధవ్యాపారస్థులకుకూడ యీ వాక్యము వర్తించునని యభిప్రాయపడిరి. అటులగుచో, ఈ ధర్మసూత్రము ప్రపంచమంతటను, బుద్ధిమంతులు, ధీమంతుల చేత కూడా అనుదినము ఉల్లంఘించబడుచున్నది. ఇట్టియుల్లంఘనము పాప మనియా? లేక, అనాలోచితముగ చేయబడి

నపుడు బాధకరముకావచ్చుననియా? గీతలో స్పష్టముగ చెప్పినప్రకారము మనలోని చాతుర్వర్ణ్యధర్మములు, గుణకర్మలచేత స్వభావజన్యములైనంతమాత్రమున, గుణములు మార్చుకొనగలిగినపుడు ధర్మములుకూడ వానితోపాటు ఏల మార్చుకొనగూడదు? అట్లు మార్చుకొనుటవలన ఇహలోకములోను, పరలోకములోను, బాధ లేల కలుగవలెను? విద్యాజ్ఞన వలనగాని విద్యాశూన్యతవలనగాని, వివిధవృత్తుల నవలంబించవలసి వచ్చినపుడు, ఆవృత్తులలో న్యాయముగ జీవించువారికి ఎట్టిదోషము కలుగునని నేననుకొనను. ప్రతివాడును, తనశక్తిని ననుసరించి, తన వృత్తిని మార్చుకొనవలసి వచ్చుచుండును. ఆయన కుటుంబములోని మెంబర్లే వివిధవృత్తులలో చేరి పొట్టపోసికొన వలసియుందురు. ఈ కారణముచేత, వీరు పూర్వపు స్మృతుల క్రింద, వేరు వేరు వర్ణములతో చేరిరని మనమెంచవచ్చును. కాని ఈ కాలములలో మనమందరము శూద్రధర్మమునే అవలంబించుచున్నట్లు కనపడుచున్నది. కసాయివాడుకూడ సంఘమున కవసరమే. ఆ విధముగనే పాకివాడును. కాని వీరి కుటుంబములోని వారందరకును వారి వృత్తులే ధర్మములై, వీరిలో మేధావంతులు స్వధర్మమును మానుకొని పరధర్మస్వీకరణము చేసినంతమాత్రమున, అది భయావహమెట్లగును? ఇతరు లవలంబించు ధర్మాచరణకు తాను దగియున్నానో లేదో యని మొదట సంకోచము, భయము కలుగవచ్చును. ఇట్లు సందేహము కలిగినపుడే,

పరధర్మము భయావహమనియు, తన తాత తండ్రులకు వంశపారంపర్యముగ వచ్చు వృత్తులలోనే యుండి ఆ సంఘము వారిని వదలి నూతన సంఘములో చేరకుండుటే శ్రేయస్కరమనియు గీతాకారుని యభిప్రాయమైనట్లు నాకుతోచుచున్నది. అట్లు కానిచో, తన గుణకర్మలను బట్టి ( Nature and Nurture, i. e,, heredity and environment) మరియొక వృత్తికి కావలసిన యోగ్యతలను సంపాదించగలవానికి భయమేల? వివిధవర్ణములవారిలో హెచ్చుతగ్గులు లేకుండ సోదరభావమేల యుండకూడదు? మతములు మార్చుకొని, వేరు సంఘములలో ఏల చేరకూడదు? లేక హైందవు లనుకొనుటకు, ఇతరజాతులలో వారికి ప్రత్యేక యోగ్యతలేమికావలెను? విద్యార్థులగు పెద్దలు, పై ధర్మసూత్రమును ఇప్పుడెట్లు ఆచరణలో పెట్టవచ్చునో వ్రాయుడని ప్రార్థించుచున్నాను.

---

## 9వ అధ్యాయము

---

## సంశయాత్మ

"సంశయాత్మా వినశ్యతి" యను లోకోక్తిని, మతగ్రంథకర్తలు, మతాభిమానులు మాటిమాటికుపయోగించుట వాడుకయైపోయినది. మానవుని జ్ఞానమునకు కొన్ని మేరలున్నవి. ఆధ్యాత్మికవిషయము లనునవి మనజ్ఞానాతీతమైనవి.

వీనిని గురించి ప్రతిపాదించు శాస్త్రమే వేదాంతశాస్త్ర మని పిలచెదరు. దేవునికి ఆకారముగాని, ఉనికిగాని, మనము స్థిర పరచజాలము. ప్రకృతీపురుషుల ప్రత్యేకత్వము, అయిక్యత్వ ములను గురించి, నేటికిని భిన్నశిద్ధాంతములుగ వేదాంతుల మధ్య వాదన జరుగుచునే యున్నది. ఈ ప్రపంచవ్యవహారము లన్నిటిలో హేతువాదనయే ప్రధానమైనను, ఊహలమీద యాధారపడిన ఆధ్యాత్మికవిషయములలో దానికి తావు లేదు. కాని, అది యెంత బలహీనమైన స్థితిలో మానవుల కున్నను, అది తప్ప, వారికి దారి చూపునది మరియొకటి లేదు. ఈ హేతువాదనను దేవుని విషయమై చేసినపుడు, మనము చూచుచున్న దంతయు దేవుడే యనవలెను. (Pantheism) లేదా ఆయన లేనేలేడని యనవలెను. (Atheism) లేక, యీ సృష్టి యెట్లు సంభవించినది మన కేమియు తెలియదని యైనను యనవలెను. (Agnosticism) మన వేదాంతులలోని భిన్నాభిప్రాయములు మనల నందరిని ఒకే గమ్యస్థానమునకు తీసికొనిపోవును. అది అపనమ్మకము. మన వేదములు, ఖురాన్, బైబిల్ మొదలగు శ్రుతులలో చెప్పబడిన విషయము లన్నియు సంశయాస్పదము లైనట్టి ఊహాజన్యములు. అచిం త్యుడు, అవ్యయుడు, నిరాకారుడు, నిరంజనుడు అని దేవుని గురించి, అవి చెప్పుచున్నపుడు, మనము ఆయనను గురించి స్పష్టముగ గ్రహించగలిగిన దేమున్నది? ఈ ప్రకృతియొక్క ఆద్యంతములు, దేవుడనువా డొక డుండినను, ఆయనకైనను,

తెలుసునో, తెలియదో యెవరు చెప్పగలరని ఋగ్వేదము లోని నాసదీయసూక్తములో స్పష్టముగా వ్రాయబడియున్నది. (10 మం—129 సూ.)

మనము చేయు పనులన్నిటికిని మనకు సంపూర్ణ స్వాతంత్ర్య ముండి, దుష్టశిక్షణ, శిష్టరక్షణలను చేయు దేవు డనువాడొక డుండినయెడల, మనము కన్నులార అనుదినము ప్రత్యక్షముగ చూచుచున్న విషయము లన్నిటికిని, అదృష్టము మీదనో, లేక పూర్వజన్మకర్మమీదనో, మన మాధారపడక తప్పదు. ఇది సత్యమైనచో, మనకు దేవునితో సంబంధమే లేదు. మన పూర్వజన్మకర్మలను బట్టి మన ప్రస్తుత జీవనము యేర్పడుచున్నదని భావించుచో, కర్మలకు పునాది మొదట యెట్లు కలిగినదని ప్రశ్నింపగా కర్మ కూడ అనాది యని, యీ కర్మవాదులు తప్పించుకొన జూతురు. ఈ ప్రపంచనిర్మాణములో న్యాయమునకు గాని, బుద్ధికి గాని తావు లేనట్లే కనఁపడుచున్నది. మొదట కీడు యీ ప్రపంచములో యేల యుండవలసి వచ్చెనో, ఆస్తికు లెవరును చెప్పజాలరు. కాబట్టి యీ యాధ్యాత్మికవిషయములలో మన కేమియు తెలియదని ఒప్పుకొనవలసినదే.

స్వతంత్రచిత్తము మానవునికి లేనేలేదని ఆస్తికులు కూడ ఒప్పుకొనవలసి వచ్చినపుడు, దేవుడు న్యాయకర్త యగునాకాదా యను ప్రశ్నతో మనకు పనియే లేదు. మన బాధలకు ఆయన నెట్లు జవాబుదారునిగ చేయగలము? కాబట్టి

యీ విషయ మంతయు అగోచరమని మనము ఒప్పుకొనక తప్పదు. ఏమతశిద్ధాంతముగాని మనకు తృప్తి కలిగించనేరదు. ఈ ప్రపంచములో జరుగున దంతయు మన మంచికే యని మనస్సమాధానము చేసికొను శిద్ధాంతములో యెట్టి పసయు లేదు. అట్లు చెప్పుకొని తృప్తినొందువారు సౌఖ్యవంతులే కావచ్చును. కాని అట్టివా రెట్టి వాదములోను దిగకూడదు. ఈ ప్రపంచములోని కీడు మేళ్ళవుట్టుకను గురించిన సమస్యను యెవరును పరిష్కరించజాలరు. మన యనుభవమునే ప్రమాణముగ గైకొన్న యెడల మన కేమియు యీ ఆధ్యాత్మికవిషయములను గురించి తెలియదని ఒప్పుకొని తీరవలెను. ఇట్టి సంశయాత్మలు నీతియందు నమ్మకమును తగ్గించెదరని కొందరాస్తికు లనెదరు. కాని, నీతి మానవుల చిరకాలానుభవము మీద నాధారపడి, దాని పునాదులు, మతములవానికంటె యెక్కువ బలమైనవనియు, హేతువులతో కూడినవనియు మనము గ్రహించవలెను. మతనమ్మకములు, పటాపంచ లగుచున్నవి. నీతిసూత్రములు, కాలక్రమమున మారుచు, అభివృద్ధి నొందుచున్నవి. వానిలో సంఘైక్యమునకును శ్రేయమునకును ఉపచరించునవి కొన్ని ముఖ్యసూత్రములు గట్టిపునాదులు కలిగియుండుటచే మార్చబడక శాశ్వతముగానే యున్నవి. కాబట్టి మూఢవిశ్వాసములతో కూడిన మతములకును, నీతికిని యెట్టి సంబంధమును లేదు. ఆ మూఢులగు ప్రజలలో ఆనీతి నిలుపుటకే అభూతకల్పనలు, పిట్టకథలు, పిచ్చియూహలతో

నిండిన మతగ్రంథములు ఆయా దేశములలో ప్రత్యేకముగ బయలుదేరినవి.

ప్రత్యక్షప్రమాణము లేనిదే, యేదియు నమ్మకూడ దని నే ననుట లేదు. భౌతికశాస్త్రములలోని విషయములను, మనమందరము స్వయముగా చూచి పరీక్షించకపోయినను మనము నమ్మవలసియుందుము. అనేక మేధావంతులు, ఒక రితో నొకరు సంబంధము లేనివారు, వివిధదేశీయులు, స్వయ ముగచూచి సత్యమును కనుగొన్నవారు, ఏకకంఠ్యముగ తమ పరిశోధనలవలన తెలిసికొన్న జ్ఞానమును మనకు కనుపరచి నపుడున్ను, మనమే స్వయముగా దాని సిద్ధస్థితిని, ప్రయత్నించి కనుగొన గలిగినపుడున్ను వారి మాటలను మనము నమ్మ వచ్చును. కాని ఊహాలమీద నాధారపడి, వివిధ వేదాంతులు, భిన్నాభిప్రాయములను కనుపరచినపుడు, గ్రుడ్డెద్దు చేనుమేసిన రీతిగా మనము నమ్ముట మిక్కిలి హాస్యాస్పదము. మీ కిష్టమువచ్చిన యూహాలను నమ్మి మీ మనస్సును తృప్తి పరుచుకొనవచ్చును గాని, అది సత్యమని ఉపన్యాసము లిచ్చుచు యితరులను నమ్ముమని సలహాయిచ్చుటకూడ పొర బాటనియే నా యభిప్రాయము. కాబట్టి మూఢ విశ్వాసము లకు లోనుగాక, వేలశతాబ్దముల నుండి, మానవుల యనుభ వమునుబట్టి యేర్పడిన సాంఘిక నీతిసూత్రములకు మాత్రము కట్టుబడి, కాలానుసారముగసాంఘికాచారములనుమార్చుకొను చుండుటకుప్రయత్నించుటే శ్రేయము. దేవుడు, ఆత్మ, స్వర్గనరక

ములు, జన్మపరంపరలు మోక్షము మొదలగు ఆధ్యాత్మిక విషయ చర్చలను గురించి ఆలోచించుకొనుచు కాలము వృథ పుచ్చవలదు. మతములను గురించి అసలే తలపెట్టవలదు.



## 10 వ అధ్యాయము

### గాంధీ పూజ

మహాత్మాగాంధీగారి విగ్రహప్రతిష్ఠను గుంటూరుజిల్లా మంత్రిపాలెములో ఆయనయనుచరులగు కొందరు నాయకుల అధ్వర్యముక్రింద అక్కడిప్రజలు జరిగించిన విషయమును చదివితిని. మహాత్ముని సత్యసంధత, అహింసా పరత్వము, విశ్వ మానవకోటియందు సమానప్రేమ, సత్యగుణము, స్వార్థరాహిత్యము లోకమంతయు ప్రశంసించుచున్నవి గనుకనే అతనిని లోకోత్తరపురుషుడని మన మెల్లరము భావించుచున్నాము. కాని, తాను మానవమాత్రుడనేయనియు సర్వదా తప్పులు చేసి దిద్దుకొనుచుందుననియు మనతోపాటు ఆయనయు ఒప్పుకొనుచున్నపుడు మనము ఆయనను దైవముగానెంచి పూజించుట మన మనోబానిసత్వమునే వెల్లడించుచున్నది. విద్యాధికులగు యీ యధ్వర్యులు అసలు దైవవిగ్రహారాధనయందే విముఖత్వముచూపుచు తమసోదరులకు మార్గదర్శకులగుటకు బదులు, యెంతబుద్ధిశాలియైనను ఒకమానవ మాత్రుని దైవ సమానునిగచేయుట తగదు. మన దశావతారములు సహా మానవులేగాని దైవముకారని యీకాలములో బుద్ధికుశలత

గలవారు అనేక కారణములు కనుపరచుచుండగా మన గాంధీగారు దేవదేవుడైనట్లు ఆగమవిధుల ననుసరించి ఆయన శిలావిగ్రహమునకు ప్రాణప్రతిష్ఠచేయుట, ఊరేగించి హారతులిచ్చి పూజలుచేయుట, నిరశించవలయును.

జ్ఞాపకచిహ్నములుగ మృతులైనవారికేగాక జీవించియున్నవారికికూడ శిలావిగ్రహములు, తులశికోటలు, మశీదులు, స్తంభములు, చిత్రపటములు మొదలైనవి యేర్పరచుట అన్నిదేశములలో ఆచారమేగాని యీవిధముగ యీశ్వరునకు, లేక కొందరు దేవతలకు, యేర్పరచబడిన ఆగమశాస్త్రవిధులు, ఆరాధనలు మంగళహారతులు పూజలు మొదలగు శాస్త్రోక్తవిధులు ఒకసామాన్య మానవునికిచేయుట పరిహాసాస్పదము. ఉపవాసము చేయుటకూడ ఒకసాధనమేగాని, ప్రకృతిబాహ్యమైన విషయ మెన్నటికికాదు. మనగాంధీగారు పూర్వయుగములయందుండినయెడల బుద్ధుడు, శంకరుడు, క్రైస్తు, మహమ్మదు మొదలగువారివలె మతస్థాపకుడై యుండునేమోగాని యీనవయుగములో నూతన మతస్థాపకులకు స్థానములేదు. ఇప్పుడు పైవారిని విగ్రహముగాచేసి పూజించుటకు ప్రజలొల్లరు. మనమందరము మహాత్ముని మొత్తముమీద ఒకస్థితప్రజ్ఞుడైన లోకోత్తరపురుషుడని యెంచవచ్చునుగాని, విద్యాధికులగు వీరియనుచరులలో కొందరు మితిమీరిన యుత్సాహముతో అమితమైన మూఢభక్తితో యిట్లు అయననను దైవసమానునిగ చేయుట ఆయనయే నిరసించునని నేను నమ్మెదను.

---

## 11 వ అధ్యాయము

## నిరశన వ్రతము

మనలో బహుమంది తామస రాజస గుణ ప్రధానులగుటచే కోపముచేతను, పగచేతను, అప్పుడప్పుడు తమ భార్యా, బిడ్డలు, స్నేహితులమీద శపించి ఒకటి రెండు పూటలు భోజనముచేయుట మానివేయుదురు. స్త్రీలు సహజముగా అబలలైనందున, యీ విధానమును తరుచుగా నవలంబింతురు. మతవిశ్వాసముచేత యేకాదశి మొదలగు కొన్ని పర్వదినములలో నిరాహారముగా నుండుట మనము చూచుచునే యున్నాము. కాని యిట్టి తాత్కాలికోపవాసమును వారు శీఘ్రముగానే విరమించెదరు. ఇతరులమీద కోపముంచుకొనక వారు చేసినతప్పులకు జాలినొంది వారికి హృదయపరివర్తన కలుగుటకుగాను మన జనసామాన్యములో కొద్దిరోజులైనను నిరశనవ్రతము పూనుచుండుట మిక్కిలి అరుదు. ఇట్టి సత్వగుణప్రధానమైన నిరశనవ్రతము మహాత్ములవారు చాలాకాలమునుండి ఆచరణలో పెట్టుచుండిరి. తన భార్యా, బిడ్డలును, తనయాశ్రమవాసులును చేయు పనులకు వారికే పశ్చాత్తాపము కలుగవలెనని యేసుక్రీస్తువలె దానే బాధనొందుచు ఒకటి రెండు దినములు మొదలు యిరువది, ముప్పది దినములవరకుకూడ నిరశనవ్రత మవలంబించుట యీయనకు పరిపాటియైపోయినది. దీనివలన ఆర్ద్రహృదయులై

యీాయనయందు ప్రేమ, గౌరవము హెచ్చి యీాయనయుద్యమములలో వారు మిగుల నుత్సాహముతో పాల్గొనుట సంభవించినది. ఇట్టి విధానమును వ్యక్తులమీాదను, చిన్న సంఘములమీాదను ప్రయోగించి చూచెను. దక్షిణాఫ్రికా, భారతదేశములోని కైరా, చాంపరాన్, బార్డోలి మొదలగు ప్రదేశములలో తన యనుచరుల సహాయముతో యీా విధానము నాచరణలో పెట్టి కొంతవరకు జయము పొందెను. గత 12 సంవత్సరములలో మిక్కిలి విశాలమైన విదేశీయులచే పరిపాలింపబడుచున్న యీా భారతదేశమునకు స్వరాజ్యము చేకూరవలెనని యీా విధానములో మగ్నుడై యుండెను. ఇట్లు స్వరాజ్య సంపాదనకు అరుకోట్ల అస్పృశ్యులు అడ్డు తగులుచుండుటచే యీా అస్పృశ్యతా నివారణకు కూడ యీా విధానమునే ప్రయోగించుటకు నిరశనవ్రతము చేసిరి.

ఈయనకు, భగవంతునిమీాద భారము వేయుట, పునర్జన్మను గురించి విశ్వాసము, భగవద్గీతలలో ప్రతిపాదింపబడిన జ్ఞానకర్మ భక్తియోగ మార్గములందు నమ్మకము, బాగుగా కుదిరి, యీాయన నిరశనదీక్షా విధానము ఒక మత సాంప్రదాయముతో ముడివేయబడియున్నది. ఇట్టిది వీరియనుచరులలో యెవరికిని లేదని చెప్పకతప్పదు. వారి కిట్టిసాధకము లేనేలేదు. ఇంతయేల? లోకములో యీా నూతనవిధానమును ప్రాపంచిక వ్యవహారములలో ఆచరణలో పెట్టతగినవాడు, పెట్టగలవాడు, పెట్టుచున్నవాడు యీాయనయొక్కడే

కనపడుచున్నాడు. ఈవిధానము తుదకు జయమగుగాక. అపజయమగుగాక. నానాదేశ పూర్వచరిత్రలలో, సాంఘిక రాజకీయ విప్లవములకు యిట్టి నిరశనదీక్షావిధానమును యింత గొప్ప వైశాల్యముగల దేశములో ఆచరణలో పెట్టుటకు ప్రయత్నించువారిలో, యిప్పటివరకు యీయన ఒక్కడే కనపడుచున్నాడు. మతవిషయములలో, క్రైస్తు మహాత్ముడు బుద్ధుడు కన్ఫ్యూషయస్ జోరోస్ట్రర్గుండుగాక. ఆవిషయము భౌతికసంబంధమైనదిగాక, కేవలము అధ్యాత్మిక సంబంధము కలిగి జనులు తరించుట కేర్పడినది. ఇది యట్లుకాదు. ఈనవ నాగరిక యుగములో ప్రజల దినచర్యలలోనే మార్పు కలుగ చేసి, విశ్వమానవకోటి సౌభ్రాతృత్వమును పెంపొందించి వారి రాజకీయ సాంఘికదాస్యశృంఖలములను తెగనరకుటకు పూనుకొన్న ఒకమహావ్యక్తియే యీ గాంధిమహాత్ముడు. అహింసాసత్యములమీద నాధారపడి దెబ్బలుతిని కారాగృహ ప్రాప్తి కలిగినను ఓర్చుకొనునట్లుచేసి యెనుబది వేలమందిని జైళ్లకు పంపగలిగిన మహానుభావు డేదేశములోను యింత వరకు పుట్టలేదు. ప్రాణమును గడ్డిపరకవలె యెంచి ఒక మహోద్యమమునకై దానిని ఒడ్డువాడు యీయన ఒక్కడే కనపడుచున్నాడు.

దేవుడు, ఆత్మ, పునర్జన్మ, ప్రార్థనలను, యీయనవలె గట్టిగనమ్మినవారందరు మాత్రము యిట్టి కర్మయోగవిధానము నాచరింపగలరా? ఇట్టి యాధ్యాత్మిక విషయములలో

యెట్టినమ్మకము లేకపోయినను కొందరు తాత్కాలికముగ యిట్టియుపవాసదీక్ష నవలంబించినను తమయావజ్జీవము యిట్టి యుపవాసదీక్షను మత సాంప్రదాయముగ నెంచి దీనినింత తరుచుగా నాచరణలో పెట్టుట కెంత సాధనయుండవలెను? ఈ మతసాంప్రదాయమందే, యీయన యనుంగుశిష్యులకే నమ్మకమున్నట్లు కనపడదు. మన మెవ్వరము యిట్టిదీక్షను పట్టలేము, సరికదా, నావంటివా రనేకులు దీనిని పట్టనొల్లరు. "చచ్చి యెవరిని సాధింపగలము" "జీవన్భద్రాణిపశ్యతి" 'శరీర మాద్యంఖలు ధర్మసాధనం' అను ఆర్యోక్తులే తలపునకు వారుచుండును. ఇట్టి మనోభావములు మృత్యువునకు భయపడుటవలననే జనించక పోవచ్చును. నాస్తికుడైనను ఒకప్పుడు తనమీదనే తానాధారపడి మృత్యువెప్పుడైనను తనకుతప్పదని తెలిసికొని యేమహోద్యమములో నయినను తనప్రాణమునను ధైర్యముతో నొడ్డవచ్చును. ఇట్టివారిలో 60 సంవత్సరములు ఆజన్మాంతమువరకు దీక్ష ననుభవించినవాడు బుద్ధుడు గనుకనే యీయనను భగదవతార మని కోటానకోట్లు యిప్పటివరకు మెంచుచున్నారు. కాని యీయిరువదవ శతాబ్దములో ఆయనపుట్టిన యెడల అట్లుజనులు యెంచెదరో లేదో సందేహమే. గాంధిమహాత్మునివలె ఆయననుకూడా ఒకలోకాతీత పురుషుడని మాత్రమే యెంచియుందురు. పూర్వకాలపు ప్రజలలోని మతనమ్మకము లిప్పుడు నశించి పోవుచున్నవి. గనుక యిట్టివారికి యిప్పుడు శాశ్వతపలుకు

బడి యుండనేరదు. విమర్శనలకు వీ రందరు గొప్పనుత ప్రవర్తకులతో పాటు గుఱిగాక తప్పదు.

మహాత్ములవారి విధానము రాజకీయ సాంఘిక మోక్షములకు ఒకతోవయని మాత్రమే యంగీకరించెదను కాని దానిఫలమునుబట్టి అది జయప్రదమగునని నాకుతోచదు. కొంతవరకు కదలికకలుగును. ఈయసంపూర్ణ జయమునకు మహాత్ములవారు బాధ్యులుకారు. జనసామాన్యము లక్షలు లక్షలుగ ఆయనను వెంబడింపలేక పోయిరి. వీరికట్టిత్యాగము లేదు. గాంధిగారివంటి సన్యాసులు యిట్టివిధానమును నడపవలసినదేగాని తక్కినవారు యెంత మేధావంతులైనను యెంత ధనవంతులైనను, తమ మానమును, ధనమును, ప్రాణమును దీనికి సమర్పించుటకు వెనుదీయుదురు. ఆస్ట్రియాదేశములో చికిత్సనొందుచున్న భోజు, పటేలు మొదలగు ప్రముఖులే దీనికి తార్కాణము. దీనితోపాటు యితర సాధనోపాయముల నన్వేషింపక తప్పదు. మహాత్ములవారి విధానము అస్వాభావికమని అనేకులు నమ్ముచున్నారు. దానిని నిరశించవచ్చును పొగడవచ్చును. కాని యీమాటలు పొడిమాటలు. ఆంగ్లయులలోనేగాక, ప్రపంచములోని జాతు లన్నిటిలో స్వసంరక్షణ మాత్రము అహింసాసత్యసూత్రములను సదా లోబరచుకొనక తప్పదు. ఇది ప్రకృతిలో నెల్లెడల కనబడుచున్నది. ప్రపంచమంతయు నుఱ్ఱూతలూగించునట్లు మనమందరము మహాత్ముని విధాన మవలంబించ గలిగినయెడల హాహాకారములు

చెలరేగి మానవ కల్యాణమునకు తప్పక తోడ్పడును. కాని అది యందని మాన్పనిపండ్లకట్టుచాచుటయే. మహాత్ములవారు యెంత కృషిచేసినను ఆంగ్లేయజాతియొక్కగాని, మన ప్రజా బాహుళ్యముయొక్కగాని హృదయములుకరిగి మనకిప్పుడే సద్యో ఫలితములు రానేరవు. ఆయన విశ్వాసములు మనకులేవు. ఆయనవలె ప్రాణత్యాగమునకు సిద్ధపడువారులేరు. అట్టివారు కొద్దిమందియున్నను వారి సహాయమీయనకు చాలదు. స్వాతంత్ర్యజ్వాలలు ప్రజల హృదయములలో ప్రజ్వరిల్లచేయుటకు అనేకవిధములైన కృషులు జరిగినగాని, మహాత్ములవారి కోరికలు శీఘ్రకాలములో మనకు చేకూరవు.

---

## 12 వ అ ధ్యా య ము

## మ నో బ ల ము

దేవుడు, ఆత్మ యను పదములకు అనేక విధములైన అర్థములు, ఊహలు జనులు చేయుచుండుటచేత, ఆత్మబల మను శబ్దమునకు, మానసిక, శారీరక శాస్త్రముల ననుసరించి మనోబలమను శబ్దము నుపయోగించుచున్నాను. ఈ మనోబలము ఒకానొకప్పుడు శరీరబలమును మించి, దానిని వశపరచుకొని తానే యగ్రస్థానమును వహించును. ఇట్టి మనో

బలమును సంపాదించుకొనదలచువారు తమరవలంబించు విధానముమీద నమ్మకమును కలిగియుండవలెను. కొందరు దానిని గ్రుడ్డినమ్మకమని యభిప్రాయ పడవచ్చును గాని సాధారణముగా మనోబలము యేదియో నొక మత సాంప్రదాయమందుగాని, అచింత్యమైన నొక ఆధ్యాత్మిక, లేక ఆధిదైవిక వస్తువునందుగాని గట్టినమ్మకము కలవారికే కలుగును. ఇట్టి నమ్మకము హేతువాదములమీద నాధారపడదు. దేవుడను వాడొకడు ప్రత్యక్షమై తన యంతర్వాణియను దానిగుండా తనకు బోధించెననియో, లేక తన ప్రాణము పోగొట్టుకొన్నను సరే, స్వర్గారోహణము కలుగుననియో అట్టి నమ్మకము కొందరికి కుదురును.

పూర్వకాలములో కొందరు హైందవ స్త్రీలు తమ మృతభర్తలతో కలసి స్వర్గసుఖమనుభవింతుమను గట్టినమ్మకముతో వారి భర్తల చితిమీదనే పరుండి మిక్కిలి సంతోషముతో ప్రాణములను విడచుచుండిరి. తాము నమ్మిన మతోద్ధరణముకొరకు అగ్నిజ్వాలలలో త్రోయబడినను తమ శరీరమును ముక్కలక్రింద క్రమక్రమముగా కోయబడుచున్నను, తమ్మును తాపలముచేసి నఖశిఖపర్యంతము గోడకట్టుచున్నను, ఫిరంగి గుండ్లు తమ రొమ్ములను డీకొనుచున్నను అమితానందముతో తమ ప్రాణములను బలియిచ్చినవారనేకులుండిరి. వీరి మత నమ్మకములు యెంతనిర్హేతుకములు పిచ్చివియని బహుజనులు భావించినను అట్టినమ్మకములవలన కలుగు మనో

బలము శరీరమును స్వాధీనము చేసికొనగలదు. అది హేతు వాదనలకు లొంగదు. సందేహించు తార్కికులకు కలుగదు. ఈ విచిత్రమైన యోగశక్తి ఆయా దేశములలో కొద్దిమందికి మాత్రమే యలవడును. సాధారణముగా కొందరికి తాత్కాలికముగా అట్టిశక్తి కలుగును గాని అది శీఘ్రకాలములో నశించును.

మహాత్ముని మనోబలమిట్టి తాత్కాలికశక్తి కాదు. గత ముప్పది సంవత్సరములనుండి దైవము ఆత్మ ప్రార్థనలను వాని మీద గట్టినమ్మకము కలవాడై యిట్టి మనోబలమును సాధించెను. ఎంత సాధకమోయున్న గాని, యెంత గొప్పఆదర్శముల కైనను తన విధానమును, దాని ఫలములను, గురించి తిని కూర్చుండి సాధక బాధకముల నాలోచించుకొనువాడు నిరశన వ్రతదీక్షలో తన ప్రాణముల నొడ్డనేండు. గాంధిమహాత్ముడు దక్షిణాఫ్రికాకు వెడలకముందునుండి యిట్టి యుపవాస దీక్షలలో గొప్ప సాధకుడు. తాను ప్రాకరణశుద్ధిగ ఆచరణ యోగ్య మైనదని నమ్మినదానికి యేయుపాయాంతరములు దొరకనపుడు, దైవముమీదనే భారము వేసి తన ప్రాణమును అర్పణచేయుటకు సిద్ధముగు చుండును. తన యంతర్వాణిద్వారా భగవంతుడు తనన్ట్లు చేయవలసినదని ఆజ్ఞాపించెననియే నమ్మును. తాను జయముపొందితీరుదుననియు, తాను నిరశన దీక్షానంతరము పునకార్యాచరణకు యింకను జీవింతుననియు ఆయనకు ధైర్యము. ఒక వేళ జీవించకపోయినను, అట్టిమృత్యువే

యీశ్వరోద్దేశ్యము కావచ్చుననియు, అదియు తన యాత్మో పలబ్ధికే జరిగియుండుననియు, తాను మృతినొందిననేగాని తన వంటివాడు రాడనియు యీ శరీరమును విడచినను వెనుకటి మహనీయులవలె తానుకూడ ప్రపంచకళ్యాణమునకు సూక్ష్మ శరీరముతో పనిచేయుచుండుననియు, ఆయనకు గట్టినమ్మకము కలదు. ఇట్టినమ్మకములు లేని సామాన్యులకీమనోబలము చేకూరదు. ఇట్టి సాధన లేదు గనుకనే మన కిట్టి యుపవాస దీక్ష తగదని ఆయన మన కందరికిని సలహా నిచ్చుచుండును.

దైవప్రార్థనలయందెట్టి నమ్మకము లేకపోయినను, పునర్జన్మమనుదానిని విశ్వసించుచు, జన్మరాహిత్యమునకు నైతిక పథమే శరణ్యమని గట్టినమ్మకముతో బుద్ధుడు గొప్ప మనోశక్తిని సంపాదించుకొన గలిగెను. కాబట్టి తమ మహా దాశయములను జయప్రదమగునట్లు చేయుటకు ఒక దేవునితో గాని, ప్రార్థనతోగాని యెట్టి సంబంధము లేకుండ మానవులు సాధకములచేత యిట్టి మనోబలమును సంపాదించు కొన వచ్చును. ఇట్టి స్థితప్రజ్ఞులు కొందరు తమ ప్రాణములను గడ్డి పోచలవలె తాము త్రికరణశుద్ధిగ నమ్మినదానికి, ఆహుతి నొనర్చగలుగుదురు. మహాత్ములవారు ఆచరించు ఉపవాస దీక్ష ఆయన నమ్మినదానిని మనము గ్రుడ్డిగానమ్మినంత మాత్ర మున నే, యెవరును అవలంబింపజాల రని తెలిసికొనవలెను. ఆయనకూడ మానవమాత్రుడే, పొరబాట్లనేకము చేయుచు న్నాడు. వానిని దిద్దుకొనుచున్నాడు. ఆయన ఘనతయిట్లు

దిద్దుకొనుటలోనే యున్నది. తన నమ్మకములు చిత్తభ్రమ జన్యములేమో యని ఆయనకు సందేహమైనను కలుగదు. ఇట్టి నమ్మకములు అనేకులకు తలకెక్కవు. ఒకవేళ యెక్కినను యిట్టి యుపవాస దీక్షాచరణవలన సాంఘిక రాజకీయ మార్పులు కలుగుటకు, జాతులలో హృదయపరివర్తనము కలుగ చేయునని నమ్మజాలరు. ఈ నవయుగములో మత విశ్వాసములు సడలిపోవుచున్నవి గాన ఇట్టి యుపవాసదీక్షలు యెంత జయప్రదముగ కొనసాగించినను ఫలితముండదు. దీనివలన కొన్నివ్యక్తుల మనస్సులను త్రిప్పవచ్చును. కాని ఒక సంఘము మంతయు, తన మామూలుత్రోవను వదులుట మిగుల కష్టసాధ్యము. పూర్వకాలపు నమ్మకములు యీ ఆధునిక యుగములో లేవుగనుక, స్థిత ప్రజ్ఞుడగు క్రైస్తువంటివాడు యిప్పుడు తన ప్రాణములను వదలినను, ఒకనూతన మతమును ప్రవేశపెట్టి వ్యాపింపచేయజాలడు. కాబట్టి మనోబలము, (Soul force) యీకాలములో సాంఘిక రాజకీయ విషయములలో మన మనుకొనునంత పని చేయజాలదు. మహాత్ముడు, మనకొరకు యెన్నిబాధలు పడినను, తుదకు మనకొరకు మరణించినను, కొద్దికాలము, విలాపములు, ఆందోళనము లుండవచ్చునుగాని, ఆయనకున్న మత విశ్వాసముతో ప్రాణ త్యాగము చేయుటకు శిద్ధపడువారు మిక్కిలి అరుదుగ నుందురు.

---

# 13 వ అ ధ్యా య ము

## గాంధిమహాత్ముడు-భూకంపము

మనలో అస్పృశ్యతను తొలగించనందుకు భగవంతుడు బీహారు భూకంపమును మనలను శిక్షించుటకు పంపెనని గాంధీ మహాత్ముడు మాటవరుసకో లేక తన నమ్మకమును బట్టియో లేక చలోక్తిగనో వ్రాసిన వ్యాసమును రవీంద్రనాథఠాగూరు గారు సహేతుకముగ విమర్శించిరి. ఇటీవల మహాత్ముడు దానిని సమర్థించుకొనెను. మహాత్ముని వాదమునే మన సనాతనవాదు లందుకొని మనము అస్పృశ్యతను తొలగించుటకు తలపెట్టుటచేతనే భగవంతుడిట్టి శిక్షలను కల్పించుచుండునని వారేల వాదించకూడదు? నీతిసూత్రములకును ఈ విశ్వసంఘట్టనములకును ఎట్టి సంబంధము లేదనియును మహాత్ముని హేతువిరుద్ధవిషయములే మన స్వాతంత్ర్యమున కును ఆత్మగౌరవమునకును భంగకరములగు శక్తుల నుత్పా దింపజేయునని ఠాగూరుగారు వ్రాసినదానితో అనేకమంది ఏకీభవించక తప్పదు. ఈ జగత్తును పాలించు భౌతికశాస్త్ర నియమములు సర్వస్వతంత్రములని టాగూరుగారితో నేను ఏకీభవించెదను గాని యీ విశ్వసంఘటనములను భౌతికశాస్త్ర నియమములను తప్పించలేక నిరపరాధులగు పసిబాలురను, బాలికలను వృద్ధులను సన్మార్గప్రవర్తులను ప్రకృతికి దాసుడై యీ భగవంతుడు ఇంత తీవ్రశిక్షలకు లోబరచినప్పుడు ఈయన సర్వశక్తియుతుడు పరమదయాళుడు ఎట్లు కాగలడు? ఒకవేళ పరమదయాళుడైనను యిట్టి యశక్తుని ప్రార్థించిన

లాభ మేమి? సర్వశక్తికలవాడై యుపేక్ష వహించినచో భగవత్స్వభావముకన్న మానవ స్వభావమే నైతికముగ నుత్కృష్టమని యెన్నవలసి వచ్చును. దీనికి బ్రహ్మసమాజకుడగు టాగూరుగా రేమి సమాధానము చెప్పెదరో నే నూహింపజాలకున్నాను. ఇట్టి భూకంపములు, తుపానులు, మొదలగు ప్రకృతి విప్లవములకు కోట్లకొలది నిరపరాధులాహుతి యగుటను బట్టి పూర్వజన్మకర్మ పరంపరలు, జ్ఞానభక్తి కర్మ యోగములు, దైవప్రార్థనములు, మొదలగునవి నిరుపయోగములనియు, నీతి, మతము, దేవుడు, ఆత్మ, మొదలగు విషయములు, ఒట్టి యూహాజన్యములనియు, పరిణామశాస్త్రసూత్రములను జాగ్రతగ పరిశీలించినకొలది, ఆయా దేశములలో, ఆయా కాలములయందు, కొందరు కొందరు మేధావంతులగు వ్యక్తులు వారివారి పూర్వసాంప్రదాయములమీద నాధారపడి వెదజల్లుచుండిన బీజములే ఆయా జాతులలో పెరిగి యిప్పటికి కొనయూపిరితో పూర్వమతసాంప్రదాయముల పేరుమీద నాధారపడుచున్నవనియు నిశ్చయించవలెను.

ఇట్టి సంఘమరణముల బట్టియే మన జ్యోతిషశాస్త్రములోని ఫలభాగము శుద్ధ అబద్ధమనియు ఊహలమీదను, సంపూర్ణ విచక్షణలేని జ్ఞానహీనతమీదను ఇది కట్టబడినదనియు స్పష్టమగును. ఒక వ్యక్తియొక్క శిరోదయకాలమునందు గ్రహకూటము మనము సాధారణముగ తెలిసికొనజాలనపుడును, ఒకమూలనున్న గ్రహముయొక్క క్రీగంటిచూపు మరియొక

గ్రహముమీద పడినప్పుడు ఘంములలో నెంతయో వ్యత్యాస మున్నప్పుడును, ఒక్క కనురెప్పకాలములో భిన్నవయస్సులు గల స్త్రీపురుషులు అనేక లక్షలు మరణించుటకు జ్యోతిష శాస్త్ర మెట్టి సమాధానము నీయగలదు? మనుష్యులతో పాటు నానాజాతి మృగములు, పక్షులు, సరీసృపములు, చేపలు మొదలగునవి, ఒక్క తృటికాలములో నశించినపుడు, వీని పూర్వకర్మసంచయ సముచ్చయ మంతయు ఒక్కసారిగా పండెనా? ఇది యేటిమాట! ఇట్టి విప్లవములు ఒక్క గుణ పాఠమును మనకు నేర్పుచుండును. దైవమే లేడనియు అతనిని ప్రార్థించుట నిందించుటవలన లాభము లేదనియు, ఒకవేళ అట్టివాడు నిరాకారుడు, నిర్గుణస్వరూపు డొక డుండినను అట్టి యచింత్యుడు మన కష్టసుఖములలో పాల్గొని మాటిమాటికి నీ ప్రకృతిపరిణామములో తన వ్రేలు పెట్టుచు, మనలను నడి పించడనియు గట్టిగా నమ్మవలెను.

---

## 14 వ అ ధ్యా య ము

## ప్ర జా ప రి పా ల న ము

అనేక గొప్పరాజ్యములలో, పార్లమెంటరీ గవర్న మెంటు మూలమూలలకు త్రోయబడుచున్నది. ఇంగ్లాండులో 19 శతాబ్దాంతమువరకు, పార్ల మెంటులో రెండుపక్షములే

యున్నంతవరకు, ప్రజాపరిపాలనము జయప్రదముగానే జరుప బడినదిగాని, యిటీవల, అక్కడకూడ, ఫ్రాన్సుదేశములో వలెనే, వివిధకక్షులు మెండగుటచే, ప్రపంచములోని పార్లమెంట్లన్నిటికి తల్లియనదగు బ్రిటీషుపార్లమెంటు విధానము కూడ, నవీనయుగములో తారుమారగుచున్నది. ప్రజాప్రతినిధుల యభిప్రాయములు, వివిధవిషయములలో, వేరువేరు మార్గములు త్రొక్కుచుండుటచే, వీని నన్నిటిని వ్యక్తీకరించు ప్రజాప్రతినిధి సంఘము, తనకార్యనిర్వాహకసంఘమగు మంత్రివర్గమును (British Cabinet) కొద్దిసంవత్సరముల పాటైనను సురక్షితముగ నిలుపబెట్టలేక, వివిధపార్టీల నాయకులను చేర్చి, ఒకజాతీయ ప్రభుత్వమును దానిని యేర్పాటుచేసి కొన్నది. అటులైనను మంత్రులలో పరస్పర వైషమ్యములు మెండగుచున్నవి. పార్టీలకలియికలు, విడిపోవుటలు, సదా తటస్థించుచుండును. కార్యనిర్వాహకశాఖ బలహీనము కాగానే, మంత్రులు తరుచుగా రాజీనామాల నిచ్చుచుండుట, రాజ్యవిధానము మారుచుండుట తటస్థపడుచుండును. ఈ కారణముచేత, జర్మనీలో హిట్లరుగారు, ఇటలీలో ముస్సోలోనిగారు, ఆస్ట్రియాలో డాల్ఫసుగారు, రషియాలో స్టేలిన్‌గారు, అమెరికా సంయుక్తరాష్ట్రములతో రూజ్వెల్టుగారు, అక్కడి పార్లమెంట్లచేత నిరంకుశాధికారములను బడసి, రాజ్యములను యేలుచున్నారు. ప్రజలు వట్టి మూకయనియు, వారి చపలత్వస్వభావమును బట్టి ప్రతినిధు లేర్పడుటకంటె, దేశములోని

కొన్ని సంఘములచే వారు యెన్నుకొనబడుటయే మంచిదను నభిప్రాయము ప్రబలుచున్నది. ప్రస్తుతము, కొన్ని దేశములలో ప్రజాప్రతినిధి సంఘాభిప్రాయమునుబట్టి కార్యనిర్వాహక శాఖ మొదట యేర్పడినను, మొదటిసంఘములోని వివిధపార్టీనాయకుల భిన్నాభిప్రాయములనుబట్టి, రెండవశాఖ స్థిరముగా నుండక త్రోసివేయబడును, దానికి దినదినగండము సంప్రాప్తించుచున్నది. ఈ కారణముచే, సమష్టిపరిపాలనముకూడ (Socialism) నిరసింపబడి, నిరంకుశముగ ప్రవర్తించు మంత్రులస్వాధీనమునకు (Dictatorship) పరిపాలన రావలసియుండునని, అనేకమంది పాశ్చాత్యరాజ్యాంగతంత్రజ్ఞులభిప్రాయపడు చున్నారు.

కాబట్టి మన దేశములో జనసామాన్యమంతకును వోటు వేయు నధికార మొసగి, వారి ప్రతినిధులవలన శాసనసభా నిర్మాణమును చేసినచో, పార్లమెంటరీ గవర్నమెంటు కప్పల తక్కెడయై దేశము రాజకమగునని కొందరు రాజకీయవేత్తలు భయపడుటలో తప్పేమియు లేదు. దీనితోపాటు, ప్రపంచములో మరియెక్కడను కనుపడని లక్షోపలక్షలకులములు, శిలారూపములు దాల్చి, అన్యోన్యవైషమ్యములతో నిండిన యీ దేశములో పౌరత్వజ్ఞానము (Civic sense) శూన్యమగుట తటస్థించి తీరును. వివిధపార్టీల తాత్కాలిక ఐకమత్యము, శల్యములను బట్టుకొని పీల్చి పిప్పిచేయుచున్న వర్ణాభిమానమును త్రోసిపుచ్చగలదా! దీనికి మనస్థానిక ప్రభు

త్వమే, నిదర్శనము. పూర్వకాలమున మునిసిపల్, లోకల్ బోర్డులకు గవర్నమెంటువారు నియమించిన మెంబర్లును వారి వారి ప్రెసిడెంట్లును యిప్పటి మన ప్రతినిధులకంటె, యెక్కువ బాగుగను, న్యాయముగను వానిని పాలించినట్లు మానయను భవమే సాక్షి. ఇప్పటి యెన్నికలలో యెంతలంచకొండికనము! ఖర్చుపరచిన ద్రవ్యమును పూడ్చుకొని, ధనము సేకరించు కొనుటకు, ఎంత దుర్మార్గాచరణము! ఇది యంతయు పాశ్చాత్యులు మనకు దయచేసిన భిక్ష. దీనికితోడు ప్రతిగృహము లోను, కల్లోలము పొడసూపుచున్నది. ఉపాధ్యాయులు, ఎన్నికలలో పాల్గొనవలసివచ్చుచున్నది. ప్రజలవలన రాబడిన సొమ్ములో చాలభాగము, పెద్దలజేబులలోనికి చేరుచున్నది.

సామాన్య ప్రజలందరికును వోటువేయు నధికారము నిచ్చి, వారికి పౌరత్వహక్కులను, విధులనుగురించి జ్ఞానము కలుగజేయుచున్నను, వారొకసారి యేర్పరుచుకొన్న కార్య నిర్వాహకవర్గమును, ఒకనియమితకాలమువరకు కదపకుండు నట్లు (Irremoveable Executive) నిబంధనయున్నగాని, ప్రజాప్రతినిధి పరిపాలనము కూడ జయప్రదమగునని తోచదు. ఎప్పటికైనను, పనివాండ్రు, కర్షకులచేతులలోనికి రాజ్యపరిపాలనము రాక తప్పదుగాని, రషియా దేశములోని కమిసార్లనలెనే, వారిమంత్రివర్గము, నియమితకాలమువరకైనను, కొంత నిరంకుశాధికారము కలిగియుండవలెను. ఈ నిరంకుశ ప్రభువులు ప్రజలవలననే యెన్నుకొనబడినవా రగుటచే, వారిలో మెజారి

టీవారి యభిప్రాయములను గమనించుచునే రాజ్యపరిపాలన చేయుచుందురు. చట్టములకు బద్ధులైయున్నను, నూతన చట్టములను, తమకు కావలసినపుడు ప్రతినిధులచేత వ్రాయు చేయించుకొనగలరు. ఇట్లు కార్యనిర్వాహక శాఖను బల పరచనిచో, మూకయొక్క ప్రాబల్యము మెండై అరాజకము నకు త్రోవ యేర్పడును. మన స్థానికప్రభుత్వములో నిప్పు డడుగడుగునకుచేయు అపనమ్మక తీర్మానములకు (Votes of Censure) తావుండకూడదు. తన స్వకీయశక్తివలనను, స్వార్థత్యాగమువలనను, పైపదవులకు వచ్చు మేధావంతు లగు మంత్రివర్గమువారు, ఒకానొకప్పుడు సదుద్దేశ్యముతోనే, రాజ్యపరిపాలనలో కొన్నిపొరబాట్లు చేసినను, వార్తాపత్రికల విమర్శనలతో నవి మాన్పవలయునే గాని వివిధవిషయము లలో భిన్నాభిప్రాయములు గల జనసామాన్యపు యెన్నికల మూలమునగాని, అట్టివారి ప్రతినిధులమూలమున గాని, ఆ మంత్రులమీద విశ్వాసరాహిత్య తీర్మానములను ప్రయోగించి స్థానభ్రష్టులను చేయుచుండుట జాతీయ చపలత్వమునకు నిదర్శన మగుచుండును. (Fickleness of mobmind). అపనిందలకు చెవియొగ్గుచు, దూరాలోచనలేక పిచ్చి పిచ్చి యభిప్రాయము లకు లోనై, తప్పుడుతీర్మానములు చేసి, కడుమేధావంతు లును, సమర్థులునైన మంత్రివర్గమును స్థానభ్రష్టత చేయకూ డదు. కాబట్టి వంశపారంపర్యముగ వచ్చు రాజకుటుంబముల నిరంకుశప్రభుత్వము నశింపజేయుట మన విధ్యుక్త ధర్మమై

నను, నియమితకాలమునకు మన ప్రజలచేతనే యెన్నకొన బడిన కార్యనిర్వాహకవర్గమునకు చట్టములనుబట్టి యీయ వలసిన పూర్ణాధికారమునకు అడ్డు కలిగించకూడదు. అట్టి రాజనీతియే యిప్పుడు ప్రపంచములో ప్రచారములోనికి వచ్చు చున్నది. ముఖ్యముగా మన యిండియా దేశ రాజ్యాంగతంత్ర ములో, మార్పులు చేయదలచినపుడు, పై సూత్రములను మన రాజకీయ వేత్తలు తప్పక గమనించెద రనియే నా యభిప్రా యము.

---

## 15 వ అ ధ్యా య ము

---

## సాంఘిక రాజకీయవిధాన చరిత్ర

సుమారు యిరువదిమూడు సంవత్సరముల క్రిందట నెల్లూరు ప్రొవిన్షల్ కాన్ఫరెన్సులో, మనము అరవలము, కలిసి కొని, అదివరకువలెనే జాయింటుగా సమావేశ మైనపుడు ప్రత్యేకాంధ్ర రాష్ట్రావశ్యకతను గురించిన తీర్మానమును నేను ప్రవేశపెట్టితిని. నా స్నేహితుడు బులుసు సాంబమూర్తిగారు దానిని బలపరచిరి. కాని మన మోచర్ల రామచంద్రరావు గారు, న్యాపతి సుబ్బారావుగారు మొదలగు కొందరు పెద్దలు అచ్చటి యాంధ్రులతోను, అరవలతోను, చేరి విషయనిర్ణయ సభలోనే తీర్మానము వీగిపోవునట్లు చేసిరి. ఆ మరుసటిదిన

ముదయమున, నేనున్ను, సాంబమూర్తిగారున్ను, ముట్నూరి కృష్ణారావుగారున్ను ఆ కాన్ఫరెన్సును చూచుటకు వచ్చిన గాంధిగారి బసకు వెళ్లి యీ విషయమును ఆంగ్లేయభాషలో యీ అరవలు ఉపన్యాసము నిచ్చుట, అనీబెసెంటుగారు వాని నామోదించుట మొదలగు విషయములను గురించి, ఆయనకు తెలియపరచగా మమ్ము్మను అరవభాష కూడ నేర్చుకొని అరవ జిల్లాలలో ప్రత్యేక అరవరాష్ట్రావశ్యకత కూడ బోధించినచో వారి నాయకులకు తప్పక ప్రజలు త్రోసి రాజు చెప్పి తీరుదు రని ఆయన బోధించెను. అప్పుడీయనతో జరిగిన సంభాషణను బట్టి యీయన గొప్ప రాజకీయ సంస్కర్తయని మాకప్పుడే తోచినది. తాను ప్రతిపాదించు అహింసా సత్యసూత్రములను ప్రజలు ఆచరణలో పెట్టగలిగినయెడల, మనము చెప్పినట్లు ప్రభుత్వమువారు నడచుకొనవలసినదే యని యీయన యభిప్రాయమైనట్లు మాకు స్పష్టపడినది.

మేము, ఆ నెల్లూరు కాన్ఫరెన్సులోనే, అరవనాయకుల కందరకును, మాకును విడాకులు యిచ్చుకొని, మరుసటి సంవత్సరమే బాపట్లలో ప్రత్యేకముగా ఆంధ్రమహాజనసభను సమావేశపరచుకొని నెల్లూరు జాయింటు కాన్ఫరెన్సుకు ప్రెసిడెంటగు బయ్యా నరసింహేశ్వరశర్మగారినే అధ్యక్షునిగా పెట్టుకొంటిమి. అప్పటినుండి సదరు శర్మగారితో సహా మన యాంధ్రనాయకుల నొక్కరొక్కరనే పుల్లీలమీద పైకి లేవనెత్తి తుదకు ప్రత్యేకాంధ్రరాష్ట్రావశ్యకత భాషాప్రయుక్త

భారతదేశ విభజనమును పాల్గొనుచుండువారికి వారిచేతనే నచ్చ జెప్పించితిమి. సంకుచితదృష్టిగల యీ మహానుభావులే నేటికిని చెక్కుచెదరకుండ తమ పూర్వవిధానమును విడనాడజాలక మితవాదుల మని చెప్పుకొందురు. కాని మహాత్ముని విధానమును నిరసించుచు, దానివలన కలుగు కొద్దిఫలముల నైనను తా ముపయోగించుకొనుటకు వెనుదీయరు. ప్రార్థనలు తప్ప మరియొక విధానమును వీరు చూపించలేరు. బెంగాలు పార్టిషన్ అయిన తరువాత 1905, 1906, 1907 సంవత్సరములలో కాంగ్రెసులో యీ పూర్వనాయకుల మాటలు సాగక తుదకు సూరతులో వీరిని కలాయతుల చేయవలసి వచ్చెను. వీరు తరువాత కొన్ని సంవత్సరములు Liberal convention పెట్టుకొని కొంత తంతు జరిపిరిగాని, దానిలో యువకులును, వారి నాయకులును పాల్గొనకపోవుటచే అది క్రమముగా కృశించిపోయి,వీరిలో అనీబెసెంటుగారికి వెష్టతగిలి హోంరూలు మూవుమెంటును లేవదీసి లక్నోలో ఉభయపార్టీలను కలిపినది గాని వీ రెంతో కాలము కలసియుండలేదు. అమృతసరు కాంగ్రెసు సభలో తిలకు మహారాజుకే బ్రహ్మరథము పట్టిరి. అప్పుడే మహాత్మగాంధిగారు రాజకీయ విషయములలో పాల్గొనుటయు తా నహింసా సత్యసూత్రములమీద నే ఆధార పడుదునని చెప్పుటయు దానిని తిలకు మహారాజు శిరసా వహించవలసి వచ్చుటయు తటస్థించినది. ఆయన శీఘ్రకాలము లోనే పరమపదించుటచేత మహాత్ములవా రాయన స్థానము

నలంకరించి నేటివరకు తన విధానము నాచరణలో పెట్టు చున్నారు. తన యనుచరులగు నెహ్రూ, దాసు మొదలగు వారు శాసననిర్మాణ సభా ప్రవేశమువలననే గాని రాజకీయ స్వాతంత్ర్యములు రావని మహాత్మునికి కొంతకాల మడ్డుతగిలిరి. గాని తుదకు మతసాంప్రదాయముగ నెంచక ఒక ఉపయుక్త మగు తంత్రముగా నైనను ఆయన విధానమును ఆచరణలో పెట్టిరి.

మహాత్ములవారి రాజకీయవిధానము జయప్రదముగ కొనసాగవలెనన్న సాంఘిక పరివర్తనము మనలో కొంతవర కైనను చొప్పించవలసి యుండునని గ్రహించియే అస్పృశ్యతా నివారణమును గురించి తన యావచ్ఛక్తిని ఆయన ధార పోయుచున్నారు.

1887 వ సంవత్సరములో మద్రాసులో, మూడవ కాంగ్రెసు సమావేశమై దానిలోని చర్చలను గమనించినప్పుడే మాలో కొంద రాంధ్రయువకులు సంఘసంస్కరణములు పూర్తిగా జరుగనంతవరకు రాజకీయ స్వాతంత్ర్యమునకు తగమని ఉపన్యాసములు కావించుచుంటిమి. అప్పుడు మా మాటలు వినువారే లేకపోయిరి. వార్తాపత్రికలు భేదాభిప్రాయములతో నిండినవి. తిలకు మహారాజు పూర్వాచార పరాయణుల పక్షముననే యుండెను గాని 1907 వ సంవత్సరమునుండి ఆయన దృక్పథము మారి గోక్లె రానెడి మొదలగు వారి కంటెను ముందంజ వైచెను.

అస్పృశ్యతా నివారణ మనగా హిందూసంఘములో గొప్ప పరివర్తనమును చొప్పించుటయే యని తెలిసికొనుడు. మహాత్ములవారి వర్ణాశ్రమ ధర్మనిర్వచనము, యీనాటి వర్ణ భేదములను నిర్మూలించునది యని గ్రహించవలెను. ఇది రాజకీయ పరివర్తనమునకు తప్పక దారి చూపును. అమెరికా సంయుక్త రాష్ట్రీయులలోని నీగ్రో బానిసత్వముకంటె మన లోని అస్పృశ్యత, వర్ణవిభేదములు యెక్కువ చెరుపును సంఘ మునకు కలుగజేసి వైషమ్యములను పెంచి అయికమత్యమును వమ్ముచేసి స్వరాజ్యపరిపాలనకు అడ్డుతగులుచున్నట్లు మన స్థానికపరిపాలనమే నిదర్శనము. అహింసా సత్యములమీదనే ఆధారపడుచు సాంఘిక రాజకీయ పరివర్తనమును మహాత్ముడు చొప్పించ దలచెను. కాని జనసామాన్యము ఆయనను వెంబ డించలేకున్నారు. ఒక జాతి హృదయములో హృదయపరివర్తన కలుగవలెనన్న రెండవజాతి సంపూర్ణ త్యాగమును కనుపరచి, ఆహుతి యగుటకు సిద్ధపడినగాని కాదు. సత్వగుణప్రధాను డైన గాంధిమహాత్మునివంటి ఒక్క వ్యక్తిచేతగాని రాజసగుణ ప్రధానుడైన ఒక్క తిలకుమహారాజుచేత గాని ఇది సాధ్య పడదు. ఉభయుల విధానములు, ప్రజలచేత అవలంబించబడ వలెను. ఇట్టి యుత్కృష్ట త్యాగము జనబాహుళ్యములో కలు గుట మానవస్వభావమునకు వ్యతిరేకము. ప్రపంచములోని వివిధజాతులమీద తక్కిన జీవరాసులలోవలెనే స్వసంరక్షణ సూత్రము విజృంభించి రాజ్యము చేయుచున్నపుడు, కొన్ని

వేల వ్యక్తులు అహింసాసూత్రము నవలంబించి త్యాగము చూపించుచున్నను అది జాతి హృదయపరివర్తనకు చాలదు. నానా దేశ చరిత్రలను బట్టి ఒక్క విధానమువలన, స్వరాజ్యసంపాదనము కలిగినట్లు కనుపడదు. గాంధిమహాత్ముని ఉపవాసదీక్షలు, మనలోనే హృదయపరివర్తనలు పైకి కలుగ జేసినట్లు మనము నటింతుమేగాని, ఆయన యాదర్శములను మనము గ్రహించి నడచుకొనజాలనపుడు యితర జాతుల హృదయములను కరిగించగలుగుదుమా? ఇది అస్వాభావికము. ప్రకృతిలక్షణము కాదు. మానవుల బుద్ధికుశలతను బట్టి కాలానుసారముగ చతురోపాయములను వినియోగించి, సాంఘిక రాజకీయ సంస్కారణలను సంఘములో చొప్పించుచు, మానవ సౌభ్రాతృత్వమునకు యితర సంఘములతో కలిసి మెలసి తోడ్పడుచునే యుండవలెను. కాని, యీచతురోపాయములు, దేశములో చాలాభాగము, సాత్వికనిరోధ మవలంబించినపుడు ఆచరణలో పెట్టబడవచ్చునేమో!

## 16 వ అధ్యాయము

### స్వాతంత్ర్యసంపాదన విధానము

రాబోవు కాంగ్రెసుమహాసభ, తనసభ్యులలో కొందరిని శాసనసభలలోకి పోయి పనిచేయునట్లును, యితరమెంబర్లును, ప్రజాసామాన్యమును వారికి సహాయముచేసి యెన్నికలలో జయముగాంచి, ప్రభుత్వమువారియందును వారికి అండగా

నుండు ప్రతిపక్షులందును, ప్రజలలో నమ్మకము లేనట్లు రుజువు పరచుటకును, అనుజ్ఞ నిచ్చెదరని మనము నమ్మవచ్చును. గాంధిమహాత్ముని దీవెన వారికి బలము నొసంగును. శాసన సభలలోనికి పోవుటకు యిష్టపడనివారును, పోవజాలినంత జ్ఞానము, ధైర్యము, ధనము, పలుకుబడి లేనివారును బయటనే యుండి, కాంగ్రెసువిధానములలో ముఖ్యతమమగు పున ర్నిర్మాణకార్యక్రమమందు మగ్నులు కావచ్చును. వీరిలో మొదటితరగతివారు ఎన్నికలలో జయముగాంచినను మెజారిటీలో నుండరు. ఒకవేళ అటులుండి మంత్రిపదవులను సంపాదించినను, వీరికి గవర్నరులు అడ్డుతగిలెదరు. ప్రజల స్వాతంత్ర్యముల నరికట్టు శాసననిర్మాణమును వీరు నిరోధించజాలరు. ఇదివరకు, తమకు వలదని త్రోసివేసిన శాసనసభలలో ప్రవేశించుటకు ప్రయత్నించుటేలనో దురూహ్యముగ నున్నది. పటేల్, నెహరూ మొదలగువారికంటె వీ రెక్కువ ప్రజ్ఞావంతులు కారుగదా? శ్వేతపత్రమును ప్రజ లంగీకరింపలేదని ప్రభుత్వమువారికికూడా తెలియును. మూఢులగు ప్రజల వోట్లు యీవిషయము నిర్ణయింపజాల వని, అపజయము నొందిన పార్టి తప్పక వాకొనుచుండును. ఈస్వల్పఫలమున కింత యార్భాట మేల?

స్వాతంత్ర్య సంపాదనము, మనపూర్వులు ప్రతిపాదించిన సామ దాన భేద దండోపాయములలో దేనివలనను మనకు చేకూరదని గ్రహించితిమి. సామముచేత కాంగ్రెసువారు గత

అరశతాబ్దమునుండి మొఱలు పెట్టుకొని విఫలమనోరథులైరి. ప్రజాసామాన్యమున కుపయోగించని రాజకీయ సంస్కరణములను చేయుచు, మనలో కొందరకు గొప్పగొప్ప పదవుల నొసంగుచు, ఆయువుపట్టు లన్నిటిని తమలోనే యుంచుకొని మనప్రభువులు రాజ్యము నేలుచున్నారు. స్వపరిపాలనాధికారము మన కిచ్చినయెడల, మన దేశముననే గాక, ప్రపంచము నంతను అల్లకల్లోలము చేసి అన్యోన్య కలహములవలన అపాయము తెచ్చిపెట్టెదమని వారు మనలను భయపెట్టుచున్నారు. దీనితో మనవారిలో కొందరు తాళము వేయుచున్నారు. ఇక దానమిచ్చెదమన్న కోటీశ్వరులగు మనప్రభువులకు యీ బీదదేశ మేమీయగలదు? మన ముడిపదార్థములను వారికిచ్చి వారివద్దనుండియే, యంత్రములమీద తయారైన పదార్థములను యెల్లపుడు వారు మనలను కొనుమందురు. ఇట్టి యార్థికవిధానమువలన మన బానిసత్వము చిరస్థాయిగా నుండును. మనము భేదోపాయమును ఉపయోగించజాలము. స్వశక్తిమీద ఆధారపడజాలని దేశములకు విదేశీయు లెవరును సహాయపడరు. వారు నష్టములపాలై మనకై యేల పోరాడెదరు? ప్రభుత్వమువారు తమ ప్యాసుపోర్టు లేకుండ మనలను మనదేశమును వదలిపోగూడదని నిర్బంధించుచున్నపుడు, మననాయకులు అన్యదేశములకేగి, మనమొరలు ప్రకటించి వారికి మన ప్రభుత్వముమీద అన్యాయ జనింపచేసి, మనకు న్యాయము కలుగునట్లు

చేయించుటకలలోనివార్త. దండోపాయము అసలే పనికి రాదు. నిరాయుధులైన యీ ముప్పదికోట్ల ప్రజలను ఒక్క త్రుటికాలములో భస్మీపటలము చేయు శక్తిసామర్థ్యములు గల మన ప్రభువులమీద తిరుగుబాటు చేయుట అసాధ్యము. అట్టి ప్రయత్నము ఏమూలచేసినను చేసినవారికేగాక నిరపరాధులకుగూడ ముప్పు వాటిల్లును. కాబట్టి ప్రపంచ చరిత్రలో మనకాచరణలో కనుపడిన చతురోపాయములు మనకు నిష్ఫలములే. కాబట్టి మహాత్ములవారు, వ్యక్తులమధ్య ఉపయోగించబడుచుండిన సాధనలను రాజకీయ విషయములలో ప్రవేశపెట్టజూచెను. అహింసా సత్యములమీద నాధారపడిన అసహాయోద్యమాయుధమును మనచేత ప్రయోగింపించి, విదేశప్రభువుల హృదయమును మనత్యాగమువలన, కరగింపగల మని బోధచేసెను. కాని మనమా యాయుధమును సరిగానుపయోగించజాలకపోతిమి. ఇంకముందైనను యిది తప్ప మరియొక యుపాయము లేనట్లు కనుపడుచున్నది. మనమనేకసారులు యీవిధానము నాచరణలో పెట్టునపుడు అపజయము పొందెదముగాక. ఇదిగాక ఫలప్రదమగు మరియొక విధానము కనుపరచలేనంతకాలము, యిట్టి సౌమ్యయుద్ధము వలననే మనము సంపూర్ణస్వాతంత్ర్యము సంపాదించుకొనవలెను.

మనకుగల యార్థిక యిబ్బందులు, పల్లెటూళ్ల ప్రజలకు సదా నచ్చజెప్పుచుండుట వలన, కాలక్రమమున యీ నూతనవిధానము బలపడి తీరును. మనకోరికలు తీర్చకపోవుటచే,

మనము ప్రభువులకు యేవిధమగు సహాయము చేయజాలమని చెప్పుటలో న్యాయశాస్త్రము నుల్లంఘించము. కాని చట్టముల నుల్లంఘించిన, శిక్షాపాత్రులమగుదుము. ఇండియా శిక్షాస్మృతిలో, ప్రభుత్వముమీద యేమాత్రము అయిష్టము చూపిన మాటలు దొర్లినను, అదినేరమగుటకు సావకాశము కలదు. గనుక, ప్రజలలో ఉద్బోధన కలుగజేయుటకూడా, నేరమని శాసనములను మన ప్రభువులు కావించవచ్చును. కాని నాగరిక దేశములలో నెల్ల రాజకీయబాధలను తొలగించుకొనుటకుమాత్రము, చేయువాగ్లిఖితోపన్యాసములు రాజద్రోహాకరమైనవిగ నెంచకూడదని, రాజనీతి ప్రబలియుండుటచే, మన నిర్మాణకార్యోద్యమమునకు మనప్రభువు లడ్డుపెట్టుటకు సాహసించరు. పైగా, వారు ప్రజలందరు రాజకీయజ్ఞానము కలవారై వారి స్వాతంత్ర్యములను వారు కాపాడుకొనుస్థితికి వచ్చినయెడల, వారే పరిపాలనము చేసికొనవచ్చుననియు, ఆదినము తమ చరిత్రలో మహోత్కృష్టమైన దినమని యెంచబడు ననియు చాటించుచున్నారు.

అట్టిసుదినము ఎప్పటికైనను రాక తప్పదు. దానికొరకే గ్రామపునర్నిర్మాణము గుండానే రాజకీయాందోళనము సాగించవలెను. మన ప్రభుత్వము ఒకవ్యక్తి లేక కొందరు వ్యక్తులమీద నాధారపడలేదు. ఒక అన్యదేశపుజాతి మనలను పరిపాలించుచున్నది ఒకజాతి మరియొకజాతిని, యీ రెండవ జాతి యిష్టము లేనిదే యెన్నడు పాలించలేదు. కాని మొదటి

జాతి తన అయిష్టమును తెలుపుటకు తనదేశ పరిస్థితులను, ఇతర నాగరికదేశముల పరిస్థితులను పోల్చి చూచుకొన గల శక్తిని సంపాదించుకొనవలెను. తన సాంఘిక రాజకీయ కష్టములను గ్రహించి వానిని ఆంగ్లేయదేశీయులు, ఏల నివారించుట కిష్టపడరో తెలిసికొనవలయును. స్వసంరక్షణమాత్రమును ఆంగ్లేయజాతి, తక్కిన జాతులవలెనే, మనకు వ్యతిరేకముగ ఆచరణలో పెట్టుకొనుట యెంత స్వభావజన్యమో, నానాజాతుల ప్రస్తుత విధానములతో మనదానిని పోల్చి ప్రజలకు, బోధించవలెను. అప్పుడు గాని మన సేవ్యదారులు కార్మికులు మొదలగువారు తమశక్తిమీదనే తా మాధారపడిగాని, తమకు రాజకీయమోక్షము గగనకుసుమ మనియు, తమ యార్థిక దుస్థితి యెన్నడు బాగుపడదనియు, గ్రహించెదరు. అప్పుడైకమత్యముతో యేవిధానమును ప్రజాబాహుళ్య మవలంబించగలదో మన మిప్పుడు చెప్పజాలక పోయినను అది అప్రతిహతమగును. అప్పుడు మన విదేశప్రభుజాతికూడ మనజాతిలో లీనమై, అందరము సమాన ప్రతిపత్తితో యీ భారతదేశ క్షేమమును మాత్రమే ముఖ్యముగా గమనించి తీరెదము.

ప్రజలలో యీ నిర్మాణకార్యక్రమములో ప్రచారము చేయు విద్యార్థిసులు మిక్కిలి అరుదు. ఇది ప్రతివారి దృష్టిని ఆకర్షించగల పనికాదు. ధనము సంపాదించి పెట్టగల ఉద్యోగము కాదు. ఇతరుల పొగడ్తలవలన ఉత్సాహము జనింపజేయగలకార్యము కాదు. శీఘ్రముగ తాత్కాలిక ఫలముల

నిచ్చు ఉద్యమము కాదు. ఈ యుద్యమ ప్రచారకులు, స్వార్థ త్యాగులై, నిరాడంబర జీవనముకలవారై సద్యఃఫలితముల నీయకపోయినను నిరుత్సాహపడక, రాజకీయ స్వాతంత్ర్యముల కిదియే రాజబాటయని నమ్మి ఓపికతో పనిచేయవలెను. కాంగ్రెసువారు అంగ నిర్మాణమునకును ప్రచారమునకును ధనము నెల్లపుడు సేకరించుచుండవలెను. ఇదితప్ప, ప్రస్తుతార్థిక దాస్య శృంఖలములను పడగొట్టుకొనుటకు వేరుమార్గము కనుపడదు. శాసనసభా ప్రవేశవిధానము దీనికెంతమాత్రము తోడ్పడకపోగా, ప్రజలను తప్పుమార్గములో త్రొక్కించి, యెన్నికలనే వలలో చిక్కించి, వైషమ్యములను పెంచి వివిధ కక్షుల శుష్కవివాదలతో కాలము గడచునట్లు నాయకులు చేయుచుందురు. ప్రజలు, యెన్నికలా ర్భాటములతో అలసిపోయి, తామేమో దేశక్షేమమునకు పాటుపడుచుంటి మని, మనస్సులను తృప్తిచేసికొనుటయేగాని, ప్రజాశక్తిని బలపరచక పోవుటచే యీకాంగ్రెసులోని స్వరాజ్యపార్టీవారు చేయబోవు ప్రయత్నము లన్నియు నిష్ఫలములు. ఈ పోరాటమువలన ఆవగింజంతైనను దేశము, ముందుకు జననేరదు. జనబాహుళ్యములో నిజమైన రాజకీయ పరిజ్ఞానము వ్యాపించినకొలది, మతసాంఘిక శృంఖలము లన్నియు జారిపోయి, ప్రత్యేక సంఘాభిమానము నశించి, తమ ప్రస్తుత రాజకీయపు బానిసతనముమీద అసహ్యత కలిగి, యైకమత్యముతో కార్యవిధానములో దూకినపుడు మనలను పరిపాలించు విదేశీయ జాతి

వారుకూడా మనతో రాజీపడి కలసిమెలసి వర్తించకతప్పదు. భవిష్యత్కార్యవిధానము యేరీతిగా పరిణమించునో మన మిప్పుడు చెప్పజాలము గాని, అది అప్రతిహత మనియు సాధ్యమైనంతవరకు అహింసా సూత్రమునే అప్పుడు ప్రజలవలంబించెదరనియు, ప్రజాద్రోహు లగు విభీషణయ్యలకు అప్పు డెట్టి స్థానముండదనియు మాత్రము నే నూహించుచున్నాను. కాబట్టి మన కాంగ్రెసు నాయకులు, ముఖ్యముగా మన యాంధ్రనాయకులు, శాసనసభా ప్రవేశ వ్యామోహములో పడక మార్గదర్శకులై తమ జీవితమును యీనిర్మాణ కార్యక్రమవిధానములో గడపుడని ప్రార్థించుచున్నాను.

---

## 17 వ అధ్యాయము



## స్వరాజ్యపార్టీ

కాంగ్రెసులో వేరొక పార్టీగానుండి, శాసనసభల గుండా బ్రిటిషువారు మన కీయబోవు శ్వేతపత్రపు సంస్కరణలు హుళక్కియనియు, మనలను శాశ్వతముగ బానిసత్వములో నుంచునవి యనియు ప్రకటించగలుగుదురట! దీనికింత యార్భాటమేలకో! ప్రజలకును పరిపాలకులకును, స్పష్టమై యున్నపుడు, ఈ స్వరాజ్యవాదులకు, దీనివిషయమై యిట్టి పందె మెందుకు? ఈ స్వరాజ్యవాదులు, శాసనసభలలో దూరిన తరువాత, నూతన రాజ్యపరిపాలన ప్రణాళికను

తయారుచేసి, ప్రజల కప్పీలుచేయు నిమిత్తము, యెన్నికల నేర్పాటుచేసి అఖిలభారత సంఘమును సమావేశ పరచెదరట! (Constituent Assembly) దీనికంటె గొంతెమ్మకోరిక వేరుగ నుండబోదు. స్వయం నిర్ణయ సూత్రమును ప్రవేశ పెట్టుటకు వీరి కెవరు యధికార మిచ్చిరి? బ్రిటిషువారు, అట్లు జేయనిచ్చెదరా? అమెరికా సంయుక్త రాష్ట్రములలో వలె, మనము రాజ్యమును స్వాధీనపరుచుకొన్న తరువాత, ఈ విధానమును అవలంబించగలము కాని, వల్లభబాయి దేశాయి గారు, అన్సారీగారు, సత్యమూర్తిగారు మొదలగు కాంగ్రెసు ప్రముఖులు, ఈ విషయములో తమ చరిత్ర జ్ఞానమును మరచి నట్లు నా బుద్ధికి గోచరించుచున్నది. దీనికంటె విచిత్రము సత్యమూర్తిగారి వాగాడంబరము! సత్యాగ్రహోద్యమములో కారాగారములకు వెళ్లిన వారికంటెను అన్యాయముగ దెబ్బలు తిన్నవారి కంటెను, శాసనసభలలో స్వాతంత్ర్యములకు పోరాడువారు తక్కువ 'దేశాభిమానులు కారట! వీరుభ యులు దేశాభిమానులే కావచ్చును గాని శాసనసభలలోనికి దూరినవాడు చేసినది చేయగలిగినది సున్న. బయట సాత్విక యుద్ధము నడిపినవారు, తుదకు ఓడిపోయినను, ప్రజాసామాన్య ములో కారాగృహప్రవేశ మను భయమును పోగొట్టి దానివలన గౌరవలోపము లేదని చాటించిరి. ప్రజలలో స్వాతంత్ర్యజ్వా లలను ప్రజ్వలింపజేసిరి. గతపదునైదు సంవత్సరములలో నడచిన సత్యాగ్రహము, సహాయనిరాకరణము, శాసనోల్లంఘనము,

సామ్యయుద్ధములో జలహీనజాతులు ఉపయోగించవలసిన ఆయుధములనియు, రాజకీయ స్వాతంత్ర్య సంపాదనకు, అవి నిబంధనానుకూలవిధానములే యనియు, మన ప్రజలకు స్పష్ట పడినది. ఈ యాయుధములను జయప్రదముగ నుపయోగించు టకు, యెట్టి శక్తులను సంపాదించుకొనవలెనో, జనులు నేర్చు కొనిరి. కాబట్టి సత్యమూర్తిగారి మాట వట్టి పేలవమని చెప్పక తప్పదు. మాటలవలన స్వరాజ్యము సంపాదించగలిగిన యెడల సత్యమూర్తిగారివంటి వారే గొప్ప యోధులు. కాని యీయనకంటె, ధీశాలురు, అనుభవశాలురు పలుకుబడి గల వారు, రాజ్యముల నేలగలవారు నలువది సంవత్సరములనుండి కాంగ్రెసును నడిపినవారు, శాసనసభల ద్వారా స్వరాజ్యము చేకూరదని నిస్పృహులై వాసిని విడనాడినపుడు వీరా, మనకు స్వరాజ్యము చేకూరచేయువారు! ఇంకను ప్రజలు యెన్ని కష్టము లనుభవించుచు, పోరు సల్పవలెనో! వీరి తాటాకు చప్పుళ్లకు బ్రిటిషు కుందేళ్లు ఝడుడవు.

---

## 18వ అధ్యాయము

### ప్రత్యేకసంఘ ప్రాతినిధ్యము

నాలుగైదు సారులు, మన భారతీయులను, ఆంగ్లేయ మంత్రి యీవిషయమై సంప్రదించుకొని ఒక నిశ్చయమునకు రావలసినదని కోరినను, మనలో మనకు పొత్తు తెగకపోవు

టచే, ఆయనకు తోచినట్లు తీర్మానమిచ్చెను. కొన్ని రాష్ట్రములలో హిందువులకు నష్టమును, మస్లిములకు లాభమును దీనివలన కలిగెననియు, ఈ ప్రత్యేకసంఘ ప్రాతినిధ్యము కంటె, అందరు నియామకులు కలసి వోటుచేసికొని, తక్కువ సంఖ్యగల జాతులకు ఒక నిర్దిష్టసంఖ్యకు తగ్గకుండ ప్రతినిధుల నేర్పాటుచేయుట మంచిదనియు హిందూమహాసభవారు ఆందోళన చేయుచున్నారు. మతభేదములమీదను కులభేదముల మీదను ప్రత్యేకముగ ఎన్నికలు జరుగగూడదని ప్రభుత్వము వారు అంగీకరించి, ప్రస్తుత తీర్మానమును మార్చెదరనుకొనెదు. అప్పుడు కూడ, గొప్ప ప్రతిభాశాలురు అభ్యర్థులుగానున్న తప్ప, తక్కినవారి యెన్నికలలో మతభేదము, జాతిభేదము, వర్ణభేదము ఈ దేశములో తప్పక గమనించబడును. ఈ విభేదములు మన కుగ్గుపాలతో అస్థిని బట్టియున్నవి. అన్యోన్యవివాహములు, భోజన ప్రతిభోజనములు బహిష్కరింపబడి, ప్రత్యేకసంఘములు శిలారూపములు దాల్చి, ఐకమత్యమునకు భంగము కలిగించునపుడు ప్రజాపరిపాలనము మన దేశములో కలలోని వార్త. మత సాంఘిక సూత్రములను వేరుపరచి, కేవలము పౌరత్వబుద్ధిని, ప్రజోపయోగమును గమనించి వోటువేయువారు మిక్కిలి అరుదు. మన స్థానిక ప్రభుత్వ విషయములో, నోరు, పలుకుబడి, ధనము గల కమ్మ, కాపు అను శాఖలు ఎట్లు దొమ్ములాడుచున్నవో మనము కన్నులార చూచితిమి. బ్రాహ్మణునికి ఈ దొమ్మిలో తావు

లేదు. క్షత్రియ వైశ్యుల కసలే లేరు. తక్కిన కులవృత్తులను బట్టి యేర్పడిన సంఘములను గురించి చెప్పవలసినదే లేదు. మస్లిములకును, మనకును మాట, పలుకు, ఆచారములు, మతములు అన్నియు వేరే. దీనికంతకును ఒక్కటే మందు—వివిధమతనిర్మూలనము. మతము వేరు. వేదాంతచర్చ వేరు. సమస్త సాంఘిక భేదాచారములకును ఈ మతములే పునాది. ముఖ్యముగా మన సనాతన ధర్మవాదుల కీ మాటలు కర్ణ కఠోరములు. ఇన్ని సంవత్సరములనుండి యింత తీవ్రముగ పోరాడుచున్నను, వీరిలో వీ రేకీభవించి, సనాతనధర్మము లేవో నిర్ణయించలేరు. తక్కిన మతములలో ఇట్టివి కలవో లేవో చెప్పరు. సనాతన ధర్మనిర్వచనము చేయకుండా శారదా బిల్లును, దేవాలయ ప్రవేశబిల్లును ఆక్షేపించెదరు. మతనాశన మగుచున్నదని గగ్గోలు పెట్టెదరు.

కాబట్టి, మన దేశమునకు, ప్రజాస్వామిక ప్రభుత్వము కంటె, ఈ వివిధజాతిమతవర్ణములను త్రోసిరాజు చెప్పగల నిరంకుశనాయకుల ప్రభుత్వమే యుండుట శ్రేయస్కరమే మో యని ఒకప్పుడు తోచుచుండును. శీఘ్రముగనో, కొంచె మాలస్యముగనో, సాంఘికవిప్లవము బయలుదేరినగాని, స్వరాజ్యమునకు ఈ హిందూదేశము తగదని స్పష్టపడుచున్నది. అప్పుడు సమష్టి పరిపాలనమే ప్రజాసామాన్యమునకు శరణ్యము.



## 19 వ అ ధ్యా య ము

## రా య ల సీ మ

మన రాయలసీమాంధ్రులను, విశాఖపట్టణములోని విశ్వవిద్యాలయములో చదువుకొనవలసినదని, పెద్దలుకొందరునిర్బంధించుచున్నారు. మరికొందరు పెద్దలు వలదనుచున్నారు. ఒక రాష్ట్రమునకు ఒక శాసననిర్మాణసభ, ఒక కార్యనిర్వాహకసభ, ఒక గవర్నరు, ఒక హైకోర్టు కావలెను గాని, ఒక్క విశ్వవిద్యాలయమే యేలయుండవలెనని నేను ప్రశ్నించుచున్నాను. అనంతపురము కాలేజియేల విశ్వవిద్యాలయముగ నుండకూడదు? అక్కడ ఆనర్సుకోర్సులుపెట్టి విద్యార్థులకు వారే డిగ్రీల నేల యొసంగకూడదు? ప్రపంచములో నున్న అన్ని విద్యాశాఖలున్నగాని, విశ్వవిద్యాలయము మనుపించుకొనదా? మన రాయలసీమసోదరులు, వ్యయప్రయాసలతో మారుమూలానున్న విశాఖపట్టణమున కేలపోవలెను? తమరు స్థాపించజాలని విద్యాశాఖలకొరకు వారే విశ్వవిద్యాలయమునకైనను పోవచ్చునుగదా! సమీపములో నున్న గొప్ప విశ్వవిద్యాలయమునువదలి విశాఖపట్టణమున కేలపోవలెను? ఈ విశ్వవిద్యాలయములు బీదలును మేధావంతులునగు విద్యార్థులకు స్థానములీయజాలనపుడు,మన కళాశాలలను సమీపములోనున్న విశ్వవిద్యాలయముతో యేల చేర్చరాదు? విద్యార్జనకు ఆంధ్రత్వ మేలయడ్డగించవలెను?

అసలు, రాయలసీమలోని కళాశాలలు, స్వతంత్రములై యాంధ్రములో సమస్తకళలను, శాస్త్రములను నేర్పగల విశ్వవిద్యాలయములుగ మారవలెనని నాయభిప్రాయము. ఈవిషయమును విశాలదృష్టితో పరిశీలించినయెడల ప్రజాసామాన్యములో ఉన్నతవిద్య నభ్యసించుటకు తగినసౌకర్యములను ఆయా ప్రాంతములవారు కల్పించుకొనవలెను. తగినంత ధనములేనిచో, కొన్నిశాఖలలోనే విద్యనేర్పి, తక్కినశాఖలలో నభ్యసించుటకు తమ విద్యార్థులను సమీపవిశ్వవిద్యాలయములకు పంపవలెను. ఒకరాష్ట్రమునకంతకును ఒక సంయుక్తవిశ్వవిద్యాలయ ముండకూడదనియే నా యభిప్రాయము. అమెరికా సంయుక్తరాష్ట్రములలో తమ స్వంతడిగ్రీలను కొన్నికొన్ని శాఖలలో యిచ్చు విశ్వవిద్యాలయములు మూడువందలు పైగా నున్నవి. ఈకాలములో గవర్నమెంటు చేతిక్రిందనున్న విశ్వవిద్యాలయములలో డిగ్రీలను పొందినగాని, జీవనాధారము దొరకదను అపోహను వదలవలయును. మద్రాసు విశ్వవిద్యాలయములో సెనెటరు మొదలగు స్థానములు యెక్కువ దొరకునా, లేక విశాఖపట్టణ విద్యాలయములో అవి యెక్కువగ దొరకునా, దేనిలో తనకు పలుకుబడి యెక్కువయుండునను మనోభావనిసత్త్వము, యీవిషయమై వార్తాపత్రికలలో వ్యాసములువ్రాయు పెద్దలను పీడించుచున్నది. ఈ హ్రస్వదృష్టిని వదలి, ధనవ్యయములు తగ్గించుకొని, విద్యలనేర్పగల సౌకర్యములు మనకెక్కడ సమీపములోనున్న అక్కడకే మన

విద్యార్థులను పోవునట్లు చేయవలెను. ఆంధ్రులలో అనేకులు, కలకత్తా, కాశీ, ప్రయాగ విశ్వవిద్యాలయములలో చదువు కొనుచున్నారు. రాయల్సీమలోని కళాశాలలు, విశాఖపట్టణ విశ్వవిద్యాలయములో చేరినయెడల యెక్కువధనసహాయమును బడసెదరా? దీనికంటె జాతీయ విశ్వవిద్యాలయముల నేర్పరచిన యెడల గవర్నమెంటువానికంటె గొప్పవి అమెరికాలోవలె నే ధనవంతుల సహాయముతో స్థాపింపబడవచ్చును. కాకినాడ కళాశాలను తూర్పు పశ్చిమగోదావరిజిల్లాలోని జమీందారులు, విశ్వవిద్యాలయముగ నేల చేయజాలరు? విశాఖపట్టణములోని విశ్వవిద్యాలయమునకు జయపూరు మహారాజుగారిచ్చినట్లే యీజిల్లాలో పిఠాపురం మహారాజు మొదలగువారీయవచ్చును. ఒకవేళ రాయల్సీమలో జమీందార్లు లేకపోయినను, అక్కడి ప్రజలే ఒక విశ్వవిద్యాలయమును స్థాపింపవచ్చును. పెద్ద పెద్ద జీతములిచ్చినగాని ప్రొఫెసర్లు దొరకరని భావించజనదు. స్వార్థత్యాగముతో అనేకమంది మేధావంతులు వచ్చి పనిచేయుదురు. మధ్య తరగతుల బాలు రనేకమంది గొప్ప పరీక్షలలో నుత్తీర్ణులగుదురు. ఇట్టి విశ్వవిద్యాలయమును యేర్పరుచుటకు మన రాయల్సీమవారు ప్రస్తుతము పూనుకొనక పోయినను వారు ఆంధ్ర విశ్వవిద్యాలయములో చేరవలసిన అవసరము నాకు కనుపించదు. ఆంధ్రులందరు కలసి యుండవలెనను కోరిక తప్ప, సమీపమందున్న విశ్వవిద్యాలయమును వదలి, దూరమందున్నదానికి యేల ప్రాకులాడవలెనో, హేతువులే

మియు, వ్యాసకర్తలు కనుపరచరు. అతి సులభముగా విద్యార్జన చేయుటకును, పరీక్షలకు పోవుటకును సమీపమున నున్న చెన్నపట్టణమును వదలి దూరమందున్న విశాఖపట్టణముతో కలువనేల? చెన్నపట్టణముకూడ ఆంధ్ర పట్టణమే. ఇప్పటికి సగభాగము ఆంధ్రమే. నేతి బీరకాయి యగు ఆంధ్ర విశ్వవిద్యాలయమును అంటిపెట్టుకొనవలదని నా సలహా.

---

## 20 వ అ ధ్యా య ము

## ఆ ం ధ్ర వి శ్వ వి ద్యా ల య ము

మా రాజమహేంద్రవర పురప్రముఖులు పబ్లికు మీటింగులుచేయుచు, విశ్వవిద్యాలయమువారు విశాఖపట్టణములో బి. ఏ., బి. ఎస్. సి. ప్యాసు కోర్సులను పెట్టకూడదనియు, అట్లు పెట్టినచో ఫస్టు గ్రేడు కాలేజీలలో యే విద్యార్థియు చేరక ఆనర్సు కోర్సులున్న విశాఖపట్టణము వెళ్లిపోవుదురనియు గోలపెట్టుచున్నారు. విశాఖపట్టణములో ప్యాసు కోర్సు లుండినయెడల, అనవసర పోటీ యేర్పడునని వీరి యభిప్రాయము. దీనిలో కొంత సత్యమున్ననను, ఆనర్సు కోర్సులున్నచోట ప్యాసు కోర్సులుకూడ నుండుటయే న్యాయము. వేసకువేలు జీతములు పుచ్చుకొనుచున్న అక్కడి ప్రొఫెసర్లకు సదా విద్యార్థులకు విద్యల నేర్పుచుండవలెను గాని, ప్రతి విష

యములో ఒక రిద్దరను సాలుకు ఎం. ఏ., ఎం. ఎస్. సి. లను ప్యాసుచేయించుటకాదు. ఈ రాజమండ్రి ప్రముఖుల తీర్మానము తమ కాలేజీ ప్రొఫెసర్లను (లెక్చెరర్లు!) అసమర్థులని వెల్లడించుకొనుచున్నట్లు స్పష్టము. అట్లు కాకపోయినచో, విశాఖపట్టణములో ప్యాసుకోర్సులనుకూడా పెట్టుటవలన సమీపములోనుండు ఫస్టుగ్రేడు కాలేజీలను వదలి, ఆంధ్రదేశములోని విద్యార్థులెల్లరు మారుమూలనున్న విశాఖపట్టణమునకేల వెళ్లెదరు? వీరిలో మేధావంతులందరు ఆనర్సు కోర్సులకు చదువుటకు విశాఖపట్టణము యిప్పుడైనను వెళ్లెదరు గదా ?

ఈ పురప్రముఖులకేమాత్రమైనను స్వగౌరవము స్వార్థత్యాగమున్నచో, ఆంధ్రవిశ్వవిద్యాలయమువారు విశాఖపట్టణములో ప్యాసు కోర్సులను పెట్టుటవలన యితర కళాశాలలకు నష్టము రాగలదని అట్లు, పెట్టకుండ తాము వారిని దేవురించుచు ప్రార్థేయపడుటకంటె తమ కళాశాలలనే విశ్వవిద్యాలయములుగా మార్చి ఆనర్సు కోర్సులు పెట్టుకొని అట్టి ప్రొఫెసర్లచేత విద్యల నేల నేర్పరాదు? రాజమండ్రి కాలేజి డయమండు జూబిలీ సందర్భమున, ప్రాతకాలేజివిద్యార్థుల మీటింగులో నేనొక తీర్మానమును ప్రతిపాదించినపుడు, నలుగురైదుగురు తప్ప తక్కినవా రందరు దానిని యెదిర్చి త్రోసివేసిరి. నాకిప్పటికిని, యీ మెజారిటీవారి యభిప్రాయము బొత్తిగ అనాలోచితమనియు, ప్రహస్యదృష్టిని మాత్రమే కను

పరచుచున్నదనియు తోచుచున్నది. మా రాజమహేంద్ర వరములో నేను మిక్కిలిగ గౌరవించు అనుభవశాలురగు పెద్దలుకూడ యీ విషయములో మిక్కిలి సంకుచితదృష్టిని చూపించుచున్నందుకు వగచుచున్నాను. వీరి స్థానికాభిమానమే (Parochial Patriotism), ఆంధ్ర దేశమున కంతకు కేంద్రస్థానమైన బెజవాడను త్రోసిపుచ్చి మన రాయలీసువారికి మనస్సంకటము కలుగజేసి, మూలనున్న విశాఖపట్టణమునకు విశ్వవిద్యాలయమును నెట్టివేసి, తమ రాజమండ్రి కళాశాలను మృత్యుముఖమునకు తీసికొనివచ్చినది. ఇప్పుడు మన రాయలీసువారికి యెవరికిని ప్రస్తుతము అక్కరలేని లాకాలేజినిన్ని, కొద్దిమంది స్త్రీల కుపయోగించు స్త్రీల కొక కళాశాలను యిప్పించెదరట! ఏవిశ్వవిద్యాలయములోగాని ప్యాసుకోర్సులు లేవట! ఇట్టి సంయుక్త విశ్వవిద్యాలయములలోని (Federal Universities) కాలేజీలలో అట్టివి యుండుట సంభవించదని యెంచినయెడల వీరేల Unitary Universities కు ప్రయత్నించరు? గుంటూరు, బెజవాడ, బందరువారు ఒకటిన్ని, కాకినాడ, రాజమండ్రివారు ఒకటిన్ని, విశాఖపట్టణము విజయనగరమువారు ఒకటిన్ని, అనంతపురం, మదనపల్లి, బళ్లారివారు ఒకటిన్ని యేల యేర్పరుచుకొనకూడదు? ఆయా విశ్వవిద్యాలయములలో వాని చుట్టునున్న పరిస్థితులనుబట్టి కొన్నివిషయములలోనే సిద్ధాంతభాగమును, ఆచరణభాగమును కూడ నేర్పి తమ గ్రాడ్యుయేట్లలోని

నిరుద్యోగసమస్య నేల పరిష్కరింప ప్రయత్నించగూడదు? లాబరేటరీలు, మ్యూజియములు అక్కరలేని కేవలము సారస్వతము, తర్కము, చరిత్ర, వేదాంతము, వృక్షశాస్త్రము మొదలగునవి ప్రతివిశ్వవిద్యాలయములోను నేర్పవచ్చును గదా! విత్తముకొలది వైభవము! మన ఘన్టుగ్రేడు కాలేజిలలో ప్యాసై ధనవంతులై పెద్దయుద్యోగములలో నున్నవారు కొంత స్వార్థత్యాగము చూపి జమీందార్లు, అగ్రహారికులు, ముఖాసాదార్లు, వర్తకులు, లాయర్లు మొదలగువారినుండి ధనము ప్రోగుచేయ మొదలిడినచో ప్రతికళాశాలయు ఒక విశ్వవిద్యాలయమగుటయే గాక అచ్చటి ప్రొఫెసర్లు, ఇప్పటి ఆంధ్రవిశ్వవిద్యాలయములోని వారిని తలదన్ని నవారు రాగలరు. అమెరికాలోవలెనే గవర్నమెంటు కళాశాలలోకంటె యెక్కువ జీతగాండ్రును, యెక్కువ ప్రతిభావంతులును యీ ప్రయివేటు విశ్వవిద్యాలయములలో నుందురు. రాజ్యపరిపాలనలో గొప్పమార్పులు యేర్పడినప్పుడు, గవర్నమెంటు ఉద్యోగములుకూడా మేధావంతులగు యే విశ్వవిద్యాలయములోని గ్రాడ్యుయేట్లకైనను యీయబడును. ఇదిగాక, యే విషయములోగాని కూలంకషమైన జ్ఞానముగలవానికి అగ్రస్థానము అనేక వృత్తులలో కలిగి తీరును.

తక్కిన కళాశాలలకంటె తమది విశాఖపట్టణమునకు అతి సమీపముగ నుండుటబట్టి, రాజమండ్రి కళాశాలవిద్యార్థి శూన్యమయినయెడల గవర్నమెంటువారు యిప్పటి యార్థిక

ముస్థితిలో తీసివేసెదరేమోయని భయముచేత, మన ప్రముఖులను యిట్టి తీర్మానమునకు ప్రోత్సహించినదిగాని, తక్కిన కళాశాలలమీది దయచేతకాదు. ఇది ఒట్టి స్వార్థపరత్వము వలననే పురికొల్పబడినది. వెనుక బెజవాడవారితో పోరి తెచ్చి పెట్టుకొన్న అపాయము వీరికి తిరిగి వచ్చునేమోయని భయము. దీనికి మందేమి? ఏబదిసంవత్సరములక్రిందనే, నేను రాజమంద్రి కళాశాలలో బి. యే. ప్యాసగుటయేగాక నా నాల్గవతరగతిలో నుండియు మెట్కాఫుగారి శిష్యుడ నయిన నాకంటె యీ ప్రముఖు లెవరికిని రాజమంద్రీ కళాశాలయందు యెక్కువ యభిమాన ముండనేరదు. భవిష్యత్తును మనస్సులో పెట్టుకొని, దీనిని సంపూర్ణస్వతంత్రజాతీయ విశ్వవిద్యాలయముగ చేయగలమని నా దృఢనమ్మకము. మన ప్రముఖులకు యీ మనోబానిసత్వ మున్నంతవరకు, తుమ్మితే యూడిపోవు ముక్కువలె గవర్నమెంటువారు కరుణజూపనిచో, యీ కళాశాల ప్రజాసహాయము బడయకుండ నశించిపోవునేమో యను భయ మున్నన్నాళ్లు, యిట్టి యవాంతరములు కలుగుచునే యుండును. మన ఆంధ్రరాష్ట్రములోని అన్ని కళాశాలలు ప్రత్యేకవిశ్వవిద్యాలయములై ఒకదాని నొకటి విద్యాబోధనలో మించుటయేగాక, ప్రత్యేకవిషయములలో వానివాని వీలుకొలది ఉన్నతవిద్యల నొసంగుటకు ప్రయత్నించవలెను గాని, యేదియో నొకమూలనున్న విశ్వవిద్యాలయమునకు తోకవలెనుండి, అది దయదలచి నేర్పమన్నంతమట్టుకే, అది

యేర్పాటుచేయు విధానమునే, అది యెప్పుకొన్న ప్రొఫెసర్లనే, మనము తూచా తప్పక ఆమోదించుట మన ప్రముఖులకు తగనిపని.

ఈ విశ్వవిద్యాలయ అకాడమిక్కు కౌన్సిలువారు విశాఖపట్టణములో బి. యే., బి. యస్. సి. ప్యాసు కోర్సు కూడ నేర్పుటకు తీర్మానించిరి. సర్. సి. వి. రామన్‌గారును, సర్ యస్. రాధాకృష్ణన్‌గారును తీర్మానమును మిక్కిలి సూక్ష్మదృష్టితో బలపరచకపోయినయెడల, ఇది నెగ్గియుండెడిది కాదు. మేధావంతులైన బీదవిద్యార్థులు తమకు సమీపమున నున్న కళాశాలలను వదలి, సొమ్ము ఖర్చుపెట్టుకొని విశాఖపట్టణమునకు వెళ్లజాలరు. ఎట్లు విద్య నేర్పినను ప్యాసు అయితిమనే పేరుకైనను యితర పట్టణములలోని కళాశాలలలో చదువుకొనేవా రనేకమంది యుందురు. ఉద్యోగములు దొరకకపోవుగాక. నోటిలో విద్య యుంటే యెప్పటికైనను కొంచె మక్కరకు రాకపోవునా? స్వల్పవేతనము మీదనే జీవింపవచ్చును. అవివాహితులకే గాని ఈ కళాశాలలలో ప్రవేశమీయగూడదని ఒక తీర్మానము చేయవలెను. అప్పుడు యీ పట్టభద్రులు, యే పల్లెకో వెళ్లి జీవనోపాధి సంపాదించుకొనగలరు.

ఇప్పుడైనను, మా రాజమండ్రి ప్రముఖులును, రాయలసీమవారును మేల్కొనెదరా? విజయనగరము కాకినాడ కళాశాలలను మహారాజులు పోషించుచున్నారు. విశాఖపట్టణపు

కళాశాలను, జయపూరు మహారాజు మొదలగువారు పోషించ గలరు గనుక తక్కిన పట్టణస్థులు తమ దారి తాము చూచు కొనవలెను. గవర్నమెంటువారు రాజమండ్రి కళాశాలకు సహాయముచేయ నవసరము లేదని కొలదికాలములోనే చెప్పి వేయుదురు. అప్పుడు మేల్కొనుటకంటె నిప్పుడే, మన కళా శాలను ప్రత్యేక విశ్వవిద్యాలయముగా చేయుటకు ప్రయ త్నింపవలెను. తూర్పు పడమర గోదావరి జిల్లాలవారు, నిజ ముగా ఉన్నత విద్యాభివృద్ధికి పాటుపడదలచుకొన్న యెడల, స్వాతంత్ర్యజాతీయ విశ్వవిద్యాలయము, కొన్ని శాఖలలోనే, ఆనర్సు కోర్సులతో కూడా నడిపింపవచ్చును. త్యాగబుద్ధితో కొద్దిజీతములే పుచ్చుకొని పని చేయగల ప్రొఫెసర్లే దొరకరా? అమెరికాలోను, పూర్వము మనలోను కూడా విద్యార్థి ఫలాని విశ్వవిద్యాలయములో చదువుకొంటి నని చెప్పడు. ఫలాని ప్రొఫెసరుగారి శిష్యుడ నని చెప్పుకొనుటకు గర్వించును. మెట్కాఫు, మిల్లరు, గోపాలరావు, పవెల్, తాంప్సన్ మొద లగు ప్రొఫెసర్లు తమ శిష్యుల ప్రేమను చూరగొని, యిప్పటికిని జీవన్మృతులుగానే యున్నారు. ఏబదిసంవత్సరములనుండి వందలకొలది తాను పంపించుచుండిన పట్టభద్రులలో ఒక డజన్ మేధావంతులును, త్యాగశీలురును తనకు సహాయము చేయుటకు యీ రాజమండ్రి కళాశాల నోచుకొనలేనపుడు యీ కళాశాలను యెంత శీఘ్రముగ తీసివేసిన అంత మంచిది. సమీపములో మూడు గొప్ప ధనముగల కళాశాల లున్నపుడు

యీ కళాశాలతో నిమిత్తము లేదని గవర్నమెంటువారు తలచెదరు. మన విజయనగరము, పిఠాపురము మహారాజులు యిప్పుడైనను తమ కళాశాలలను ప్రత్యేక విశ్వవిద్యాలయములుగా మార్చుకొనుటయే న్యాయము. కృష్ణా, గుంటూరు జిల్లాలకు మిషనెరీవారు, చల్లపల్లి జమీందారుగారు గుంటూరు మచిలీపట్టణములలో చిన్న విశ్వవిద్యాలయములను స్థాపింపగలరు. వారు కొన్ని శాఖలలోనే ప్యాసుకోర్సులు, ఆనర్సు కోర్సులు స్థాపింపవచ్చును. అప్పు డవి విశ్వవిద్యాలయములు కాకపోవునా ?

ఇక మన రాయలసీమవారు చేయవలసినది స్పష్టమే. ఆంధ్రరాష్ట్రావశ్యకతను గురించి భిన్నాభిప్రాయములు లేకపోయినను ప్రత్యేకాంధ్ర విశ్వవిద్యాలయము ఒక్కటైనను మన రాయలసీమ కుండవలెను. అక్కడి కళాశాల లన్నియు కలసి ఆనర్సుకొరకు ఒక విశ్వవిద్యాలయమును యిప్పుడే ఏర్పరుచుకొనవచ్చును. ధనాభావ మున్నదని జంకవలదు. ఇప్పుడు మాత్రము విశాఖపట్టణమువారు వీ రెవరికైనను సహాయము చేయుచున్నారా ? మనవలెనే వారును గవర్నమెంటువారినే ప్రాధేయపడుచున్నారు. ఆయా ప్రాంతముల వారికి కొంచెమో గొప్పో వారివలన సహాయమును పొందుదురు. 'పిండికొలది రొట్టె' యను సామెతను బట్టి ఆయా కళాశాలలు ఒకటి రెండు శాఖలలోనే ప్యాసు ఆనర్సుకోర్సులకు డిగ్రీల నీయగల విశ్వవిద్యాలయములుగా యేల మార

గూడదు? బీదల కందరకును ఉన్నతవిద్య అందుబాటులో నుండినయెడల, అక్కడనే కొందరు మేధావంతులు, సిద్ధాంతాచరణభాగములలో ప్రొఫెసర్లుగా బయలుదేరుచుందురు.

## ఆంధ్ర విశ్వవిద్యాలయ కర్తవ్యము.

ప్రతివిశ్వవిద్యాలయములో, సమస్తవిద్యలను కలిపిననేగాని, దాని కాసార్థకనామము వర్తింపక పోవచ్చునుగాని ఆధునిక యుగములో, యీ విద్యలసంఖ్య అనంతముగా పెరిగిపోవుచుండుటచేతను, ధనాభావముచేతను, మనవిశ్వవిద్యాలయములలో కొన్నికొన్ని విద్యలకే ప్రాముఖ్యము నీయవలసి వచ్చుచున్నది. గత ముప్పది సంవత్సరములనుండియు, మనయాంధ్ర దేశమునకుఒకప్రత్యేకవిశ్వవిద్యాలయము కావలెనని చేసిన యాందోళనము, లా, మెడికల్, యింజనీరింగు కాలేజీలను పెట్టుకొనుటకు కాదు. తర్క వేదాంతములు వృద్ధిచేయుటకు కాదు. వీనిని బోధించు కళాశాలలు యిదివరకే యున్నవి. వీనికన్నిటికిపై మెట్టునచెన్నపట్టణము విశ్వవిద్యాలయమున్నది. దీనినకలే మన యాంధ్రవిశ్వవిద్యాలయము. పరీక్ష లేర్పరచి డిగ్రీలనిచ్చుటకే దీని నేర్పరుచుట, ఆంధ్రరాష్ట్ర నిర్మాణోద్యమ నాయకుల యాశిర్న మెన్నటికిని కాదు. వృథాగా లక్షలకొలది ధనమును వ్యయపరచి నిరుద్యోగసమస్యను పరిష్కరింపజాలక, గతానుగతికో లోకః యనునట్లు యిదివరకున్న విశ్వవిద్యాలయములలోవలె డిగ్రీల నిచ్చుటతో యీ

బీన విశ్వవిద్యాలయము తృప్తి నొందుచున్నది. ప్రజోపయోగకరముగా గల మన యాంధ్రవిశ్వవిద్యాలయములు చేయవలసిన పనులను ఒకటిరెంటిని యిట వివరించుచున్నాను.

(1) ఆంధ్రసారస్వతమును పెంపొందించుట.

ఇపుడు మనకున్న ఆంధ్రప్రబంధములు, సంస్కృతకావ్యములు, మంచి భాషాశైలిగలిగి వానిలోని అలంకారములు వర్ణనలు మనకానందము కలుగజేయవచ్చును కాని జ్ఞానమును వృద్ధిపరచునవి కావు. వీనిలో నున్నదంతయు మనము కనిపిని యెఱుగనివి. ఉత్ప్రేక్షాద్యలంకారములతో నిండిన స్త్రీపురుష ప్రకృతివర్ణనలతో అన్నియు ఒక్కమాదిరిగనే యుండును. పూర్వపు పురాణములలోని స్త్రీ పురుషులు, వారొనర్చిన కార్యములు తప్ప, వివిధచిత్తవృత్తులు, అనుదినసంఘటనలు మొదగువానిని తెలుపు ప్రాక్పశ్చిమదేశీయులు సారస్వతము మన యాంధ్రభాషలో, కలికమునకైనను కనుపడుచుండుటలేదు. ప్రపంచములో అనుదినము మనకెట్టెదుట బయలుదేరుచున్న సమస్యలను వర్ణించుగ్రంథకర్తలేరి? మన విశ్వవిద్యాలయాధికారులు, ఆంధ్రసారస్వతమును వృద్ధిచేయుట కెట్టిప్రయత్నములచేసిరి? పాశ్చాత్యభాషలలోని సాహిత్యములోని మణిమాణిక్యములను, మన యాంధ్రభాషలోనికి తెచ్చి మనభాష నెట్లు పునరుజ్జీవింపచేయుచున్నారు! ఫ్రెంచి, యింగ్లీషు, జర్మనుభాషలలో అనుదినము వెలువడు గద్య పద్యగ్రంథములలోని నూతనాంశములను, ప్రజాసామాన్యము

చదువుకొని ఆనందించుటకు, ఆంధ్రభాషలో యేల వీరు వ్రాయించకూడదు ?

బాలురు చదువుకొనుటకు, శతకములు, కొన్ని వాచకపుస్తకములు మనకు గలవు. కాని అనేకరంగుల చిత్రపటములతో నిండి, బాలబాలికలను రంజింపచేయ గల చిన్నచిన్న గ్రంథములు మన యాంధ్రభాషలో లేవు కదా! పాశ్చాత్య భాషలలో, అనుదినము వెలువడుచున్న బాలుర కుపయోగించు గ్రంథములు (Books for the bairns) మనయాంధ్రభాషలో యీ విశ్వవిద్యాలయాధికారులు యేల వ్రాయించరు? ప్రజాసామాన్యములో చిరుతప్రాయముననే యెంత జ్ఞానమునైనను మనము దీనివలన వ్యాపింప జేయగలముగదా!

(2) ప్రకృతిశాస్త్రజ్ఞానాభివృద్ధి.

సృష్టియొక్క ఆద్యంతములను గురించి, యెన్నివిధములైన వేదాంతములు బయలుదేరుచున్నను, యివియన్నియు ఊహాజన్యము లనుటకు సందేహములేదు. అయినను సృష్టియొక్క క్రమవికాసమును గురించి (Evolution) ప్రత్యక్ష ప్రమాణములద్వారా, అనేకపరిశోధనలను చేయుచు, వివిధ భౌతికశాస్త్రజ్ఞులు, ఆధునికయుగములో ప్రకృతిరహస్యములను బయటపెట్టుచు, అనేక యుద్గ్రంథములను వ్రాయుచుండగా, వానిలోని ప్రాతిపదికసూత్రములను ఫలితములను క్రోడీకరించి, మన యాంధ్రవిశ్వవిద్యాలయాధికారులు ఆంధ్రభాషలో చిన్నగ్రంథములనైనను Primers వ్రాయించిరా?

ఆయాశాస్త్రములు, కళలు మొదలగునవి ఆంధ్రభాషలో ప్రజాసామాన్యమున కుపయుక్తపడునట్లు అనువదింపజేయుట వీరివిధికాదా! వీరు నిజాము రాష్ట్రములోని ఉస్మానియా విశ్వవిద్యాలయము వారివలె దేశభాషలోనికి సమస్తజ్ఞానము నేల తెచ్చుకొనుటకు ప్రయత్నించరు?

పెద్దలకును, చిన్నలకును ఉపయోగించు విజ్ఞానబీజములన్, తమశక్తికొలది వెదజల్లని యీఆంధ్ర విశ్వవిద్యాలయము వట్టి నేతిబీరకాయవంటిదైనది. నేతిబీరకాయలో నేయియెట్లు మృగ్యమో, ఆంధ్ర విశ్వవిద్యాలయములో ఆంధ్రత్వమంత మృగ్యము. ఇది డిగ్రీపరీక్షలలో, ఆంధ్రము నిర్బంధపఠనీయముగనైనను చేయలేదు. ఇతరశాస్త్రములను ఆంధ్రములో పఠించుయేర్పాటైనను చేయలేదు. దీనికి కావలసిన గ్రంథములనైనను వ్రాయించలేదు. పెద్దపెద్దజీతము లిచ్చి ప్రొఫెసర్లను యేర్పరచిరేగాని, వీరిచేత వీరి యభిమానశాస్త్రములలో ఆంధ్రభాషయందు గ్రంథములను వ్రాయించలేదు. డబ్బు ఖర్చగుచున్నదిగాని ఆంధ్రావళికి ఫలితముసున్న. డిగ్రీలనిచ్చి, ప్రపంచములో, యెక్కడికోపోయి ముష్టియెత్తుకొమ్మని చెప్పుటయేగాని, నిరుద్యోగసమస్యను పరిష్కరించుట కెట్టివిధానము నరయజాలరు: తెలివిగల బీదపిల్లవాండ్రకు, విద్యార్జన సౌకర్యములు చేయజాలరు. డిగ్రీపరీక్షకు, వరుసగా నెడతెగకుండ రెండు సంవత్సరములు చదువవలెననియు,కొంతవయస్సు వచ్చినగాని ప్రయివేటుగా కొన్ని

పరీక్షలకు పోకూడదనియు, తమ కేర్పరచిన కరిక్యులము ప్రకారము, అన్ని విషయములలో ప్యాసయినగాని డిగ్రీ యీయమనియు, నింగ్లీషుభాషకు నూటికి నలువది గుణములు రాకపోతే గణితము మొదలగు నితరశాస్త్రములలో నూటికి తొంబది గుణములువచ్చినను, డిగ్రీకి అర్హుడుగాడనియు, ఆకేసిమాసములకు కొన్ని గ్రంథములు పూర్తిచేసినవారికి, వానిలో అప్పుడే పరీక్షించి దానిలో ఉత్తీర్ణులుకాగానే వదలక, రెండుసంవత్సరముల తరువాత, యీ గ్రంథములలో నున్న సంగతులను జ్ఞాపకముపెట్టుకొని ఒక్కసారే పరీక్షలో ప్యాసుకావలెననియు నీమొదలగు నితర విశ్వవిద్యాలయముల పిచ్చి విధానముల మాత్రము వీరవలంబించెదరు. విద్యార్జన యందభిలాషగల బీద విద్యార్థులు తమ జీవనమునకు పాటు పడుచు యీ కళాశాలలో ఆకేసిమాసములు చదువుకొని, ఏల కొన్నిసంవత్సరముల యనంతరము డిగ్రీతీసికొనకూడదు? వీరికి జ్ఞానము ప్రధానమా? జ్ఞాపకముంచుకొనుట ప్రధానమా? యీ పరీక్షలలో విద్యార్థి యేమాత్రము జ్ఞానము సంపాదించి నది తెలిసికొనుటకా? లేక అతనికి యేది రాదో, యేమూలది చదివియుండడో తెలిసికొనుటకా? కాబట్టి ప్రజాబాహుళ్య మున కుపయోగించని యిట్టి యాంధ్ర విశ్వవిద్యాలయము మనకు లభించునని, 1911-వ సంవత్సరములో మేము కలలో నైనను తలచలేదు.

---

## 21 వ అ ధ్యా య ము

### గ్రంథాలయోద్యమము

మన యాంధ్ర రాష్ట్రములో యీ యుద్యమము బాగుగా వ్యాపించుచున్నది. ప్రతిజిల్లాలోనుండు కొన్ని గ్రామములలోనైనను పుస్తకభాండాగారములు నెలకొల్పబడు చుండుటచేత కొందరు నాయకులు, కొన్ని రెన్సుల నేర్పరచి పెద్దలచేత ఉపన్యాసముల నిప్పించుట పరిపాటియగుచున్నది. వీరందరు యీ యుద్యమమును పొగడువారేగాని యీ వివిధ గ్రంథాలయముల ప్రస్తుతస్థితినిగాని కార్యక్రమమును గాని పరిశోధించుచున్నవారు కనుపడరు. సాధారణముగా గ్రంథ వార్తాపత్రికాపఠనమందాశగల కొందరు యువకులుచేరి యెవరింటనో ఒక గదిలో ఒక యెరువు బీరువాపెట్టి ముప్పై కొన్ని పనికిరాని ప్రాత పుస్తకములను చేర్చి దానికొక పెద్ద గ్రంథాలయ నామమునుంచి తాము సెక్రటరీ వ్రాసి ఓంటులనుపేర్లను తగిలించుకొందురు. ప్రతి గ్రంథకర్తను, ప్రతి పత్రికాసంపాదకుని వారి గ్రంథములను పత్రికలను తమ కుచితముగా పంపమని వేధింతురు. ఆగ్రంథకర్తలకును, సంపాదకులకును దీనివలన కలుగుచున్న హాని యింతింతకాదు. గ్రామములో కనీసము ఒకరిద్దరైనను వానిని తెప్పించుకొని ఆ గ్రంథకర్తలకును పత్రికాధిపతులకును ప్రోత్సాహము నొసంగుటకు బదులుగా ఆ చందాలనుకూడ

పడగొట్టి ధర్మమనియు ప్రజాసామాన్యమున కుపకరించు ననియు, గ్రంథాలయమునకని చెప్పి ఎట్లో వ్యయము లేకుండ గ్రామస్థులందరు వానిని చదువుకొనెదరు. బీదసాదలందరు మెంబరులై వాని నుపయోగించుకొనవచ్చును. తేరగా వచ్చి నప్పుడు డబ్బుదండు గెందుకు ?

ఇట్టి గ్రంథాలయాధికారులు సారస్వతాభివృద్ధికి యెంత అపకారము చేయుచున్నారో గుర్తించుచున్నట్లు కనుపడదు. ఏ గ్రంథాలయములో గాని యిరువది మెంబర్లుండి ఒక్కొక్కరు నెలకు రెండణాలు చందానిచ్చినను దినపత్రిక యగు నాంధ్ర పత్రికయు కృష్ణాపత్రికయు రాగలవు. ఇట్టి బీద దేశములో కూడ బంగాళీ మహారాష్ట్రములలోని వార్తాపత్రికలలో కొన్నింటిని యిరువదివేల పైన చందాదారులుండగా పై పత్రికలు తగి నంతమంది చందాదారులు లేక కృశించుచున్నవి. పాశ్చాత్యులలోవలె వ్యక్తులే గొప్ప పుస్తకభాండాగారములను తమ యుపయోగమునకే సేకరించుట మనలో అరుదుగ నున్నను మన గ్రంథాలయములన్నియు ఒక్కొక ప్రతి తెప్పించు కున్నను గ్రంథకర్తల కెంత ప్రోత్సాహముండును! నూతనముగ వెలువడు సద్గ్రంథములను తెప్పించుకొనజాలని గ్రంథాలయము ఒక గ్రంథాలయమా ? చాలా గ్రంథాలయములకు గృహములే లేవు. చందాలను బకాయపెట్టువారు పుస్తకములు యెరువుతీసికొని తిరిగి యీయనివారు మెంబర్లుగ నుందురు. ముష్టియెత్తి పది వార్తాపత్రికలను తెచ్చుకొని

లోకాభిరామాయణముతో కాలము గడపుదురే కాని జన సామాన్యమునకు వానిలోని ముఖ్యవిషయములను ప్రతి దినము బోధించువారు గాని, యిండ్లకు గ్రంథములను తీసి కొనిపోయి బాలబాలికలచేత చదివించువారు గాని, వీని మెంబర్లలో సాధారణముగా కనుపడరు. ఇది పోనిండు, గ్రంథాలయముల సెక్రటరీలు తమ స్వగౌరవమును నిలువు కొనక ధర్మమని పేరుచెప్పి గ్రంథకర్తలను, పత్రికాధిపతులను దేవురించి వారియెడ మిక్కిలి అపచారము చేయుచున్నారే గాని తమరు త్యాగమును కనుపరచి తమ కాళ్లమీద తాము నిలుచుటకు కొంచమైనను స్వయంసహాయము చేసి కొనుటకు ప్రయత్నించరు. ఒక రూపాయిలోపు గ్రంథమునకు ఒక్కొకమెంబరు ఒక్క అణా వేసుకొని గ్రంథాలయమునకు సేకరించవచ్చునే? పోస్టేజి బిళ్లలు పంపితే గ్రంథమును ఉచిత ముగా పంపెదనన్నను దానినికూడ పంపజాలని గ్రంథాలయ మున్న నేమి? ఊడిననేమి? ఇట్టి గ్రంథాలయములకు నావంటి వాడు తన యభిప్రాయములను ప్రచారముచేయుటకై పోస్టేజి పెట్టుకొని పంపినను యిట్టి గ్రంథాలయ సెక్రటరీలు వానిని సురక్షితముగ నుంచగలరని యేమి నమ్మకము?

కాబట్టి ఆంధ్రదేశమునకు కేంద్ర గ్రంథాలయమని పేరువడసిన బెజవాడలోని రామమోహన్ గ్రంథాలయాధి కారులు కావలసిన వివరణములతో ఒక గ్రంథాలయ పట్టికను తయారు చేయుటకును వానిని సూపర్వైజు చేయుటకును ఒక

ప్రచారకుని ప్రతి జిల్లాకు నియమించి ఆయన జీతబత్తెములకు సాలుకు రెండేసి రూపాయిలైనను ప్రతి గ్రంథాలయము నుండి వసూలుపరచవలెను. అట్లు గ్రంథాలయములన్నిటి స్థితిగతులను తెలిసికొని ఒక సాంవత్సరిక రిపోర్టును తయారు చేసి ఆంధ్రమహాజనసభలో చదివి, దాని కాపీ ప్రతి గ్రంథాలయమునకు నంపచేయవలెను. ఇట్టి కార్యవిధాన మేదియో యొకటి లేనిది యేయుద్యమము జయప్రదముగ జరుగనేరదు. అతిచవుకగా దేశాభిమానులమని యనిపించుకొనవచ్చును గాని, ఒడలువంచి నిరాడంబరముగ కార్యక్రమములో దిగి త్యాగమును కనపరచుచు అంగనిర్మాణము చేయువారు మిక్కిలి అరుదుగ నున్నారు. ప్రజాసామాన్యములో జ్ఞానాంకురములను వెదచల్లుటకును, గ్రంథకర్తలకును గొప్ప వార్తాపత్రికాధిపతులకును ప్రోత్సాహ మొసంగుటకును, యీ గ్రంథాలయోద్యమము మిక్కిలి ఉపయోగపడుననుటకు సందేహము లేదు. రాజకీయ సాంఘికాది విషయములలో జనసామాన్యము ఒక్క హేతుపూర్వకమైన నిశ్చయాభిప్రాయమునకు రాగలుగుచుందురు. స్వరాజ్యపరిపాలనకు ఈ యుద్యమము ఒక పట్టుకొమ్మ. కాని దీనిని సరియైనమార్గములో నడిపేనాథులేరి? త్యాగశీలురేరి? స్వోత్కర్ష ప్రియులు మాత్రమే కనుపడుచున్నారు.

---

## 22 వ అధ్యాయము

### జనసామాన్యములో జ్ఞానాభివృద్ధి

మన ప్రజలలో, నైతి కార్థిక సాంఘిక రాజకీయ విషయములయందు మనస్స్వాతంత్ర్యమును పెంపొందించుటకు ఎల్లపుడు పల్లెలలో సంచారము చేయు యువకులు కావలెను. అక్కడ ఆ యా విషయములను బోధించుటకు సులభశైలిని దేశభాషలలో గ్రంథములు తయారగుచుండవలెను. సమస్త భౌతిక శాస్త్రములు, ప్రజల కర్థమగునట్లు, సాధ్యమైనంత సులభమగుభాషలో వ్రాయించుచుండవలెను. ఈ పనికి ప్రతి జిల్లాలోను, ఒక ప్రచారకకమిటీ యేర్పడి, జీతబత్తెముల నిచ్చి యేజంట్లను ఏర్పరచవలెను. ఇట్టి వ్యాసములను వ్రాయునట్టి వారు, నా వలెనే యనేకమంది యుందురుగాని, త్రికరణశుద్ధిగ పనిచేయుటకు స్వార్థత్యాగులు అరుదుగ నున్నారు. శాసన సభలయందు వ్యామోహము కలవారు, శ్లేష్మములో నీగల వలె వానిలో చిక్కుబడి తన్నుకొనుచున్నను, తక్కిన మన నాయకులు, సౌమ్యయుద్ధమునకు పునాదియగు జ్ఞానములో ప్రజలను తరిబీతు చేయుటకంటె నిప్పుడు చేయగలిగిన దేమున్నది ?

ఈ ప్రచారమునకు కావలసిన ధనము, త్యాగమును చూపించగల నాయకులువచ్చి గ్రామస్థులకు ఉద్బోధచేసి

నపుడే రాగలదు. ఒక్క దమ్మిడీ మొదలుకొని యెంత మొత్తమునైనను పల్లెటూళ్లలో దినముల వెంబడి ఉండి వసూలు చేసికొనవలెను. ఖగోళ, భూగోళముల గ్లోబులు, శారీరకశాస్త్రపటములు, మాజికు లాంటరన్, కొన్ని గ్రంథములను దీసికొని, ప్రతి జిల్లాలో, ఇంతవరకు పేరుపొందిన కాంగ్రెసు నాయకులే బయలుదేరవలెను. ఈ పని ఉత్తమాటలతోను ఉపన్యాసములతోను సాగ దనుట నిజము. ప్రజాబాహుళ్యములో, వారికి కావలసిన ముఖ్యవిషయములలో శ్రుతపాండిత్యమలవడ జేయవలెనన్న, ఈ పనికి వీరు స్వాయముగా పూనవలెను. వసూలు చేయుచున్న సొమ్ముకు సరియైన లెక్క లుంచవలెను. దానిని సరిగా ఖర్చు పెట్టవలెను. మన యనుభవమునుబట్టి, మనస్థానిక ప్రభుత్వము, జనులలో నీతికొఱవడుటచేతనే జయప్రదము కాలేదు. సహకారోద్యమముయొక్క గతియు నంతే.

ఇప్పటి పరిస్థితులలో, మనపల్లెవారును, పట్టణవాసులును కూడ ప్రజాప్రభుత్వమునకు పనికిరారనియె నానిశ్చితాభిప్రాయము. దీనికి కారకులు కాంగ్రెసును గత నలుబది సంవత్సములనుండియు నడుపు మన కాంగ్రెసు నాయకులే. సాంఘిక రాజకీయ విషయములలో వారు ప్రజలకు నైతిక సూత్రములు పట్టుపడునట్లు చేయక, వారికి పౌరత్వజ్ఞానమేమిమో తెలుపక, బహుమందికి వోటధికారమును అసెసర్లు జూరీల హక్కులును ఇప్పించ ప్రయత్నించిరి. పాశ్చాత్య

దేశములలో కూడ నీ ప్రజాప్రతినిధి పరిపాలనలో లంచగొండి తనము మొదలగు అవినీతులు పెరుగుచున్నను, వానిని విరుగుడు చేయుటకు సామాన్య ప్రజలలో పౌరత్వజ్ఞానము (Civic sense) కలదు గనుక, కీడు త్వరలోనే సమసిపోవు చుండును. మానవసంస్థలు పరిపూర్ణత యెన్నటికిని వహించవు గనుకనే, మనలో కొందరు ముఖ్యులు, అప్పుడప్పుడు సహజముగ బయలుదేరు కీడులను ప్రతిఘటించుటకై, ఏమరకుండ సదా ప్రజలలో ప్రచారముచేయుచు లిఖిత వాగ్రూపముగ నైతికసూత్రములను వారి మనములలో నాటుచుండవలెను. దేశభాషలలో, మనపెద్దలలో నెంతమంది యిదివరకు బయలుదేరి, ఉపన్యాసము లిచ్చుచు, గ్రంథములు వ్రాయించి పంచిపెట్టుచు, ఊరూర తిరుగుచున్నారు?

చెప్పుట సులభము, చేయుట కష్టము అను విషయము నాకును తెలియును గనుకనే, నేనును పశ్చాత్తప్తుడనై లోచూపు చూచుకొనుచు నాసోదరులకు జ్ఞప్తికి తెచ్చుచున్నాను. శాసనోల్లంఘనము, సహాయ నిరాకరణము మొదలగు రాజకీయ విధానములు అపజయము పొందుటకు ముఖ్యకారణము ప్రజాసామాన్యములోని నైతికదౌర్బల్యమే. దానిని బాపుటకు, మన యాంధ్ర యువక నాయకులు కొందరైనను స్వార్థమును వీడి నడుము గట్టి పల్లెలలో తిరుగుచు, వివిధ విషయములలో జ్ఞాన బీజములు వెదజల్లుచు, జన బాహుళ్యములో శ్రుతపాండిత్యమును, దేశా

భిమానమును పెంపొందింప జేసినపుడే, మనకు స్వరాజ్యము లభించవచ్చునేమో గాని, యెట్టి సామదానభేద దండోపాయముల నుపయోగించినను అవి వమ్మైపోక తప్పదు.

ప్రపంచములో నితర సంఘసంస్థ లెట్లున్నవి? ఇచ్చటి వర్ణాశ్రమ ధర్మము లేట్టివి? ఆధునిక యుగములో, హైందవ జాతి బలమున కివి యుపయోగించునా? నానా దేశములలోని స్వాతంత్ర్య పోరాటము లెట్లుండెను? ఇప్పటి నూతన సమస్య లెవ్వి? ప్రజల కన్నులు తెరపక, వారి చేతికి కత్తుల నిచ్చిన ప్రయోజనమేమి? దీనికంటె విదేశీయుల ప్రభుత్వమే మంచిది. మన మునిసిపాలిటీలకు జిల్లాబోర్డులకు, సర్కారు మిషన ర్లుంటేనే బాగుండని మనకు తోచుటలేదా! అధికారసాహాయ్యములేని సహకారోద్యమము నశించుటలేదా! ఈ ప్రస్తుత సంఘప్రాతినిధ్య ప్రజాపరిపాలనముకంటె, మన విదేశీయ నిరంకుశప్రభుత్వమే బాగుగా నుండునట్లు కనుబడుచున్నది.

నేను నిస్పృహతతో నిట్లు వ్రాయుచున్నానని తలచ వద్దు. నాకు తోచిన సత్యమును వ్రాయుచున్నాను. కొన్ని విషయములలో నేను పొరబాటు పడవచ్చును. గనుక యితరులు దిద్దవచ్చును. కాని బాలురలోని ప్రస్తుత విద్యావిధానము, ప్రజలలో పౌరత్వజ్ఞానశూన్యత, నాయకులలో పైచూపే గాని, క్రిందిచూపులేకుండుట, పల్లెలను అనుభవములేని యువకులకు వదలివేసి, తామేమో ఘనకార్యము చేసి రాజకీయ రథమును నడపించుచున్నామని విర్రవీగుట— యిట్టి లోపముల

వలననే తోడిజాతులకు వెనుకబడిపోయి మనదేశము బానిస దేశముగా చూడబడుచున్నది. ప్రజలను సాంఘిక రాజకీయ విప్లవములకు తయారుచేయవలెనన్న మనలోని ఆధునిక జ్ఞాన విజ్ఞానాభివృద్ధిగల యోధులు స్వయముగా దేశమంతయు కష్టించి పాటుపడుట ముఖ్యావసరము. పుండు ఒకచోట ఉంటే, మందొకచోట వేసినట్లున్నది! బలహీనజాతులకు విద్యయు, త్యాగము కలిగినపుడు, స్వరాజ్యము కరతలామలకము. అది లేనిచో బలవంతులకు దాసులమై, తుదకు ఊరు పేరు లేక నశించి తీరుదుము. మనలను కనికరించి ఉద్ధరించు జాతులు పుట్టవు. అట్లు జరుగుట ఆత్మసంరక్షణ సూత్రమునకు వ్యతిరేకము. అస్వాభావికము.

---

## 23 వ అ ధ్యా య ము

## దేవాలయ విద్యాలయ సంబంధము

దేవుడు సర్వవ్యాపియైనను, ఆయన నిర్వికారుడు, నిరంజనుడు గనుక, సామాన్యజనులకు ఆయనయందు భక్తి కుదరవలెనని, ఆ యా దేశములవారు, తమకు తోచినరీతిని విగ్రహములు కల్పించి, దేవళములను కట్టి, పూజావిధానముల నేర్పరుచుకొనుచుండిరి. అట్లే మన హిందువులుకూడ, ప్రతి గ్రామములోను ఒక దేవాలయమును కట్టుకొని, దానిలో ఒక

విగ్రహము నేర్పరచి, దానికి ప్రాణప్రతిష్ఠనుచేసి, ప్రజలలో దైవభక్తివ్యాపించుటకు ఆగమసూత్రములు మొదలగు గ్రంథములలో, కోవెలల యందు జరిగించవలసిన తంతును లిఖించి, యీ గ్రంథములను చదువుకొన్నవారిని అర్చకులనుగా నియమించిరి. కాని, క్రమక్రమమున, దేవాలయస్థాపకుల యుద్దేశ్యములు నెరవేరక, జ్ఞానశూన్యులైన అర్చకులు బయలుదేరుటచేత, ఉత్సవములు మొదలగు తమాషాలు వేడుకలు చూచుటకే ప్రజలు ఈ దేవాలయములకు పోవుచున్నారు. కొద్దిమంది మాత్రము ఇప్పటికిని దైవభక్తిచేత, అప్పు డప్పుడు ఈ విగ్రహములను దర్శించెదరు.

అర్చకులు జ్ఞానశూన్యులు, కేవలము స్వార్థపరాయణులునగుటచేతను, కోవెలలో అనేకములగు అమాంగళ్యపు పనులు జరుగుచుండుటచేతను, ఉత్సవములు మొదలగు ఆడంబరములున్నపుడు తప్ప, ఈ దేవాలయములు శూన్యగృహములుగానే యున్నవి. దేవుడు సర్వవ్యాపియని మనము నమ్ముచున్నను, యీ దేవళములలో మాత్రము ఉండడేమో యని సందేహము కలుగుచుండును.

కాబట్టి, అర్చకవిధులతో కొంత జ్ఞానాభివృద్ధి కలవారినే అర్చకులుగా నియమించి, ప్రతిదేవాలయములో ఒక పండితు నేర్పరచి, ఊరిబాలుర కక్కడ విద్య నేర్పించుచున్న యెడల, ఈ దేవాలయములు, ప్రజలకు కొంత ఉపయోగకరములై, వారు తరుచుగా దేవతాదర్శనమును చేసికొని, దైవ

భక్తిని పెంపొందించుకొనెదరు. హిందూదేవాలయపు బోర్డు వారు ప్రతిదేవాలయములో ప్రాశ్చాత్యమాదర్శములను కొంత వరకైనను గ్రహించిన ఒక పండితుని నియమించిన యెడల, ఆయన ప్రాతఃకాలమునందు బాలురకు సంస్కృతాంధ్రములు, ఇంగ్లీషు హిందీ భాషలు నేర్పుటకును, మధ్యాహ్నము ప్రజా బాహుళ్యమునకు పురాణపఠనము, ఉపన్యాసములు వినిపించుటకును, రాత్రిళ్ళు వార్తాపత్రికలు చదివి లౌకిక ప్రపంచ విషయములను ప్రజలకు తెలుపుటకును, అనుకూల్యముకలుగును. చిన్న చిన్న దేవాలయములలో, ఇట్టి యోగ్యతలుగల వారినే అర్చకులనుగా నియమించదగును. వేయిరూపాయిలు నికరాదాయమువచ్చు ప్రతిదేవాలయమునకు నాల్గవవంతు అయివజును వినియోగించిన యెడల, ఒక పండితుని, నెలకు ఇరువదిరూపాయిల జీతముమీద, దేవాలయములో ఏర్పరచ వచ్చును. అప్పుడే యీదేవాలయములు సార్థకములై, సమస్తవిద్యలకు ఆటపట్టులై ప్రజాసామాన్యమున కుపయోగ పడును. ఈ దేవాలయములకు వచ్చుధనమును, ఉత్తఆడంబరములకుగాక, విద్యావ్యాప్తికే ఉపయోగించని యెడల, ఇవి హేళన పాత్రములగును. హైందవ జ్ఞానవిజ్ఞానాభివృద్ధికి, ఈ ధనము ఉపయోగపడునట్లు దేవాలయపు బడ్జట్లను మార్పవలసినదని నేనెన్నిసారులు ఈ బోర్డువారికి వ్రాసినను, తమ జీవనోపాధికికమిషనులెట్లు సులభముగా రాబట్టుకొనగలమాయను ప్రయత్నము తప్ప, వీరికి మా సలహాలు చెవులకు

పట్టవు. కంచెయే చేను మేసినట్లు, దేవాలయ సంరక్షణ కేర్ప
డిన యీ బోర్డు, ఇప్పటి అర్చకులవలెనే, స్వోదరపోషణార్థమై
తామేర్పడినట్లు జను లభిప్రాయపడుటకు అవకాశముల నిచ్చు
చున్నారు. మతవిద్యతో పాటు, నైతిక, లౌకికవిద్యలను కఱపు
నట్లు శాసనములో కొన్ని మార్పులు వీరుచేయించవచ్చును.
కాని దేవాలయపు బిల్లులో యిట్టి మార్పులు పొడగట్టవు.

---

## 24 వ అ ధ్యా య ము

---

### ఆంధ్రగీర్వాణ విద్యాపీఠము–కొవ్వూరు

ప్రాగ్దేశ జీవితాదర్శములతో పాశ్చాత్య దేశాదర్శ
ములను సాధ్యమైనంతవరకు సమ్మేళనము చేయుట, యీ
విద్యాపీఠస్థాపకుడగు శ్రీ తల్లాప్రగడ సూర్యనారాయణరా
వుగారి ముఖ్యోద్దేశము. కాబట్టి, ప్రజాబాహుళ్యములో మత
సాంఘిక, రాజకీయయార్థికాభిప్రాయములు సరియైనవి యెప్ప
టికప్పుడు వెదజల్లుచుండుటకు ప్రత్యేకము పండ్రెండువేల
రూపాయీలు, శాశ్వతనిధిగా యేర్పాటు చేయబడినది.
బాలురలోకూడ అట్టిజ్ఞానము చిన్నతనమునుండియు అలవరుచు
కొనుటకును, ఒక వేదశాస్త్రకళాశాల ఈవిద్యాపీఠమున కను
బంధముగా స్థాపించబడి, దీనికి ప్రత్యేకముగా నిరువదివేల

రూపాయీల మూలధనమును, యేబదియెకరముల భూమియు నిప్పటికి సేకరింపబడియున్నది. ఈకళాశాల ఆంధ్ర విశ్వవిద్యాలయమునకు ఒకశాఖయై సంస్కృతాంధ్రములలో ఉభయభాషాప్రవీణపరీక్షలకు బాలురను తరిబీతు చేయుచున్నది. ఇంతటితో తృప్తినొందక, ఈవిద్యాపీఠ రిజిస్టర్డు కమిటీవారు, సంస్కృతాంధ్రములతోబాటు హిందీ ఆంగ్లేయభాషలను, ఈసారస్వతవిద్యతో సంబంధించిన కర్మకాండ, ఆయుర్వేదము, జ్యోతిషము మొదలగు వృత్తికనుకూల మగు విద్యలనుకూడ ది 1-7-1934 నుండి నేర్పుటకు తీర్మానించిరి.

కడచిన సాంవత్సరికపు ఆదాయవ్యయపట్టీని బట్టి, ఇప్పుడు కళాశాలకు నికరాదాయము రు 2500 లు మాత్రమే వచ్చినది. ఇంకను మరియొక వేయిరూపాయీలున్న గాని, మన మనుకొన్న ప్రకారము క్రింది తరగతుల బాలురకు ఉచిత విద్యనొసంగుట దుర్భరము.

తూర్పు పశ్చిమగోదావరిజిల్లాలలోనేగాక మన ఆంధ్రదేశమంతటనుకూడ ఇట్టి యాదర్శములుగల విద్యాపీఠము ఇది యొక్కటియే. ఈ యాదర్శముల నామోదించువారు స్వహస్త పరహస్తముల గుండ ద్రవ్యసహాయముచేసి యీకళాశాలను నిలబెట్ట గలిగినయెడల మనలో సామాన్యకుటుంబములలోని బాలుర విషయమై నిరుద్యోగ సమస్యను కొంతవరకైనను పరిష్కరించ గలము. మనము ప్రతిపట్టణములో నిట్టి సంస్థాపనలను సులభముగా నెలకొల్పజాలము. మనమిచ్చు స్వల్పధ

ర్శములన్నిటిని యిక్కడ కేంద్రీకరించి, యీఉన్నత కళాశాలకు శాఖలుగా చిన్నచిన్న పాఠశాలలను ఇట్టి యాదర్శములతో నెలకొల్పుకొనవచ్చును, లేదా మామూలు బోర్డు పాఠశాలలలో 1-వ ఫారమువరకు చదివించి బాలురను యిక్కడకు పంపవచ్చును.

యువజనులయొక్కయు బాలురయొక్కయు జ్ఞానాభివృద్ధికిని, జీవనమునకును, తోడ్పడు నీసంస్థాపనకు ప్రజలందరు ఉడతాభక్తితో సహాయపడుచున్న యెడల వారిదానము సరియైనమార్గముల సత్పాత్రులకు వినియోగింపబడుచు వారు ప్రజలలో నిరుద్యోగ సమస్యను కొంతవరకైనను పరిష్కరించ గల జ్ఞానమును వ్యాపింపజేయు పుణ్యమును కట్టుకొనెదరు. ఇట్టి సాంఘికసేవయే దైవసేవ.

---

## 25వ అధ్యాయము

### కోఆపరేటివు యూనియనులు

ఇవి మొదట సదుద్దేశ్యముతోనె సెంట్రల్ బ్యాంకు వారికి ఉపయోగకరములని యేర్పాటు చేయబడిన మాట నిజమే. కాని ఆచరణలో యివి చేయవలసినపని సూపర్వైజర్లగుండానే జరుగుచున్నపుడు వీరిని యూనియను సూపర్వైజరు లనుటకు బదులు బ్యాంకు సూపర్వైజర్లనియే పిలువవచ్చును.

యూనియనులలోని గ్రూపుడైరెక్టర్లు నెలకొకసారి సమావేశమై బత్తాలు తీసికొనుట తప్ప వీరివలన యెట్టి ప్రయోజనము కలుగుచుండలేదనియు హానరెరీ ప్రెసిడెంట్లు, సెక్రటరీలు, గుమాస్తాలు, బంట్రోతుల జీతబత్తెములు, యింటి బాడుగలు మొదలగునవి దండుగగుచున్నవనియు నా యనుభవమువలన తెలిసికొంటిని. సూపర్వైజర్ల సంఖ్య నెక్కువ చేసికొని వారి మీద తణిఖీకి ప్రతితాలూకా పట్టణములో ఒక యినస్పెక్టరును క్లార్కును యేర్పాటు చేసికొని బ్యాంకువారు యెన్ని వందల గ్రామసంఘముల నైనను యిప్పటికంటె తక్కువ ఖర్చుతో పరిపాలించ వచ్చును. హానరెరీ పనియందు నాకెట్టి నమ్మకము యీయార్థికవిషయ పరిపాలనలో కలుగలేదు. నావిధానము ప్రజాస్వామిక ప్రభుత్వము కాకపోవచ్చును. క్రిందినుండి పైమెట్టువరకు సహకార తత్వమునకు భంగము కలిగించవచ్చును. కాని ఆర్థిక విషయములలో ప్రజాస్వామికమునకును, ఋణస్థులు ఋణదాతల నెత్తినెక్కుటకును, యెట్టి స్థానముండకూడదనియే నాయభిప్రాయము.

గ్రామపంచాయితీదార్లును, యూనియనులలోని గ్రూపు డైరెక్టరులును అప్పులుపుచ్చుకొను వర్గములోనే చేరియుండి ఆవర్గమువారి వోట్లమీదనే యేర్పడినపుడును, వీరి ప్రతినిధులే సెంట్రల్ బ్యాంకు పరిపాలక సంఘములో మెజారిటీ అయినపుడును సెంట్రల్ బ్యాంకువారికి యెట్టి యనుభవము కలుగుచున్నదో యిప్పటికైనను బోధపడియుండవచ్చును. మొదట

మనము సెంట్రల్ బ్యాంకులు స్థాపించి నపుడు సాలుకు నూటికి తొమ్మిది రూపాయీలిచ్చెదమని వేలకువేలు షేర్లు వేయించితిమి. ఈషేర్ల ధనమునుబట్టి మద్రాసులోని బ్యాంకులనుండి సొమ్ము తెప్పించుట, యింపీరియల్ బ్యాంకులలో ఓవరు డ్రాఫ్టులు సంపాదించుట, ప్రజలవలన డిపాజిట్లు సంపాదించుట, జరిగినది. వీరి కధికవడ్డీ లిచ్చుటకును, తమధనము సురక్షితముగా నుండుటకును, పరిమితిలేని జాయంటు బాధ్యతతో గ్రామసంఘముల నేర్పాటుచేసి, వానిలో ఆయా గ్రామములలోని బంగారు పిచ్చుకలు కూడా కొందరు యెన్నుకొనబడునట్లు బ్యాంకువారు చేసికొనవలసి వచ్చినది. బీదల ఋణవిముక్తికి, వారికి పొదుపు, పరపతినేర్పి, గ్రామములో ఐకమత్యము వృద్ధిచేసి, యీసహకారోద్యమము ద్వారా నిర్మాణ కార్యక్రమము కూడా జరుగునని మనము ఉవ్విళ్లూరుచు, సుమారు 25 సంవత్సరముల నుండి గ్రామ సంఘములను స్థాపించితిమి. కాలముసరిగా యున్నంతవరకు వీనిలోని లోపములు, అమాంగళ్యములు మనకు కనుపడలేదు. మసిపూసిన నేరేడుకాయలవలెనే యుండెను. బుక్కుఅడ్జెస్టుమెంటులు మొదలగు మార్గముల వలన ఋణములు తీరుచుండుటయు, ఋణాధికారము పెంపొందించుటయు జరుగుచుండెను. దేశములో ఆర్థిక దుస్థితి రాగానే భూములకు ధరలుపడిపోయి, యీబంగారు పిచ్చుకలును, వీరి నేరికొన్న పిచ్చుకలును చెఱువులోని చేపలు బయ

టపడినట్లు పడి, వీరిపొదుపు పరపతులు బహిర్గతములైనవి. వీరిలో యేమాత్రము నీతియున్నదో స్పష్టమైనది. ఇప్పుడు బ్యాంకువారు పూర్వమువలె తమరు తెచ్చిన ధనమును విడుదలచేయలేక, డిపాజిటర్లకును షేరు హోల్డర్లకును యీయవలసిన వడ్డీని తగ్గించవలసి వచ్చుచున్నది. దీనివలన డిపాజిట్లు తప్పక తగ్గునుకదా! ఇక నీతిగల కొందరు గ్రామపంచాయతీ మెంబర్లు, తమ తలలు తడిమి చూచుకొని, పరిమితిలేని జాయింటు బాధ్యతతో, తాము అప్పులు తెచ్చుకొనుటకుగాని, అసలు మెంబర్లుగా నుండుటకుగాని వెఱచుచున్నారు. ఇంతవరకు గ్రామస్థుల కిచ్చిన ఋణముల బకాయివీరినికూడా తాతాచార్యులుగారి ముద్రవలె బాధించుచు, వెంటబడి వేధించుచునే యుండును.

గత యిరువదియైదు సంవత్సరములలో యే గ్రామ పంచాయితీ మెంబరైనను, యీసహకారోద్యమము మూలమున, తన పరపతినిగాని పొదుపునుగాని వృద్ధిచేసికొని బాగుపడినట్లు తన రొమ్ముమీద చేయివేసి, చెప్పగలడా? ఏ సంఘములోగాని, యేమెంబరైనను, తనసొమ్మును డిపాజిట్టుచేసికొని ఋణవిముక్తుడుగ నున్నాడా? ఇదినాకు తెలిసినంతవరకు లేదు సరికదా, మీదుమిక్కిలి యీ గ్రామములలో ఋణాధిక్యత, దుబారాఖర్చు, ఆడంబరజీవనము, వర్ణవైషమ్యములు, అవినీతి, బీనామి, యిన్సాల్వెన్సి మొదలగునవి అధికమైనవి. ఇట్టి పరిస్థితులలో బ్యాంకువారు యీ యూనియనులను తీసి

వేసి తమ సూపరువైజర్లసంఖ్యను హెచ్చించుకొని పైతనిఖీకి ప్రతితాలూకా పట్టణములోను తమస్వంత యిన్స్పెక్టరును కొంచెము సిబ్బందితో యేర్పాటుచేసిన బాగుగ నుండును.

ఈ గ్రామసొసైటీలలో ప్రజా స్వామికమును తీసివేసి మన సూపర్వైజర్లకు సహాయముగ కొందరు నీతిపరులను మనమే యేర్పాటుచేసికొని బీదలకు వారి ఆస్తి తాకట్టుమీద దీర్ఘవాయిదాలతో, ఋణము లిచ్చుటవలన, వారి ఋణబాధలు తప్పించుటయే గాక, పొదుపుకూడ నేర్పగలుగుదుమని తోచుచున్నది. అప్పుడు యీ ప్రస్తుతసహకారచట్టమే మార్చవలసియుండును. పాశ్చాత్యదేశములలోవలె పౌరస్వత్వజ్ఞానము (Civic Sense) గ్రామాభిమానము (Parochial patriotism) అయినను మన పల్లెటూరి వారికింకను అలవడలేదు. ప్రస్తుత వర్ణభేదము లున్నంతవరకు జాతీయభావము (National patriotism) లేక పోగా, సామాన్య విషయములలో నైనను అయికమత్యము కుదురునని నాకుతోచదు. కాబట్టి సెంట్రల్ బ్యాంకులు, యిప్పుడైనను మేల్కొని అజగళస్తనములవలెనున్న యీ యూనియనులను రద్దుపరచుకొనుట మంచిది. ఫెడరేషనులు యే కారణములవలన రద్దుపరచబడుచున్నవో, ఆ కారణములే యీ యూనియనులను తీసివేయుటకు కూడా వర్తించును.

ఈ విషయమును గురించి ది 5—5—33 తేదీని వెలువడిన యాంధ్రపత్రికలో వడ్డాది శ్రీరామచంద్రమూర్తిగారు

వ్రాసినవ్యాసమును చదివితిని. యూనియనుల వలన కలుగు లాభా లాభములను నిష్పక్షపాతముగ వీరు వివరించిరి. గాని వీరి తుదినిర్ణయముతో నే నేకీభవింపజాలకున్నాను. ఈ యూనియనుల యావశ్యకత విషయమై వీరుదహరించిన పెద్దల పేర్లు మున్నగును భయపెట్టజాలవు. వీనివలన కలుగు లాభము కంటె నష్టమే యెక్కుడుగనున్నదని చెప్పు యితర పెద్దలపేర్లను నేనేకరువు పెట్టగలను కాని యీ పెద్దలందరు పల్లెటూళ్లను గురించి స్వానుభవ మెంత మాత్రము లేక తమ తాబేదారులు వ్రాసికొను రిపోర్టుల నాధారము చేసికొని నిర్ణయములకు వచ్చుచుందురు. వీరికి పైచూపేగాని, క్రిందిచూపు లేదు. మొన్నమొన్ననే, పాంచాల రాష్ట్రములో పూర్ణవిచారణ జరిగి ఈ యూనియనులను తీసివేయుటే ఉత్తమమని ఒక రిపోర్టు వ్రాయబడినది. ఈ రాష్ట్ర పరిస్థితులకును, తక్కిన రాష్ట్రములలోని వానికిని యెట్టి తారతమ్యము కనుపించదు.

మనమందరము ప్రజాస్వామికదారులమై గవర్నమెంటు ఉద్యోగీయుల చేతులలోనికి మన స్థానికసంస్థలు పోగూడదను నియమమును పాటించుచుంటిమి గాని, కొన్ని యాంధ్రజిల్లా లలో స్థానిక పరిపాలనము మిక్కిలి దురవస్థలోనికి వచ్చుచుండుట చూడగా, అవినీతి పెచ్చుపెరిగి స్వపరిపాలనకు మనమింకను తగమేమోయని తలచవలసి వచ్చుచున్నది. దీనికి మన చిరకాల రాజకీయ బానిసత్వమే కారణమని కొందరందురు గాని, సాంఘిక బానిసత్వమే యీ యవినీతికి

పునాది యని నేను నమ్ముచున్నాను. ఎన్నెన్ని వేల రూపా యలు యెన్నికలలో ఖర్చుపెట్టి, మనకు ప్రతినిధులైన విద్యాధికులు తమ గడువు కాలములో తమరు ఖర్చుపెట్టిన మొత్తముల కంటె అనేక రెట్లు ప్రజలసొమ్మును లాగివేయుటకు యెట్టి అనుచితములైన పనులు చేయుచున్నారో మనము కన్నులార చూచుచున్నాము. జీతబత్యము లిచ్చి నౌకర్ల చేత పనులు నెరవేర్చుకొనగలముగాని, ఈ ఆనరెరీ మెంబర్ల చేతులలో, ముఖ్యముగా మన యార్థిక విషయములను బొత్తిగా వదల కూడదని నాయభిప్రాయము. నా స్వానుభవము వలననే నీ విషయమును, ఒక సంవత్సరము కోవ్వూరు యూనియన్ సెక్రటరీగానుండి కనిపెట్టితిని. పశ్చిమగోదావరిజిల్లాలో మా యూనియనులో జిత్తులమారి తనములేనివారే యెక్కువ మంది యున్నారని నేను చెప్పగలను కాని ఆనరెరి ప్రెసిడెంట్లు, సెక్రటరీలు, గ్రూపు డైరక్టర్లు, పంచాయతీ మెంబర్లు వారి వారి విధ్యుక్త కార్యములను సరిగా నెరవేర్చ వలసి యుందుమని పాటించువారు మిక్కిలి అరుదుగ నుండుటచే యూనియనులలో సరియైన సూపర్విజన్ యెన్నడు జరుగదు. బ్యాంకు సూపర్వైజర్లే జీతబత్తెములు పుచ్చుకొనే నౌకర్లుగనుక పనులను నెరవేర్చుటకు బాధ్యులు, సమర్థులు. కాబట్టి యీ యూనియనుల మీద పెట్టేఖర్చు సూపర్వై

జర్ల సంఖ్యను యెక్కువ చేయుటకును, ప్రైతనిఖీకి ప్రతి తాలూకా పట్టణములో ఒక క్లార్కును, యిన్‌స్పెక్టరును యేర్పరుచుటకును ఉపయోగించిన బ్యాంకుపని బాగుగా జరుగగలదు. గ్రామ సంఘములలో ప్రజా స్వామికము బదులు కమీషన్ లేక జీతము పుచ్చుకొనే ప్రెసిడెంటుండి తగిన జామీనుమీద ఋణములను యిచ్చుచుండిన చాలును. ఋణాధికారపు స్టేటుమెంట్లు ప్రతిసంవత్సరము యిన్‌స్పెక్టరు సూపర్వైజరు, ప్రెసిడెంటు కలసి తాలూకాలోని సంఘముల మెంబర్లందరికిని తయారు చేయవచ్చును. పరిమితి లేని జాయంటు బాధ్యత తీసివేయవలెను.

పెద్దపెద్ద దేశీయ కాన్ఫరెన్సులలో యీ సహకారోద్యమ తత్వమును గురించి మనపెద్దలు పొగడుచుండు రేగాని వారు కొద్దిమాసములైనను ఒకయూనియనులో స్వయముగా పనిచేసి వారి యనుభవమును తెలియజేయు చుండిన బాగుగా నుండును. మన గ్రామములలో యీ సహకారోద్యమము వలన మనము మొదట ననుకొనినట్లు కొంతమందికైనను, ఋణవిముక్తిచేసి, పొదుపు పరపతులను వృద్ధిపొందించుటకు బదులుగా అవినీతి, మనస్పర్థలు, బీనామీలు, దూబరతనము మొదలగు దుర్గుణములు హెచ్చించితిమి. వర్ణభేదములు వీనికి దోహద మొసంగినవి.

౨

మనము స్వరాజ్యపరిపాలన కనర్హులమని చాటుటకు మన స్థానికసంస్థల పరిపాలనమును యీసహకారోద్యమమును చాలును.

అమెరికా ఇంగ్లాండులలోకూడ యెన్నికలలో లంచగొండితనము, అవినీతికరములైన పనులు, అన్యులను నిర్హేతుకముగ దూషించుట, మొదలగు దుర్గుణములు లేకపోలేదు. కనుకనే మూడునాల్గవ తరగతులలో చేరిన సామాన్యమానవులే మెంబర్లగుటకు ప్రయత్నించెదరుగాని, మొదటి రెండవ తరగతులలో చేరిన ధీమంతులు, సన్మార్గ ప్రవర్తనులు, సత్వగుణ ప్రధానులకు అక్కడ చోటులేదు. అయినను, వారి వారి గడువు కాలము కాగానే, పాపము పండుటచే యీ మెంబర్లు కూడా తుడిచిపెట్టుకొని పోవుచుందురు. క్రొత్తమెంబర్లు తిరిగి క్రమేణా ఆ దారినే త్రొక్కుచుందురు. ఇట్టి ప్రజాస్వామికమునకు మనము ఉవ్విళులూరుచున్నాము. ఈవిధానముతోపాటు మనలో మత వైషమ్యములు, వర్ణవైషమ్యములుకూడ నుండుటచే మనకు సాంఘికరాజకీయ మోక్షములు శీఘ్రకాలములో లభించవు. మనకు త్వరలో అవి కావలెనన్న, సాంఘిక విప్లవములైనను రావలెను. లేదా, రాజకీయవిషయములలో, ముస్సొలోని, హిట్లరు, స్టాలిన్, కెమల్ పాషా, వంటి ప్రముఖులు నిరంకుశముగ పాలించుటకు, ప్రజాప్రతినిధులే వారిని యేర్పాటుచేసికొన

వలసి యుందురు. ఇట్టి విప్లవములు రానంతవరకు మనకు యేబలీయులైన విదేశీయులో ప్రభువులుగా నుండి తీరవలెను. నేను నిస్పృహత్వమువలన యిట్లు వ్రాయుచున్నానని చదువరులు తలచవదు. కాంగ్రెసు నాయకులమని చెప్పుకొను వారిలో కొందరు పెద్దలు, చిన్నలకు యెట్టి సర్టిఫికేట్లు ప్రజలొసంగు చున్నారో గమనింపుడు. వీరు పైకి ఆమోదించుచున్న విధానమును యెంతవరకు నమ్మి నిర్భయముగ ఆచరణలో పెట్టు చున్నారో కన్నులు, చెవులు, ఉన్నవారికి స్పష్టముగ గోచరించుచున్నది. ఇట్టివారిని గాంధిమొదలగు త్రికరణశుద్ధులు నమ్మి కార్యాచరణలో దిగుట కుక్కతోక పట్టుకొని గోదావరి నీదుట వంటిది.

---

## 26 వ అధ్యాయము

## అపక్వశాకాహారము

గ్రామపునర్నిర్మాణ కార్యక్రమములో పనిచేయు ప్రచారకులు, తమరే గ్రామము వెళ్లినను, తమ భోజనమునకు యితరుల యిండ్లకుపోవుట, వారు వంటలుచేసికొని తమ కొరకు కనిపెట్టుకొనియుండుట, అతిధులకు కావలసిన సదుపాయములన్నియు చేయుట జరుగుచుండును. కాబట్టి, యితరు

లను కష్టపెట్టక తాము కష్టపడకుండ, వీరపక్వశాఖాహారము నుపయోగించుట శ్రేయస్కరము. ఈ యాహారము, ముఖ్యముగా వృద్ధులకును బీదలకును, అనేకరోగములకు ముఖ్యస్థానమగు ఉదరములో వ్యాధిగలవారికిని మిగుల శ్రేష్ఠము. ఈ విషయములో నా స్వానుభవమును కొద్దిగా వ్రాయుచున్నాను.

నా కారేడు సంవత్సరములనుండి, కాళ్లనొప్పులుండుటచేత దానిని మాన్పుకొనవలెననియు, యింటిలోగాని, గ్రామాంతరములకు తరుచుగా పోవుచున్నపుడుగాని, యితరుల కెట్టి యిబ్బందిని కలిగించకుండ నుండవలెననియు, కారము, పులుసు, ఉప్పు, మొదలగుపదార్థములతో మిశ్రమమైన యాహారమును వర్జించవలెననియు బుద్ధిపుట్టి, నా స్నేహితుడగు బొల్లాప్రగడ సుందరగోపాలరావుగారి సలహామీద, ది 1–9–1930 తారీఖున, నా 64 వ యేట ఒక్కసారిగా మామూలుభోజనమును మానివేసి యీ యపక్వాహారమును ఆరంభించి, యెవరెంతిగా వలదన్నను, నాపట్టినపట్టు విడనాడక, యీ దినమువరకు దానినే అవలంబించుచున్నాను. దీని నారంభించకముందు నా తూనిక 148 పౌండ్లు. గత మూడుసంవత్సరములలో నాశరీరపు బరువు యెట్లు మారినదో యీ క్రింది పట్టీవలన తెలియగలదు.

| తారీఖు | పౌ॥ | తారీఖు | పౌ॥ | తారీఖు | పౌ॥ |
|---|---|---|---|---|---|
| 24-11-1930 | 133 | 22- 1-1932 | 109 | 2- 5-1933 | 111 |
| 22-12 ... | 123 | 24- 2 ... | 113 | 1- 6 ... | 115 |
| 17- 1-1931 | 118 | 23- 3 ... | 114 | 1- 7 ... | 112½ |
| 24- 2 ... | 117 | 6- 6 ... | 110 | 1- 8 ... | 112 |
| 24- 3 ... | 114 | 6- 7 ... | 113 | 1- 9 ... | 109 |
| 14- 4 ... | 109 | 1- 8 ... | 112 | 1-10 ... | 114 |
| 12- 5 ... | 108 | 3- 9 ... | 114 | 1-11 ... | 109 |
| 23- 6 ... | 113 | 3-10 ... | 110 | 1-12 ... | 111 |
| 23- 7 ... | 110 | 1-11 ... | 114 | 1- 1-1934 | 112 |
| 23- 8 ... | 106 | 29-11 ... | 117 | 18- 1 ... | 114 |
| 23- 9 ... | 109 | 1- 1-1933 | 114 | 1- 2 ... | 114 |
| 23-10 ... | 109 | 1- 2 ... | 114 | 1- 3 ... | 118 |
| 23-11 ... | 110 | 2- 3 ... | 115 | 1- 4 ... | 119 |
| 22-12 ... | 110 | 1- 4 ... | 113 | 1- 5 ... | 123 |
| | | | | 15- 5 .. | 121 |
| | | | | 1- 6 ... | 123 |
| | | | | 1- 7 ... | 123 |
| | | | | 1- 8 ... | 123 |

నేను, పాలు, పెరుగు మజ్జిగ, నేయి, నూనె మొదలగు నవి విసర్జించినను కొంతకాలము కాయగూరలు, ఉడకబెట్టకుండా పచ్చివి తినుచుంటిని. కొందరి సలహావలన వానిని

వండించి తినుచుంటినిగాని, యిటీవల వానిని బొత్తిగా మాని వేసి, పప్పులు, పండ్లమీదనే జీవించుచున్నాను. నా కాళ్ల నొప్పులు తగ్గలేదు గాని, నాకు మరి యేవిధమైన జబ్బులేదు. శరీరమనోదార్ఢ్యములు యెంతమాత్రము తగ్గలేదు. మెదడు, మునుపటికంటె కూడ యెక్కువ చురుకుగా, అనాయాసముగ పనిచేయుచున్నది. నిద్దుర, రాత్రి 9 గంటలనుండి తెల్లవార 4 గంటల వరకుండును. ఈ లోగా రెండుసార్లు లేచుచుం దును. ఇప్పుడు నా మామూలు భోజనము యీ క్రింది విధ ముగా నుండును. ప్రాతస్స్నానమైన తరువాత 6 గంటలకు, నాలుగు బాదము పలుకులు, 1 అంజూరా, ద్రాక్ష, నిమ్మరస ముతో పుచ్చుకుని, రెండుమూడు నారింజలు తినెదను. 11 గంటలకు మూడుగుప్పిళ్ళ పచ్చివేరుసెనగపప్పు, రెండుమూడు అరటిపండ్లతో భుజించి, నారింజపండ్లుగాని, మరి యే యితరఫల ములుగాని తీసికొనెదను. రాత్రి 8 గంటలకు, కొబ్బెర, ఫల ములు, ఉపయోగించెదను. పీసికిమ్మత్తు దినమునకు నాలుగణా లనుండి యెనిమిదిఅణాలవరకు కావచ్చునుగాని, రెండణాల తోనే బీదలు జీవించవచ్చును.

ఈ అపక్వశాకాహారమువలన అన్నిరోగములు నివా రణ కాకపోవచ్చును .గాని, నూతనరోగములు రావని నా యభిప్రాయము. శరీరము, వృద్ధాప్యమువలన శిథిలమైగాని అకస్మాత్తుగ సంభవించు విపత్తులవలనగాని నశించవచ్చును. ఈ విధానమువలన మందులవసరము లేకుండ, సంపూర్ణస్వాతం

త్ర్యము ననుభవింపవచ్చును. వంటకు దాసులముకాము. మనము చేయికాల్చుకొనుట, మనకొరకు యితరులు కాల్చుకొనుట, అవసరములేదు. కొబ్బరి, అరటిపండ్లు మొదలగు ఫలములే చాలును. పప్పులను కూడ విసర్జించవచ్చును. శరీర పోషణకు కావలసిన పదార్థములన్నియు, పై వానిలో నున్నవి. అనేకవిధములైన రుచులకలవాటుపడిన, యీజిహ్వాను సామాన్యప్రజలు స్వాధీనపరచుకొనజాలరు. జిహ్వోపస్థలలో, రెండవదానిని కట్టువారనేకు లుందురుగాని, మొదటిదానిని కట్టువారు మిక్కిలి అరుదు. అనేక వేల శతాబ్దములనుండి పక్వాహారము నవలంబించిన మానవులు, వివిధరుచులను మరగి వాని నిప్పుడొక్కసారిగా వదలుట దుర్లభము. కాని బీదలు, రోగులు, వృద్ధులు, మామూలు ఆహారమును వదలివేసి, యీ అపక్వశాకాహారమును స్వీకరించుటయే యుత్తమము. ధైర్యముతో ఒక్కసారిగా, మన మామూలు భోజనమును వదలివేసి, దానికేసి తిరిగి చూడకుండ యీ నూతనవిధానము నవలంబించవలయునేగాని, రెంటిని జోడించుచున్న యెడల, శరీర బాధలకే కారణమగునుగాని, లాభమెంత మాత్రమునుండదు. రోగచికిత్సావిధులను గురించిగాని, వివిధాహారములలోని పదార్థవిజ్ఞానమును గురించిగాని నా కేమియు తెలియదు. నాస్వానుభవమువలన తెలిసికొన్నది మాత్రమే వ్రాసితిని. ఎవరిశరీర తత్త్వమును బట్టి, వారు కారము, ఉప్పు, చింతపండును, త్యజించి, యిష్టమైన అపక్వశాకాహారమును భుజించుట అల

వాటు చేసికొనుచు, క్రమక్రమముగా దానిలో ఒకటి రెండు పదార్థముల మీదనే జీవించవచ్చును. పాలు, శాకాహారము కాదు. కాయధాన్యములు, వండినగాని తినజాలము. కొందరు, వానిని నానబోసికొని తినెదరుగాని, మనము వీనినికూడ విసర్జించవచ్చును. వేరుసెనగ, బాదము, పిస్తా, జీడిమామిడి, సరోడా, అక్రూటు, మొదలగు పచ్చిగింజలను తినవచ్చునుగాని, ధనములేనివారు, వీనిలో కొన్నిటిని వదలివేయవచ్చును. క్రమేణా, ఒక కొబ్బరితోనే జీవించవచ్చును. ఏ పండ్లు దొరకినను, వాని నుపయోగించుకొనవచ్చును. ప్రకృతిలో లభ్యమగు శాకాహారము, అన్నిచోట్లను కలదు కాబట్టి గ్రామములకు పోయి ప్రచారము చేయువారు యీ యపక్వశాకాహారమును తప్పక అవలంబింపవలయును. దీనిమూలమున యితరులనుగాని, తమ్మునుగాని కష్టపెట్టరు. నిప్పు, కట్టెలు, వంట, పాత్రలు, రుచిలేని అన్నము లోపలికిపోవుటకు అనేకవస్తువులను మిశ్రమముచేసిన కూరలు, పులుసు, చారు, పచ్చడి, ఊరగాయ వడియములు, అప్పడములు మొదలైనవానిని విసర్జించవచ్చును. వానితో పెరుగు, పాలు, మజ్జిగ, నేయి, నూనెలను చేర్చుకొనుటకూడ శరీరారోగ్యమును చెరుచుకొనుటకే గాని, మరి యేవిధముగను మన కుపయోగించవు. కలకత్తాలో ప్రచురించబడు ఒక మాసపత్రికలో ఘనవైద్యులు, శాస్త్రజ్ఞులు యిట్లు వ్రాయుచున్నారు.

"**Uncooked, unseasoned** and **unmixed** food is the only natural food. This is Nature's Dietitic Law for man and for the whole world. When you know and observe this natural law of Dietics, you will find that it leads not to vegetarianism. It leads you to fruits and nuts. It makes of you a fruitarian. There is a great gulf between fruits and nuts on the one hand, and vegetables on the other.

Nuts are not only rich in protein but they contain protein of the finest quality. The protein of nuts is of much greater biological value for the repair and renewal of the cells of the human body than is the protein of vegetables or of milk or of eggs or of the protein of muscular tissues of dead animal with its decaying carcass and waste poisons that should be buried in the ground instead of in the human stomach. Chemical analysis shows that green leaf vegetables contain from .1 to 3·5 per cent of protein of the highest order, fresh fruits from 0·5 to 2·5 per cent and nuts from 5 to 30 per cent.—In Wealth and Health of July part 1933, pages 79, 80.—

## 27 వ అధ్యాయము

## సంతాననిరోధము

మానవులు, పరిణామశిద్ధాంతమునుబట్టి, ఓరాంగొటాంగు, చింపాంజి, గొరిల్లా, గిబ్బను మొదలగు తోకలులేని కోతిజాతులనుండి పుట్టిరి. ఆ కోతుల కాలమునుండి కూడా, మందలు మందలుగా సంఘీభావముతో, జీవించుట యీ జీవరాసులకు ఆచారము. మానవజాతులుకూడ, అట్లే స్వసంరక్షణకొరకు యిట్లు ఒండొరులతో చేరి, తక్కిన జంతువులను, తమబుద్ధి బలమెక్కుడైన కొలది, తమ వశముచేసికొనుచుండిరి. ఈ మానవజాతులలో కూడ, అన్యోన్యపోరాటములు తటస్థించినపుడు, వానిలోని స్త్రీలు, సాధారణముగా యింటివద్దనే యుండి గృహకృత్యములు సల్పుచు, పిల్లలను కని పెంచుచు కాలము గడపుచుండిరి. కాబట్టి, సంఘస్థిరత్వమునకును, బలమునకును, మగవాండ్రే యెక్కువమంది కావలసివచ్చినది. కాబట్టి స్త్రీ సంతానముకంటె పురుషసంతానమే ప్రధానముగ నెంచుచుండిరి. తమ తమ సంఘములు వృద్ధి నొందుటకు స్త్రీలు కూడ అవసరమైనను, పుత్రుడు కలిగినపుడున్న సంతోషము, స్త్రీ కలిగినపుడుండెదికాదు. ఇదిగాక, పుత్రుడు, తమవృద్ధాప్యములో తమ్మును సంరక్షించగలుగునని మరియొక కారణము కూడ నుండవచ్చును. ఇట్టితలంపు, నేటివరకు మానవసంఘములలో వ్యాపించియున్నది. దీనినే, మనయార్యులు, మతము

తో ముడిపెట్టి, పుత్రులు లేనివాడు పున్నామనరకమును దాట నేరడనియు, వానికి గతులులేవనియు, మతసూత్రములను బోధించిరి. ఈ నరకమును తప్పించుకొనుటకు, ఔరసపుత్రుడే గాక, పుత్రిక పుత్రుడు, క్షేత్రజుడు, దత్తుడు, కృత్రిముడు, గూఢజుడు, అపవిద్ధుడు, కానీనుడు, సహోఢుడు, క్రీతుడు, పౌనర్భవుడు, స్వయందత్తుడు, నిషాదుడు, పారాశవుడు అను పదుముగ్గురు పుత్రులుగా నెంచబడిరి. కాలక్రమమున వీరిలో కొందరు కొందరు తగ్గుచురాగా, ఔరసుడు దత్తపుత్రుడు మాత్రము నేటికి మిగిలిరి. ఈ దత్తపుత్ర స్వీకారమువలన యెన్నివిధములైన యిబ్బందులున్నవో యిక్కడ చర్చించుట అనవసరము.

పూర్వకాలమువలెగాక, మానవకోటివృద్ధియైన కొలది, పరిమిత వైశాల్యము మాత్రముగల యీ భూమి, వారి కందరకును జీవనోపాధిని కలిగించనేరదు. కాబట్టి జనసంఖ్యకు కొంతమేర యేర్పరచక తప్పదు. సంతానమును కనుట ఒకవేళ మనచేతిలో లేకపోయినను దానిని నిరోధించుటకు మార్గములను శాస్త్రజ్ఞులు కనిపెట్టియున్నారు. ఇంకను కనిపెట్టుచున్నారు. దంపతు లిద్దరకును శరీరారోగ్యము చెడకుండ, దాంపత్యసౌఖ్య మనుభవించవచ్చును. ఇట్టి నిరోధమార్గముల వలన, తాను పోషించి విద్యాబుద్ధుల నబ్బించగలమంది పిల్లలను మాత్రమే కనుటకు ప్రతివానియొక్కయు విధియై యున్నది. అట్లుచేయనిచో, మరణములకంటె జననములు హెచ్చి, జీవనో

పాధికి యుద్ధములు, రోగములు, కాటకములు తరుచుగా బయలుదేరును. చనిపోగా మిగిలినవారికి కూడా, క్రమక్రమముగా జీవనోపాధి దొరకుట దుర్లభమగుచుండును. భూమి వైశాల్యము వృద్ధిపొందనేరదు. మానవుడు జీవించుటకు తగిన నూతన ఉపాయములు, శాస్త్రజ్ఞులరయుచున్నను గత శతాబ్దములలో జనసంఘాభివృద్ధినిబట్టి, అవి చాలవని స్పష్టమగుచున్నది. ఆర్థికమస్థితి ప్రపంచమందంతటను పెరిగిపోవుచున్నది. నిరుద్యోగము వృద్ధియగుచున్నది.

జీవరాసులన్నిటిలో, బుద్ధిలో అగ్రస్థానము వహించిన మనుష్యుడు, యీ సమస్యను పరిష్కరించుటకు కాలమాసన్నమైనది. ప్రకృతి, మనలను గ్రుడ్డిగా నడిపించుటకుబదులు దానిని మనసౌఖ్యములకు యెట్లు ఉపయోగించుకొనవలెనో, ఆలోచించుట మన ధర్మముకాదా! ప్రకృతిపరిణామమును మనము గమనించుచు, దానికి, అనాలోచితముగ లోబడక, మానవుల క్షేమము వృద్ధియగునట్లు, ప్రకృతిలోని శక్తుల నన్నిటిని, సాధ్యమైనంతవరకు, సరియైన మార్గముల వెంట పోనీయవలెను. సత్రములు, దానధర్మములు, మనము పాత్రోచితముగ యెన్ని నెలకొల్పినను, సమిష్టిరాజ్యపరిపాలనమును ప్రపంచమందంతటను స్థాపించి, స్వామ్యము నంతయు ప్రజలకందరకు సమానముగ పంచిపెట్టినను, మనకు చాలినంత జీవనోపాధికి సంతాన నిరోధమే ముఖ్యమార్గముగ కనుపడుచున్నది.

ఇదిగాక, ఒకానొకప్పుడు, సంతాననిరోధమే ఆవశ్యక మగుచుండును. స్త్రీ తనశరీరము మిక్కిలి దౌర్బల్యస్థితిలో నున్నపుడు, ఆమెను గర్భవతిగచేయు పురుషుని క్రూరుడని పిలువక తప్పదు. అట్టి దౌర్బల్యము, అధికసంతానోత్పత్తి వలనకూడ కలుగుచుండును. ఇట్టి సందర్భములో సంతాన నిరోధము ఆవశ్యకము కాదని యెవరనగలరు?

సంతాన నిరోధవిధానములో, స్త్రీ పురుషులలో, రహస్యసంభోగమునకు చోటిచ్చెదమనియు, అవినీతి, సంఘములో పెచ్చుపెరిగిపోవునేమో యనియు, కొందరు శంకించవచ్చును. కాని, అవివాహితలలోను, వితంతువులలోను, యెన్ని భ్రూణహత్యలు మనము చూచుచుండుటలేదు! మోహపరవశులైన వారిని, తమకు గర్భధారణము కలుగునేమో యనుభయము, వారించునా? కాముకులకు లజ్జాభయములు రెండును తొలగిపోవును.

కాబట్టి, యీ సంతాన నిరోధావశ్యకతను గమనించియే నానాదేశములలోను, స్త్రీ పురుషులు వైద్యుల సలహాలను రహస్యముగా పొందుటకు గొప్ప వైద్యాలయములు ముఖ్యపట్టణములందు స్థాపించబడుచున్నవి. ఇవి మానవ క్షేమమునకు సహకారము లగుట కెట్టిసందేహమును లేదు. కృత్రిమ పద్ధతులు, శరీరారోగ్యమును చెరుచుననుటలో భేదాభిప్రాయములున్నవి. అయినను స్త్రీ బహిష్టయైన తరువాత వారమురోజులును, బహిష్టికాబోయే ముందు వారము

రోజులును సంభోగము లేకుండ నుండిన యెడల, పిల్లలు కలుగరు. పిల్లలు లేనివారికి పిల్లలుకలుగుటకును, స్త్రీ పురుష సంతాన మేదికావలయునో దానినే యుత్పత్తిచేయుటకును పరిశోధనలు జరుగుచుండుటయేగాక, అవి జయప్రదమగుచున్నవని కూడ మనము వార్తాపత్రికలలో చదువుచున్నాము.

---

## 28 వ అ ధ్యా య ము

## స్వ స ం ర క్ష ణ సూ త్ర ము

ఈ ప్రపంచమునందుండు చరాచరసృష్టిలో ఒకజీవి మరియొకజీవిని తినుచున్నగాని తాను బ్రతుకనేరదు. ఇది ప్రకృతిలో స్వభావజన్యమైనది. జీవత్వము వృక్షాదులయందు కూడ కలదని జగదీశచంద్రబోసు మొదలగు భౌతిక శాస్త్రజ్ఞు లందరు ఒప్పుకొన్నవిషయమే. అట్టి జీవులను తిని కీటకాదులు, సరీసృపములు, పక్షులు, మృగములు, మనుష్యులు మొదలగు జీవరాసులన్నియు బ్రతుకుచుండుటయే కాక వీనిలో కొన్ని ఒండొరులను చంపుకొని తినుచు జీవించుట మనము కన్నులార ననుదినము చూచుచునే యున్నాము. ఈ నిరంతరమగు పోరాటములో బుద్ధిబలము, శరీరబలము కలవి యెక్కువకాలము జీవించుచు, వానిసంఖ్యను వృద్ధిపరచుకొనుచుండును. మానవునకు తక్కిన జీవరాసులకంటె, ప్రకృతిపరిణామములో

బుద్ధిసంపద యెక్కుడగుచుండుటవలన, తా ననేకపరికరము లను, సాధనములను, ఆయుధములను, యంత్రములను మొద లగువానిని కనిపెట్టి తక్కిన జంతువుల నన్నిటిని తనస్వాధీ నము చేసికొని వానిమీాద జీవించుచున్నాడు. ప్రకృతిరహ స్యములను ఇంకను పరిశోధించి కనుగొనుచున్నాడు. ఈ కార ణముచేతనే తనపూర్వీలును, అతిసమీాపబంధువులును నగు ఓరాంగు, చింపాంజీ, గిబ్బన్, గోరిల్లా మొదలగు మర్కట జాతులను కూడ బరిమార్చి, తాను కోటానుకోట్లకొలదిగ వృద్ధియై ప్రపంచమంతయు నిండిపోవుచున్నాడు. అనేకవిధ ములైన ఉద్భిజ్జములను తాను జీవించుటకు పెంచుచున్నాడు. తన నాగరికత వృద్ధియైనకొలది, తనసోదరులగు అనాగరిక జాతులును, నానావిధములైన వన్యమృగములును, పేరులేకుండ అనేకలక్షల శతాబ్దములనుండి క్రమక్రమముగా కృశించి నశిం చిపోయినవి. ఇప్పుడును పోవుచున్నవి. ఇట్టి స్వార్థపరత్వము ప్రకృతిలో నంతటను మనకు గోచరించుచున్నది. ఆత్మరక్షణ మాత్రము ఎల్లెడలను వర్తించుచున్నది.

కాని, మానవులు పూర్వకాలములో ఒకరినొకరు చంపుకొని తినుచుండినను, ఇటీవల వారి బుద్ధివికాసము వృద్ధి యైనకొలది, మానవజీవిని పోషించి నిలుపుచుండుట సంఘాభి వృద్ధికి ముఖ్యమని యెంచి, నరమాంసభక్షణమును మాను కొనుటయేకాక ఆత్మహత్యకూడ పాపకార్యమని శాసించిరి. అన్యజంతువుల మాంసభక్షణమును మాత్రము మానలేదు.

కాని, దయాదాక్షిణ్యములు పెంపొందించుకొని వానికి అనవసరమగుబాధ కలుగజేయకుండ వానిని భుజించుచున్నారు. అట్లు వీరు చేయనిచో ఆజీవరాసులు వృద్ధియై మానవులకు తినుటకు గడ్డికూడ దొరకకుండ చేసియుండును.

"అహింసా పరమోధర్మః" అను నీతిసూత్రము అన్నిమతములలోకూడ ప్రతిపాదింపబడియున్నది. హింసయనగా కేవలము జీవముతీయుటయే కాదు. ఇతరప్రాణులయొక్క మనస్సునకైనను, శరీరమునకైనను ఉపద్రవము కలుగజేయుట, అట్లు చేయతలంచుట సైతము హింసక్రింద వచ్చును. కాని, స్వసంరక్షణసూత్రమునకు ఈ అహింసాసూత్రము సామాన్యముగ లోబడక తప్పదు. "జీవితం మరణా చ్ఛ్రేయో జీవన్ ధర్మమవాప్నుయాత్", "జీవ న్భద్రాణి పశ్యతి" బ్రతికియుండిన ధర్మమొనర్పదగును. ధర్మసాధనముకైనను ముందుగా బ్రతుకు తెరవు చూచుకొనవలెను. కావుననే ధర్మదృష్టి ననుసరించి చూచినను మరణముకంటె జీవితము శ్రేయస్కరము. మానవులలో ఎక్కడనో కొందరు ఉత్కృష్టమేధాసంపత్తికలిగి వాదప్రతివాదనలను దూరదృష్టితో విమర్శించి, స్థూలసూక్ష్మధర్మములను పరిశీలించి, తమ దేశముకొరకుగాని, తోడిప్రజలయోగక్షేమమునకై కాని తమప్రాణముల నిచ్చెదరుగాక. ఇదియంతయు ప్రకృతిస్వభావమునకు విరుద్ధమేయని చెప్పవలసియుండును.

మనుష్యులలో వ్యాఘ్రత్వ మెన్నటికిని పోనేరదు. వీరు వ్యాఘ్రములకంటెను నైతికవిషయములలో, అధములనియే

యెంచవలెను. వ్యాఘ్రము తనయొక్కయు, తనపిల్లలయొక్కయు తత్కాలపు ఆకలిని తీర్చుకొనుటకుమాత్రమే యితరజంతువులను హింసించును. మానవుడు తనసోదరులను కొల్లగొట్టియు, హింసించియు, ద్రోహము చేసియు తనకు, తనపిల్లలకే కాక, తనకు కలుగబోవు భవిష్యత్సంతానపరంపరకు వంశపారంపర్యముగ నుండునట్లు ఆస్తిని సేకరించుటకు సదా ప్రయత్నించుచునేయుండును. తా ననుభవించుటకు భోగవస్తువుల కంతము లేదు. ఆశకు మేరలేదు. జీవరాసులలో మానవుడే యెక్కువ హింసను కలుగజేయు జంతువు. తనకుటుంబమును, తనజాతిని వృద్ధిపరుచుకొనుటకు ప్రపంచములోనుండు నానావిధ వృక్షలతా గుల్మములను, తక్కినజీవరాసులను తానువశపరచుకొని, ప్రపంచమునంతయు నేలుచున్నాడు. తనకు, తనజాతికి హానిచేయు జంతువులను చంపివేయుచు తాను తినదగిన ప్రాణులను మచ్చికజేసికొని వానిని పెంచుకొని తినుచు, తన పొట్టపోసికొనుచున్నాడు.

మానవకోటిలో వ్యక్తులమధ్యనే యిట్లు హింస ప్రబలియున్నపుడు, జాతులనుగురించి వేరుగ చెప్పనక్కరలేదు. ఈ ప్రపంచములోని వివిధ మానవసంఘములు ఎల్లపుడు ఒండొంటితో పోరాటములుసల్పుచు, చిన్నవానిని, బలహీనమైనవానిని పెద్దవి మ్రింగివేయుచు వీలుగానిచోట్ల సంధిచేసికొనుచు సామదానభేద దండోపాయముల నుపయోగించి జీవించగలుగుచున్నట్లు నానాదేశచరిత్రలు స్పష్టపరచుచున్నవి. ప్రతికుటుం

బములో ధనవంతులు, ప్రయోజకులు, దరిద్రులు—ఎట్లు వంశ పారంపర్యముగ మార్పులు జరుగుచున్నవో ఆవిధముగానే మానవసంఘములకుకూడ వృద్ధిక్షయములు కలుగుచునేయుండును. నేటికిని అట్లే జరుగుచుండుట మనము చూచుచునే యున్నాము. మానవసౌభ్రాత్వమనుమాట కొందరి నాలుకలమీద ఆడుచుండునేగాని ఆచరణలో ఏ జాతిలోను లేదని యీ యిరువదవశతాబ్దములో కూడ స్పష్టమగుచున్నది.

కాబట్టి గాంధిమహాత్ముని అహింసా సూత్రమునకు దేశకాలపరిస్థితులనుబట్టి అనేకములు మినహాయింపులకు అవకాశము లున్నవి. ఈయన నరమాంసభక్షకుల సంఘములో నుండుట తటస్థించునెడల, ఈ సూత్రములకు ఆసంఘమువారిని ఒప్పించలేడు సరికదా యీయనయే జీవించుట కడుదుర్లభము. భగవద్గీతయే దీనికి దృష్టాంతము. దాని యుపక్రమోపసంహారములే యిందుకు తార్కాణము. సామ దాన భేద దండోపాయములు సర్వదా ఆయా కాలపరిస్థితులను బట్టి, సంఘములోని అధికసంఖ్యాకుల యభిప్రాయమును బట్టి ఉపయోగపరచబడుచుండును. అట్లు చేయనిచో ఆ సంఘము జీవించనేరదు. బలమైనజాతికి బానిసయై తుదకు దానిలో కలసిపోవును గాని, దాని ప్రత్యేకతను నిలువుకొనజాలదు. ఈ అంతర్జాతీయ మగు పోరాటము ఎన్నటికిని నశించదనుటకు నానాజాతిసభయు ఆయుధ విసర్జనసభయు, ఆర్థికవిషయకసభయు విచ్ఛిన్న మగుచుండుటయే ఒక గొప్ప దృష్టాంతము. దాం

గలు దొంగలు కలసి ఊళ్లు పంచుకొనునట్లు బలవంతులైన కొన్నిజాతులు బలహీనజాతులను పీడించుటకే యిట్టి సభలు యేర్పాటైనపుడు, వారిలో వారికి పాళ్లు తెగక యెవరిస్వార్థ మును వారురక్షించుకొన ప్రయత్నించుచున్నారు. ఇది ప్రకృతి యొక్క స్వభావలక్షణమే కనుక మన మాశ్చర్యపడవలసిన పని లేదు. ఈ విధానములో తప్పొప్పులు పాటింప నక్కర లేదు. చర్చల కతీతమైనది. స్వసంరక్షణకొరకు అట్లు ప్రతిసం ఘము చూచుకొననియెడల అది అస్వాభావిక మనే యన వలెను. త్యాగము మానవునికి స్వాభావికము కాదుగనుకనే, అది వారిలో అరుదుగ కనపడుచుండును. దానిని ఉత్కృష్ట ధర్మముగా ప్రజ లెంచుకొనుట తటస్థించుచుండును. ఇట్టి మానవస్వభావమును మార్చుకొననియెడల, మనము పశు తుల్యులమని వేదాంతులు చెప్పుచుందురు. ఇట్లుగాక మరి యేమి ?

ఈ నూతననైతికాభివృద్ధి అనేక వేలసంవత్సరముల క్రిం దటనే మొదలుపెట్టబడి వ్యక్తులలో ప్రబలి సంఘము కట్టు బాట్లకు, సంఘస్థిరత్వముకొరకు సాంఘిక, మత, రాజకీయశిక్షు లవలన పెంపొందచేయబడినది. కాని, ఈ నైతికమార్గము, కడుపుకాలుచున్నపుడు ప్రజలనుకరించుట అసంభవము. మత సాంఘికరాజకీయ నిబంధనలన్నియు స్వసంరక్షణసూత్రము నుల్లంఘించి తీరుననియే పాలకులు పాలితులుకూడ యెరిగి యుండి, పట్టువిడుపులతో రాజ్యపరిపాలన కావించుచున్నారు.

వారిలో బలహీనజాతులు, స్వసంరక్షణకు వివిధోపాయము లను ఆచరణలో పెట్టుచుందురు. ఆంగ్లేయపార్లమెంటులో నిజమును మరుగుపరచకుండ కుండబ్రద్దలు కొట్టినట్లు చెప్పు వాడు చర్చిల్‌దొర ఒక్కడే. తక్కినవారు తమ నిజాభిప్రా యములను మరుగుపరచి, రాజనీతి తంత్రజ్ఞులుగా ప్రవర్తించి తమదేశజుల స్వార్థమును జాగ్రతగ కాపాడుకొనుచు, మనకు కొద్దిమెతుకులు పారవేయ జూచుచుందురు. 'మొండివాడు రాజుకంటె బలవంతు' డనుసామెతనుబట్టి మనలో కొందరు సహాయనిరాకరణవిధానము నవలంబించెదరు. వీరిలో ఎవరి కిని అహింసాసూత్రమునందు నమ్మకము లేదు. స్వసంరక్షణ కొరకే యీసామదానభేదదండోపాయములు వ్యక్తులచేతను, సంఘములచేతను అవలంబింపబడుచున్నవి.

---

## 29 వ అ ధ్యా య ము

### సాత్త్విక నిరోధము

### Non-Violent resistance.

సాత్త్విక నిరోధమనెడు ఆయుధము, బలహీనజాతులకు సంపూర్ణ రాజకీయ స్వాతంత్ర్యమున కుపయోగ పడగల దని కొందరి యభిప్రాయము. ప్రతిపక్షుల హృదయములను కరిగింపవలెనన్నవారు మనకు చేయుచున్నకీడుకు, ప్రతీకార

ముగ వారికికీడు చేయక ఉపకారముచేయుటయు, లేదా, మనమే వారిని ప్రతిఘటించి బాధల ననుభవించుటయు జరుప వలెనని వారు తలచెదరు. ఈవిధానమును ఒక మతసాంప్రదాయముగ నెంచుకొని, దీని నాచరణలో పెట్టుటకు ప్రయత్నించెదరు. వీరికి గురువు గాంధిమహాత్ముడు. ఈ విధానము మొదట ఫలప్రదము కాకపోయినను, నిరంతర కృషివలన జయము చేకూరవచ్చును. మిల్లుల యజమానులమీద జరువు కార్మికుల సమ్మెకట్టులు, వారికి తగినంతధనము, పలుకుబడి, నిర్మాణశక్తి లేక, తరుచుగా వీగిపోవుచున్నను, చిరకాలానుభవమువలన, కొన్నినాగరిక రాష్ట్రములలో జయమగుచున్నవి. ఇట్లే, ఒక దేశములోని వారందరు ఒక్కసారిగా యీ రాజకీయ విధానములో పాల్గొనజాలక పోయినను, బహుమందియైనను, యీ సాత్వికనిరోధము నవలంబించిన యెడల, ప్రజలకోరికలు ఫలించి దేశమునకు సంపూర్ణ స్వాతంత్ర్యము రాగలదని కొందరి యాశయము.

ఈవిధానము అహింసా సత్యసూత్రములమీద నాధారపడియున్నది. కాని, యీ సూత్రములు స్వసంరక్షణ సూత్రమునకు లోబడకతప్పదు. ఇదియే ప్రకృతిలో స్వాభావికమైన నీతిసూత్రము. మానవుని మేధాసంపత్తు పెరిగినకొలది, ఆతని బుద్ధి వికసించి, తనజాతి స్థిరత్వమునకును అభివృద్ధికిని, అహింసా, సత్యసూత్రముల నతిడవలంబించు చున్నాడు. ఇవి, తనక్రింది జీవరాసులలో సాధారణముగా కనుపడకపోవుటచే,

మానవునిజన్మ వేరైనదనియు, అతనిలో మనస్సాక్షియో లేక ఆత్మయో నొకటియున్నదనియు, యితనిని ప్రత్యేకముగ దేవుడు సృష్టించి, యితని ఉపయోగము నిమిత్తమే, తక్కిన జీవములను, ఖగోళములను సృజించెననియు పూర్వులు కొన్ని గ్రంథములను ప్రకటించిరి. కాని యిది యంతయు ప్రకృతి వికాసమేకాని, వేరుకాదు. ఈ నీతి సూత్రములుకూడ పరిణామదశలోనే యున్నవి. వివిధదేశములవారు, తమస్వార్థము కొరకు ఒండొరులను హింసించుకొనుటకంటె తమవ్యవహారములను సౌమ్యముగ పరిష్కరించుకొనుట, న్యాయమని యెంచుటకు మొదలు పెట్టిరి. కాని, అనేకవేల శతాబ్దములనుండి వంశపారంపర్యముగ వచ్చుచున్న స్వభావసిద్ధమైన ఆత్మరక్షణ సూత్రము, యెక్కువ బలీయమగుటచే, భయము, కోపము, మత్సరము మొదలగు గుణములను విడువలేక, జాతులలో రాజీప్రయత్నములు, నిరాయుధసమస్య మొదలగునవి సఫలమగుచుండుటలేదు.

ఈ సాత్వికనిరోధ విధానమువలనకూడ, కొంతదార్జన్యము రాగలదు. ఒకదొంగ, నాయింటిలోని సొత్తు తీసికొనిపోవుచున్నపుడు, నేను వానికి యడ్డు తగులగా, నన్నుకొట్టి నా సొమ్ము తీసికొనుటకు ప్రయత్నించును. నేను దెబ్బలుతిని యూరుకొనవలసినదేనా? లేక వానిని బలాత్కారముగ లోబరుచుకొనుటకు ప్రయత్నించవలయునా? మన భార్యాపిల్లల మానరక్షణకొరకు, ప్రతీకారము చేయవలదా? అప్పుడు

మన యాత్మరక్షణసూత్రమునే ఆ చరణలో పెట్టెదము కా బట్టి, మానవకళ్యాణము నిమిత్తము, నైతికపరిణామమును బట్టి యేర్పడిన యిప్పటి అహింసా, సత్యసూత్రములలో కూడ స్థూలసూక్ష్మభేదములు కలవు. మన ప్రస్తుతరాజకీయావస్థ లోని ఒక దృష్టాంతమును తీసికొందము. మన దేశములోని ముడిపదార్థములను చవుకగా యితర దేశములవారు తీసికొని పోయి, తమయంత్రములమీాద వారు తయారుచేసిన సామ గ్రిని మనకు ప్రియముగా అమ్మినపుడు, మనము వానిని కొన కుండ బహిష్కరించుట సాత్వికనిరోధవిధానమే. కాని, యిట్టి మన ప్రతీకారమువలన, ఆ దేశములోని పాటకపుజనుల కెం తయో కష్టమును కలుగజేయు వారమగుచున్నాము. కాబట్టి, వారును మనమును స్వార్థపరులమై ఒండొరులను హింసించు కొనుచునే యున్నాము.

ప్రేమయే ప్రధానగుణమని యెంచి, అపకారికి ఉపకా రము చేయుచున్నయెడల, చెడుపనులు చేయుటకు దుర్మార్గుల కెక్కుడవకాశములను కలుగఁజేయు వారమగుదుము. దుష్ట శిక్షణ, శిష్టరక్షణలు లేనియెడల అరాజకము దేశములో ప్రవేశించును. సంఘముయొక్క కట్టుబాట్లుపోయి, అది స్థిర ముగ నుండక నశించును. కాబట్టి కొంతహింస ఒకప్పు డవ సరమే యగును. కాని నేరస్థులకు అతికఠిన శిక్షలువేసి కారా గారములలో చిరకాలము బంధించుటకంటె, వారికి తగిన పరి స్థితులు కల్పించి సన్మార్గప్రవర్తకులగు నట్లును, న్యాయమైన

జీవనోపాధి సంపాదించుకొనునట్లును, పాలకులు ప్రయత్న ములు చేయుచుండవలెను.

విదేశీయులచే జయింపబడినజాతి, తిరిగి తాను సంపూర్ణ స్వాతంత్ర్యసంపాదనకు యీ సాత్త్వికనిరోధాయుధమును ప్రయోగించదలచినచో, అహింసాసూత్రమును బట్టి, తాము పరిపాలకులకు యెవ్విధముగాను సహాయము చేయకుండుట ఒక ముఖ్యవిధానము. ఇట్టి సహాయనిరాకరణోద్యమములో శాసనోల్లంఘన మొక ముఖ్యమార్గమని కొందరెంచెదరు. ఇట్టి ప్రతీకారము నెదుర్కొనుటకు, స్వసంరక్షణ సూత్రము ననుసరించియే, లా, ఆర్డర్లను నిలువబెట్టుకొనవలెను గనుక, పాలకులు తమ శాసనముల నుల్లంఘించినవారిని తప్పక శిక్షించి తీరుదురు. ప్రజలందరు, అహింసా సత్యసూత్రముల నవలంబించుట, అస్వాభావికముగనుక, కొందరు పాలకులమీాద ప్రతీకారమునకు గడంగెదరు. ప్రస్తుతమున్న లా ఆర్డర్లకు బదులు వేరు విధమైన లా ఆర్డర్ల నేల స్థాపించకూడదని వారు తమ విధానమును సమర్థించుకొన జూతురు. ఎటులైనను, యీ సాత్త్వికనిరోధవిధానము కూడ అన్యోన్యహింసకు యెడమీాయక తప్పదు. ప్రజాస్వాతంత్ర్యములకు, పాశ్చాత్యనాగరిక దేశములలో నెల్ల అనేకమార్గములుగ అచ్చటి లా ఆర్డర్లు ప్రజలు మార్చినట్లు వారిచరిత్రలే వేయినోళ్ల ఘోషించుచున్నవి.

సహాయనిరాకరణము, దీని యంతఃశాఖయగు శాసనోల్లంఘనము, నిబంధనానుకూల రాజకీయసాధనములే యని కొందరు రాజనీతిశాస్త్రజ్ఞులు అభిప్రాయపడుచున్నారు. నైతిక సంబంధమైన శాసనముల నుల్లంఘించక, అహింసా సత్యసూత్రములను జవదాటక, పాలకులు విధించిన దండనలకు లోబడుచు, బహుమంది ప్రజలు యీ సాత్వికనిరోధమార్గ మవలంబించిన యెడల, ఒకవేళ పాలకుల జాతియొక్క హృదయములన్నియు కరగకపోయినను వారు తమ స్వసంరక్షణసూత్రమును కొంతవరకు సడలించి తీరెదరు. సద్యోఫలితములను బట్టి యీ విధానముయొక్క యోగ్యతాయోగ్యతలను నిర్ణయించకూడదు. ఇది అనేకసారులు పశుబలమునకు లొంగిపోవుచున్నను, యెప్పటికైనను జయమొంది తీరునని కొందరు రాజ్యతంత్రజ్ఞుల యభిప్రాయము.

కొంతకాలమునకైనను యీ సాత్వికనిరోధాయుధము కూడ, వాడుకలో లేక త్రుప్పుపట్టవచ్చును. ప్రపంచములోని వివిధదేశముల ప్రజాసామాన్యములో మానవసౌభ్రాతృత్వము పెంపొందినపుడు, యితరుల కష్టసుఖములు మనవే యనుకొని ప్రవర్తించినయెడల, అన్యోన్యహింసలకు తావేలేదు. కాని యిట్లు సంభవించుటకు, ధనకాంక్షయు, ఆడంబరజీవనము, వ్యక్తులలో వలెనే, జాతులలో కూడ తగ్గుచుండవలెను. ఇది యింతలో సాధ్యమగునట్లు తోచదు. ప్రతిదేశములోని కార్మికులు, కర్షకులుకలసి, యైకమత్యముతో ధనికులను వశపరుచు

కొన్నయెడల, అన్యోన్యవిజిగీషులై స్వార్థపరులైన తమ మంత్రి వర్గములవారు, తమ్మును యుద్ధములలో దింపజాలరు. ఇది గాక, ఒక చిన్న దేశము, కొద్దిపాటి ప్రజలతోనే, ఆధునిక మారణయంత్రములతో పెద్దదేశమును కూడ నశింపజేసి, నిరపరాధులనుకూడ తుడిచిపెట్టగలిగినపుడు, యుద్ధములుకూడ వెనుకపట్టును. స్వసంరక్షణసూత్రమును బట్టియైనను, వివిధదేశ ప్రజలు ఒండొరులతో సఖ్యముగా నుండకతప్పదు.

---

## 30 వ అ ధ్యా య ము

## సత్సంతానోత్పత్తి శాస్త్రము
## Eugenics

ఈశాస్త్రమింకను శైశవదశలో నున్నది. మంచి సంతానము కలుగవలెనన్న, భార్యాభర్తలిరువురు దేహారోగ్యము, సుగుణసంపత్తి కలవారై యుండవలెను. ఒకరి నొకరు ప్రేమించి వివాహ మాడవలెను. శరీరబలముగాని, బుద్ధిబలముగాని, వంశపారంపర్యముగ కొంతవరకు రాక తప్పదు. కాని తరువాతి జీవితకాలములో వానిని వృద్ధిపరచుకొనవచ్చును లేక చెడగొట్టుకొనవచ్చును. అది వారివారి పరిస్థితులు, అవకాశములను బట్టి యుండును. కాబట్టి, మొదట పుట్టుకయు, తరువాత, తన్ను పరివేష్టించిన పరిస్థితులును కలసి (Nature and Nurture) ఒక మానవుని శరీరమనోదార్ఢ్య

ములకును, వాని బలహీనతకును, నడతకును కారణములగు చుండును.

ఈ విషయములో, తక్కిన ప్రకృతినంతయు పరీక్షించుడు. కుక్క, కోడి, ఆవు, యెద్దు, గుఱ్ఱము మొదలగు వాని పుట్టుకను గమనించి వానిని యేరుకొని తెచ్చుకొందుము. వాని అసలు జాతినిగురించియు వాని పూర్వులను గురించియు విచారించెదము. చెట్లను, మొక్కలను పెంచదలచినవారు మంచివిత్తనముల కెట్లు ప్రయత్నించెదరో మనకందరికిని తెలిసిన విషయమే. ఇట్లే, మనదేశమునకు మంచి స్త్రీ పురుషులు కావలెనన్న వధూవరుల తల్లిదండ్రుల కోవను, వంగసమును, వారికి వంశపారంపర్యముగ వచ్చు శారీరక, మానసిక గుణములను తెలిసికొని, వివాహనిశ్చయము చేసికొనుట న్యాయముకాదా? వరకట్నములు, కన్యాశుల్కముల నాలోచించుకొనుట అవ్యక్తము కాదా?

మనుష్యులుకూడ ఒక విధమైన జంతువులే. వీరు తమ పూర్వులగు తోకలులేనికోతులకంటె యెక్కువ మస్తిష్కము కలవారై, దానిని యభివృద్ధిపరచుకొని తక్కిన జీవరాసుల నన్నిటని తమకు లోబరచుకొని, తమ కెదురుతిరిగిన వానిని సంహరించుటయు, తక్కిన వానిని మచ్చిక చేసికొనుటయు తటస్థించినది. మానవులు ప్రపంచమంతయు, కోటానుకోట్లుగ వృద్ధియై వ్యాపించుచున్నకొలది, తక్కిన జీవరాసులు కొన్ని నశించినవి. మరికొన్ని సంఖ్యలో తగ్గుచున్నవి. ప్రకృతిలో

నుండుటకు తగిన జీవమే తుదకు మిగులునను సూత్రమును పాటిం పక, యెందరు శరీరమనోదార్ఢ్యములను పరిశీలించుకొని వివా హములు చేసికొనుచున్నారు? ఎంతమంది దుర్బలత్వముగల పిల్లలను కనుచున్నారు! ఈ పిల్లలు అనారోగ్యవంతులై తమ జీవితములను దుర్భరమగునట్లు చేసికొనుటయే గాక, యితరు లకు కూడ బాధలను తెచ్చిపెట్టుచున్నారు. వీరిలో బహు మంది వివాహమునే త్యజించి, సత్యమైన బ్రహ్మచర్యమునే అవ లంబించుట మంచిది. కాబట్టి స్త్రీపురుషులు వివాహములు చేసికొనబోవు నపుడు, ఒండొరుల శరీరమనోదార్ఢ్యములు, గుణములు తెలిసికొనవలెనన్న వారుభయులకు తగిన ప్రాయ మువచ్చినగాని తమ తల్లిదండ్రుల పోలికలనుబట్టి, తమరు చిన్నవారై యుండగానే నిశ్చయించజాలరు. దీనికి ముఖ్యకా రణము వారితల్లులకు గర్భోత్పత్తియైనపుడు, గ్రుడ్డు, దానిలో పడుబీజమునుబట్టి వారి మెదడును, శరీరమును మారుచుండును. కవలపిల్లలలోనే, వీనిలోని భేదములు, పుట్టుకలోనే కను పడుచున్నవి గనుక, యే రెండు గ్రుడ్లుగాని, యే రెండుబీజ ములుగాని, ఒక్కమాదిరిగ నుండవని మనము నిశ్చయించ వచ్చును. పుట్టినతరువాత, ఆ పిల్లల నానావిధపరిస్థితుల సమ్మే ళనమువలన, శరీరమనోదార్ఢ్యములు కొంతవరకు మారక తప్పవు. కాబట్టి బాల్యవివాహముల వలన, వధూవరులకు మున్ముందు ఆశాభంగము కావచ్చును. ఒక పిల్లకు వయసు వచ్చినకొలది పెద్ద లావుగా లందగా, పొట్టిగా మారవచ్చును.

మరియొకపిల్ల సన్నముగా రివటవలె పొడుగుగా మారవచ్చును. బుద్ధిలోకూడ గొప్పమార్పులు కలుగవచ్చును. వీరికి మెజారిటీ వచ్చేసరికి, జ్ఞానసంపాదనలోను, గుణములలోను అత్యంత మార్పులు కలుగవచ్చును. కాబట్టి గుణరూపములు స్థిరపడే వరకును, వివాహములు తలపెట్టనే కూడదు.

పుట్టుకతో కలిగిన శరీరమనోదార్ఢ్యములు, గృహ శిక్షణ, నివాసము, స్నేహసంబంధము, జ్ఞానార్జనసౌకర్యములు, ఆహారవిహారములు మొదలగు పరిస్థితులనుబట్టి కొంతవరకు మారుచుండును. ఆయాకుటుంబముల వారి పూర్వ వంగసమును కోవను, చూచుకొనుచుందుమేకాని, బాల్యవివాహములను చేయుటలో, వధూవరులను పరివేష్టించిన పరిస్థితులు మున్ముందు వారి నడత నెట్లు మార్చునో మనము కనుగొనుట కవకాశ మెట్లుండును? వధూవరులు, యువజనులైనచో, వారి శరీరాకారములు, జ్ఞానము, గుణములు స్పష్టముగా తెలియగలవు.

"పుట్టుకతో వచ్చినగుణము పుడకలతోగాని పోద"ను సామెత సత్యమేగాని, మనజీవితములో, మనముచేయు ప్రయత్నములవలన వానిని కొంతవరకు మార్చుకొనగలుగుదుము. మనము, ఉద్భిజ్జములయొక్కయు, జంతువులయొక్కయు, మంచి విత్తనములను తెచ్చి వానికి సరియైన దోహదమొసగి వృద్ధిచేయుటకు యెట్లు ప్రయత్నించుచున్నామో, ఆలాగుననే, మానవులలో కూడ స్త్రీపురుషులు, తమ సహభోగులను యేరికొని,

మంచిసంతానమును ఉత్పత్తిచేసికొని, వారిని సన్మార్గప్రవర్త నులుగను, విద్యావంతులుగను, నీతిగల పౌరులుగను చేయుట మిక్కిలి అవసరము. మనకంటె, మన తరువాత వచ్చుసంతతి, యెక్కువబలిష్టులుగను, ప్రజ్ఞావంతులుగను నుండవలయును. గుఱ్ఱములు, యెద్దులు మొదలగువాని కంటెను యిది యెక్కువ ముఖ్యము. మానవుని వంగసము, విద్యాబుద్ధులు, వృద్ధిచేసిన కొలది, అవి, అతనికేగాక, అతనిమూలమున యితరులకనేకు లకు ఉపయోగపడుచుండును.

కర్షకునివలె, మంచివిత్తనములనే సేకరించుకొని, తక్కి నవానిని తగులబెట్టునట్లు, మానవులకు చేయుట మనసొప్పదు. అన్ని దేశములలోను మానవజీవిని అతిపవిత్రముగాను, గౌరవ ముతోను చూచెదరు. అది ఆత్మహత్యకు ప్రయత్నించిన శిక్షింపబడును—దీనికి ముఖ్యకారణము దాని యుత్కృష్ట మైన మస్తిష్కమే. బ్రతికియుండిన, దేశమునకును, జాతి కిని, అది యెంత ఉపయోగించునో యెవరు చెప్పగలరు? పూర్వకాలములోని కొన్నిజాతులలో, బలహీనులను, అక్క రకురాని వారలను, చంపుట,లేక బానిసలనుగచేసి, వారిని ఖోజ్జా లుగనుంచి, వారిచే యూడిగము చేయించుకొనుట, జరుగు చుండెను. నాగరికతవృద్ధి యైనకొలది యీయాచారములు నశించినవి. మంచివిత్తనములకు, అనగా సత్సంతానమునకు, మానవ స్త్రీపురుషులను కలియునట్లు మనము బలాత్కరించ జాలముగాని, మంచివిత్తనములను యేరికొనుట శ్రేయస్కర

మనియు, దీనికి యువతీయువకుల వివాహములే మనలో ముఖ్యావసరములనియు మాత్రమే యీ సత్సంతానోత్పత్తి శాస్త్రము బోధించుచున్నది.

మంచిరకములగు స్త్రీపురుషులకు యెక్కువసంతానము కలుగునట్లును, చెడురకములగు స్త్రీపురుషులు అవివాహితులుగా నుండుటయో, లేక పిల్లలను కనకుండ నుండుటయో, లేక తక్కువమంది పిల్లలను కలుగునట్లో చేయవలయును. ఇప్పటివరకు జరిగిన ప్రకృతిపరిశోధనలను బట్టి, యిది సాధ్యమగునని తోచదుగాని, మానవులు, యీ విషయములో గట్టి ప్రయత్నములును పరిశోధనలును, వివిధజాతుల శ్రేయస్సునకు చేయకతప్పదు. అవినీతికరమైనట్టియు, శరీరారోగ్యమును చెరుచునట్టియు పద్ధతులను విసర్జించుచు, మన భవిష్యత్సంతానమును యెట్లు వృద్ధిపరచవలెనో తగుమార్గముల నన్వేషించుట మనయందరి విధి. ఇట్టి విధానము ప్రపంచమంతటికిని శ్రేయస్కరము.

నేరస్థులు, పిచ్చివాండ్రు, రోగిష్టులై మనోబలము, దేహబలము లేనివాండ్రు, ముఖ్యాంగవిహీనులు అనగా పుట్టు గ్రుడ్డి మూగవాండ్రు, యీ మొదలగువారు సంఘమునకెంతమాత్రము, సాధారణముగా, ఉపయోగపడరు. ఇట్టివారిని మనము బరిమార్చకూడదుగాని వివాహము చేసికొనకుండ, నిర్బంధచట్టములను చేయించవలసియుందుము. ఒకవేళ, యిట్లు నిబంధన లేర్పాటుచేయుట సాధ్యముకానిచో,

అయిచ్ఛికముగ సంతాన నిరోధమార్గము నవలంబించవలయు నని వీరికి నచ్చఁజెప్పవలెను. ఇదిగాక, పెంచి, విద్యాబుద్ధులు కఱపి, మంచిపౌరులను చేయగల సంతానమును మాత్రమే మానవుడు కనవలెనుగాని, అంతకంటె అధికసంఖ్యను కన్న యెడల జాతికి యెక్కువనష్టము సంప్రాప్తించును. దీనికి భార్యాభర్తల యారోగ్యము చెడనిమార్గములు శారీరశాస్త్రజ్ఞులు కనిపెట్టుచున్నారు. వంధ్యత్వమును (Sterilisation) అయిచ్ఛికముగనో, బలవంతముగనో యింద్రియ నిగ్రహము చేయజాలనివారికి కలిగించవలసియుండును. ఈ విధానము జర్మనీ మొదలగు దేశములలో అమలులో నున్నది.

సోమరిపోతులకును, బిచ్చగాండ్రకును వివాహములు చేసికొనుటకు, మన మెట్టిసహాయమును చేయకూడదు. కారాగారములలో నున్నవారు, వివాహము చేసికొనకుండ పాలకులు యెట్లు చట్టములు చేసిరో పుట్టు గ్రుడ్డి మూగవాండ్రును, కుష్ఠుమొదలగు వ్యాధిపీడితులును, వివాహము చేసికొనకుండ చట్టముల నేర్పాటుచేయవలెను.

అతిసమీపబంధువులను గాని, అతిదూరపుజాతులలోని వారిని గాని వివాహములు చేసికొనుట అనర్థదాయకమని కొందరు శాస్త్రజ్ఞుల యభిప్రాయము. ఈ విషయమింకను పరిశోధనలు చేసినగాని తేలదు. మంచి వంగసముగల రెండు కుటుంబములు సమీపబంధువులైనను వియ్యమొందవచ్చునని మరికొందరు శాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు.

## 31 వ అధ్యాయము

## సృష్టిపరిణామశిద్ధాంతము
## ( Theory of Evolution )

ఈ శాస్త్రము, ప్రస్తుతము ప్రపంచములో వాడుక యందున్న మతివిశ్వాసములన్నిటిని ఖండించివైచినది. ఊహాజన్యములైన వివిధ వేదాంతవిచారణలతో యీ శాస్త్రమునకు పనిలేదు. దైవము, పునర్జన్మ, ఆత్మ, మోక్షము, ప్రకృతిపురుషులసంబంధము, మొదలైన ఆధ్యాత్మికవిషయములను గురించి, యీ పరిణామశిద్ధాంతము మౌనము మాత్రమే దాల్చక, వానివిషయమై ప్రజలలో గల యభిప్రాయములను, సహేతువులతో త్రోసి పుచ్చుచున్నది. ఆధ్యాత్మికసమస్యలను పరిష్కరించలేమని చెప్పుచు, యీ సృష్టి యుత్పత్తి, పరిణామములను, ప్రకృతిరహస్య పరిశోధనల మూలమున స్పష్టపరచి, దైవమొకటి యున్నను, దానితో మనకెట్టి సంబంధములేదనియు, మనకష్టసుఖములలో ఆయన యెంతమాత్రము జోక్యము కలుగచేసికొనడనియు, నిష్కర్షగా యీ శిద్ధాంతము తీర్పు నిచ్చుచున్నది.

అనేకవేల సంవత్సరముల క్రిందటనే, యీ ప్రపంచముయొక్క ఉత్పత్తినాశనములను గురించియు, మానవుల పుట్టుకను గురించియు కొంతవరకు ఊహించినట్లు పూర్వమత గ్రంథములలో కనుపడుచున్నదిగాని, గత నూటయేబది సంవ

త్సరములలోనే, వివిధభౌతికశాస్త్రములలో, జ్ఞానము మిక్కిలి వృద్ధియై, తగుపరిశోధనల మూలమున యీ పరిణామసిద్ధాంతము బలిష్ఠమైన పునాదులమీద నిలవబెట్టబడినది. దీని నిశ్చితాభిప్రాయములు, సత్యములని నిరూపించుటకు ప్రతివారును, స్వయముగా పరిశోధన చేసికొనవచ్చును. భౌతికజ్ఞానమును సంపాదించుకొన జాలనివారు, తమపూర్వులు మతగ్రంథములలో వ్రాసిన వానిని నమ్ముకొని, వానికి వ్యతిరేకమైన పరిణామవాదములోని యంశములను తృణీకరించుట మిక్కిలి హాస్యాస్పదమగును. ఇప్పుడు ప్రపంచములోనున్న మతగ్రంథములన్నియు, మానవకల్పితములే గాని, అపౌరుషేయములెన్నడును కావని యీ భౌతికశాస్త్రములు స్పష్టముగ రుజువుచేయును. ఈ చిన్నవ్యాసములో, వీనిలో యిప్పటికి కావింపబడిన తుదినిర్ణయములనైనను ఉదహరించుట కష్టమైనను, ప్రకృతిరహస్యములను చూచాయగా, నిట సులభశైలిని ఉదహరించెదను.

పరమాణువుల కూడికవలననే యీ కోటానుకోట్ల ప్రపంచములు—సూర్యచంద్రగ్రహ నక్షత్రాదులతో కూడిన యీ బ్రహ్మాండమంతయు—పుట్టినవి. ఈ సత్యమును గ్రహించుటకు పదార్థవిజ్ఞానఖగోళశాస్త్రజ్ఞానములు (Physics and Astronomy)మిక్కిలి అవసరము. ఈ శాస్త్రములతోపాటు భూగర్భశాస్త్రజ్ఞానము (Geology) కొంత కలిగించుకొన్న యెడల, యీ భూమి, దీనిమీది పర్వతముల యుత్పత్తి తెలి

యగలదు. దీని ఘనీభవించిన పొరలను, కొంతదూరము అడు గునకు త్రవ్వుకొనిపోగా, యెన్నికోట్ల సంవత్సరములనుండి, అట్లు త్రవ్వబడిన భాగము పైకి లేచినదో, ఆయా పొరలలో ప్రస్తుతము మనము కనివిని యెరుగని జంతుజాలములు పూర్వ మందెన్ని యున్నవో, యెంతకాలమందున్నవో స్పష్టపడును. ఎంతెంతకాలము క్రిందట వృక్షములు, జంతువులు ఉద్భవించు టకు మొదలిడెనో మనము తెలిసికొనగలము. ఈ కాలము సుమారు యిరువదికోట్ల సంవత్సరములకు తక్కువగ నుం డదు. భూగర్భశాస్త్రమును, మృతకళేబరపరిశీలనశాస్త్రమును (Geology and palaentology), బైబిలులోనున్న ఆరు దినముల ప్రపంచసృష్టి శుద్ధ అబద్ధమని స్పష్టపరచును. మన హైందవుల బ్రహ్మాండపురాణములోని సృష్టి క్రమమంతయు అభూతకల్పనమే యని రుజువగును. మనబాలురకు, భూగోళ ముతో పాటు యీ భూగర్భశాస్త్రములోని ప్రాతిపదికవిష యములనైనను పాఠశాలలలో బోధించవలయును.

జీవజంతువుల పరిణామము, ప్రపంచపరిణామముకంటె క్లిష్టతరమైన విషయము. జీవముయొక్క పరిణామమును తెలిసికొనుటకు, వృక్షశాస్త్రము, (Botany), పిండోత్పత్తి శాస్త్రము (Embryology), జీవశాస్త్రము (Biology) చదు వుకొనవలెను. ఉద్భిజ్జములును, పురుగులును ఒకేవిధమైన జీవాణువులనుండియే పుట్టినట్లు పరిశోధనలవలన తేలినది. అనేకవిధములైన వృక్షజాతులు, పురుగులు, సరీసృపములు

చేపలు, పక్షులు, జంతువులు, తుదకు మనుష్యులు క్రమక్రమ ముగా ఒకదానినుండి మరియొకటి పైస్థానముల కెగ్లు పరిణ మించినవి, లా మార్కు, డార్విన్, వాలేసు, వీస్మాన్, హక్స్లి, హెకెల్, మొదలగు శాస్త్రజ్ఞులు, అనేకవిధములైన పరిశోధ నలను చేసి, ఉద్గ్రంధములను వ్రాసి స్పష్టముగా తెలియజెప్పిరి. ఆయాదేశములలోని శాస్త్రకారులు, ప్రత్యేక ప్రత్యేకముగ పరిశోధనలనుచేసి, యేకాభిప్రాయమునకు వచ్చినవానినైనను మనము నమ్మవలసినదేకదా! జీవముగల దానిలోను, జీవము లేనిదానిలోను, ఒకేవిధమగు స్థూలద్రవ్యము, శక్తియుగల పర మాణువులున్నవి. కాబట్టి నిర్జీవములో నుండి జీవము వచ్చు నని యీ శాస్త్రజ్ఞులవాదము. మన కడుపులోపుట్టిన నలి పురుగులు, పాములు, పేడ మొదలగు మురుగుకుప్పలలోనుండి వెలువడు పురుగులను, వేరువేరుగా, ఆ పదార్థములలో జీవము పోసి, భగవంతుడను వాడొకడు సృజించుచున్నాడని జ్ఞానము గలవాడెవడును నమ్మజాలడు. ఇట్టి జీవరాసులు, మనకంటికి జీవమున్నట్లు కనుపడని పదార్థములనుండి లక్షలకొలది వెలు వడుచున్నట్లు ప్రతివాడును కనుగొనుచునే యున్నాడు. కా బట్టి ఒక పదార్థమునుండియే, చైతన్యములు, జడములుకూడ పుట్టుచున్నవని మనము నమ్మవచ్చును.

ఇకమానవుల వంశవృక్షము, అంతకంటెను విచిత్ర ముగా నుండును. మనుష్యుని ప్రతియవయవమును, ప్రతియె ముకను సూక్ష్మముగ పరీక్షించి, వానిని యితరజంతువుల

వానితో పోల్చుకొనుచు రాగా, మానవునికి సమీపపూర్వులు, తోకలులేని కోతులని, నిర్ణయింపబడినది. భూగర్భశాస్త్రము, యెముకల పరిశోధనశాస్త్రమును బట్టి, యీ భూమి యనెడు ఉండ, ఒక పెద్దగోళమగు సూర్యునినుండి బద్ధలై, విడివడి, ఒకతునుకగా సుమారు యిరువదికోట్ల సంవత్సరముల క్రిందట యేర్పడినది. ఈ భూమియొక్క మొదటిభాగమును (I-Archeozoic period) అని పిలచెదరు. ఈ కాలములో వృక్షజాలము ఉద్భవించుట మొదలిడి, సుమారు యిప్పటికి పదికోట్ల సంవత్సరములైనను కావచ్చును. దాని రెండవభాగమును (II-Psaleozoic period) అనెదరు. ఎముకలులేని జంతువుల కళేబరములు మట్టితో కలసిపోవునుగనుక, యీ కాలములో జంతువు లేమైనఉన్నవో, ఉన్నయెడల, వాని యాకారము లెట్టివో మనకు తెలిసికొనుటకు వీలులేదు. ఈ కాలము తిరిగి నాలుగుభాగములుగా భూగర్భశాస్త్రజ్ఞులు విభజించిరి. (a) సైల్యూరియన్—దీనిలో చిన్నచేపలు మొదలగునవి కనుపడును. (b) డివోనియన్, ఈ కాలములో, చేపలకును, జంతువులకును మధ్య తరగతిగా ఒకవిధమగు ఆకారములుగల జీవములు కనుపడును. (c) కార్బొనిఫరస్, వెన్నెముకలుగలజంతువులును భూమిమీదను నీటిమీదను జీవించగల జంతువులును కనుపడును. (d) పెర్మియన్, బల్లివంటి, ప్రాకుడుజంతువులు బయల్పడును. మూడవభాగము (III Mesozoic period) ఈ కాలమును మూడంతర్భాగములుగ విభజించ

వచ్చును. (1) ట్రయసిక్—దీనిలో సస్తనజాతి జంతువులు, అనగా పాలిచ్చుజంతువులు పుట్టినవి, (2) జూరాసిక్, (3) క్రిటేషస్ అని పిలువబడుకాలములలో జరాయుజములు, అనగా గర్భకోశము, మావియుగల జంతువులు పుట్టినవి. నాల్గవభాగము (IV Terliary period) నాలుగు అంతర్భాగములుగా విభజింపబడినది—(1) ఇయొసీన్, (2) ఒగోసీన్, (3) మయొసీన్, (4) ప్లయొసీన్—అను కాలములలో, పాలిచ్చుజంతువులు, అనేకరకములుగా బయలు దేరినవి. వీనిలో యేవి ముందుపుట్టినవో, వీనిలో నుండి యేవి తరువాతపుట్టినవో అంగవిన్యాస, పిండోత్పత్తిశాస్త్రములవలన (Anatomy and Embryology) తెలిసికొనగలము. ఈ కాలములోని ఆఖరు దశను యితరజీవరాసులకంటె, కొంచెమెక్కువ మెదడుగలిగి, మనోవికాసముగల మానవుడు జన్మించెను. ఈ చివరయుగము యొక్క మొదటిభాగములో వెన్నెముకలుగలిగి పాలిచ్చుజంతువులన్నియు, ఉద్భవించి, అనేకశాఖలుగ చీలి, తుదకు కోతులు,మనుష్యులును అయినవి. వెంట్రుకలు, త్వక్కులోని మాంసగ్రంథులు, చన్నులు, క్రిందిదవుడ, చెవులయొక్క యెముకలనిర్మాణము, కపాలకట్టడపుగీతి, మోకాటిచిప్ప, రక్తములోని యెర్రయణువులలో బీజములులేమి, రొమ్ము ఉదరముల మధ్యఅడ్డముగా నుండుచర్మము,—యీ మొదలగు అంగములు, యీ కాలములో పుట్టిన జంతువులయందే కనుపడుచున్నవి. ఈ జంతువుల నన్నిటిని ఒకదానితో నొకటిపోల్చి

చూచినయెడల మానవులకును, కోతులకును యెక్కువపోలిక కనుపడుచున్నది.

ఆసియాఖండములోని ఓరాంగోటాంగు, గిబ్బన్‌జాతి కోతులయొక్కయు, ఆఫ్రికాఖండములోని చింపాంజి, గోరిల్లా జాతి కోతులయొక్కయు కళేబరములను, మానవులవానితో పోల్చి, జాగ్రతగ పరిశోధించినమీదట, ఆ రెండువందల యెముకలే, ఆ మూడువందల మాంసకృత్తులే, ఒడలుమీద ఆ విధమైన వెంద్రుకలే, ఆ విధమైన స్తనములే, ఆ నాల్గుభాగములుగల హృదయకోశమే, ఆ ముప్పదిరెండు దంతములే, ఆ స్త్రీపురుషమర్మస్థానములే, ఆ మెదడుయొక్క విభాగములే, యెట్టి వ్యత్యాసమును లేక కనుపడుచున్నవి. ఏ యవయవము తీసికొన్నను, మానవునకును, పైనచెప్పిన తోకలులేని కోతులకును గల భేదము, వానికిని తోకలుగల కోతులకును గల భేదముకంటె మిక్కిలి తక్కువుగనున్నది. వివిధావయవముల కొలతలలో భేదముండునుగాని, వాని యాకారములు, వంశీభూతమైన భాగములు, గుణములు, ఒకటేమాదిరిగ నున్నవి. అవయవముల కొలతలలో, రంగులలో మనిషికి మనిషికే భేదములున్నవి. మనుష్యుని రక్తమును తోకలుగల క్రిందిజాతి కోతులకును, యితరజంతువులకును యెక్కించినయెడల, అది వానికి విషమై ఆ జంతువులు తప్పక చనిపోవును. తోకలులేని పైజాతికోతుల కట్లు యెక్కించినపుడు, వానికెట్టి అపాయము కలుగలేదు. కుక్కకు, నక్కరక్తమెక్కించిన నష్టము కను

పడదు. ఆలాగుననే చెవులపిల్లి రక్తమును నీనుకుందేలు కెక్కించవచ్చును. కాని కుక్కరక్తమును నీనుకుందేలుకును, నక్క రక్తము చెవులపిల్లికిని యెక్కించిన, ఆ జంతువులు తప్పక చచ్చిపోవును. దీనికి కారణము, ఆయాజంతువులకు సమీప రక్తబంధుత్వము లేకపోవుటయే. ఇట్టి దృష్టాంతములనేకములు, ప్రత్యక్షప్రమాణముల మీద చూపించవచ్చును. కాబట్టి, మొదట మానవకోటికి అతిసమీపపూర్వులు తోకలు లేని కోతులనియు, వానిగుండానే, మానవులు జన్మించిరనియు చెప్పక తప్పదు.

ఇదిగాక, పిండోత్పత్తిశాస్త్రజ్ఞులు, ఆయాజంతువుల పిండములను దుర్భిణీయంత్రముతో పోల్చి చూచినారు. తోకలు లేని కోతులవి, మానవులవి ఒకటేమాదిరిగ నున్నవి. తోకలుగల కోతులవి యితరజంతువులవి వేరురూపమునుదాల్చి యున్నవి. పక్షులు, సరీసృపములనుండి జనించినట్లు యేలాగు రుజువైనదో, మనుష్యులు, కోతులనుండి పుట్టినట్లు, అట్టి పరిశోధనలవలననే స్పష్టముగ రుజువైనది. జావాదీవిలో యిటీవల, నిలుచుని, కర్రపట్టుకొని రెండు కాళ్ళమీద నడచు తోక లేని కోతి కనుగొనబడెను. దీనికిని యిప్పటిమనుష్యునికిని మధ్య, ఒకరకపు మానవులమృతకళేబరములు (Neanderthal men) దొరికినవి.

పైన క్లుప్తముగా చూపించిన సృష్టిపరిణామమును ఆయాప్రకృతిశాస్త్రపరిశోధనలను బట్టి మనము తెలిసికొనుచు

న్నాము. దీనిని నమ్మువారు, దేవుడనువాడు ప్రత్యేక ప్రత్యేకముగ, యీ వివిధజీవరాసులను సృజించెననిగాని, మానవుని వేరుగా పుట్టించి, వానికొరకే, యీఖగోళమునంతయు సృజించెననిగాని నమ్మజాలరు. ఈ సృష్టిపరిణామ శిద్ధాంతమును, నమ్మినయెడల, ఆయాదేశములవారు, తమ మతగ్రంథములలో ఊహించి వ్రాసికొన్న సృష్టిక్రమ మంతయు భగ్నమగుటయే గాక, ఆ యూహాలవంటివే, మనకు తెలియజాలని ఆధ్యాత్మికవిషయములను గురించికూడా వ్రాయబడెననియు, యీమతగ్రంథములన్నియు, ఒట్టి మానవకల్పితములనియు స్పష్టపడును.

పైన చెప్పిన శిద్ధాంతము నిజమైనచో, ఆత్మయనునది వేరుగా మన శరీరములలోనికి యెక్కడనుండి వచ్చినది? స్త్రీ గర్భమందుండు గ్రుడ్డులో, పురుషునివీర్యము పడినపుడు, stem cell అను నొక పదార్థమేర్పడును. స్త్రీయొక్క గ్రుడ్డు తల్లిగుణములను, పురుషుని వీర్యములోని అణువు, తండ్రి గుణములను కలిగియుండును. ఇట్లు వంశపారంపర్యముగ వచ్చు శరీరమానసికగుణములతో పిల్లపుట్టును. పైన చెప్పిన stem cell చిన్న యణువులుగ విభాగము లగుచుండును. వీని లోనుండియే వివిధావయవములు ఏర్పడును కాబట్టి అవినాశియగు ఆత్మయనునది వేరుగా యెక్కడనుండి చొప్పించబడినది? నరములైనను లేనట్టి క్రిందిజంతువులలో సహా యింద్రియజ్ఞానము, రేగినప్పుడు నొప్పిపెట్టుట, ముట్టుకొన్నయెడల, కాలుసేతులు వెనుకకు లాగుట, మొదలైన చేష్టలు కనుపడు

చున్నవి. ఇవియన్నియు వృక్షలతాదులలో కూడ నున్నట్లు మన జగదీశచంద్రబోజుగారు కూడ కనిపెట్టిరి. కాబట్టి, పైగుణములు ఆత్మయను దానికే వర్తించినయెడల, వీని యన్నిటిలో ఆ యాత్మ యుండవలెను. చైతన్యము, జ్ఞాపకశక్తి స్మృతి, ఆలోచన మొదలగు మానసికవృత్తులు, మెదడుమెండుగానున్న జంతువులలో యెక్కువగ కనుపడుచున్నవి. నానా జంతువుల మస్తిష్కమును పోల్చి, సూక్ష్మదృష్టితో భూతఅద్దములతో పరిశోధించినయెడల, వీని యన్నిటి యాకారము, నిర్మాణము, గుణములు, తెలివి, మొదలగునవి యెట్లు యేలయేమాదిరిగ మారినవో స్పష్టపడగలదు. శారీరశాస్త్రము (Physiology) పిండోత్పత్తిశాస్త్రము (Embriolory) అంగవిన్యాసశాస్త్రము (Anatomy) మానసశాస్త్రము(Psychology)మొదలగు శాస్త్రములను బాగుగా చదువుకొని, చూచి పరిశోధించి, స్వయముగా పరీక్షించినవారికి యీవిషయము లన్నియు సులభగ్రాహ్యములు.

మనమస్తిష్కములో, ఒక్కొకభాగమును ఛేదించి తీసివేసిన యెడల, ఒక్కొకగుణము లోపించునని కనిపెట్టబడినది. కపాలపరీక్షశాస్త్రము (Phrenology or Craniology) ను బట్టి అనేక మానసిక రోగములను కనిపెట్టి కుదుర్చుచున్నారు. క్రొత్తగా పుట్టిన పిల్లవానికి చైతన్యముగాని, తెలివిగాని, విమర్శనజ్ఞానముగాని, స్వతంత్రాలోచనగాని యేమియు నుండవుగదా! పిల్లవాడు పెరిగినకొలది అతని

మస్తిష్కము వృద్ధియైనకొలది అతనిని అనుదినము పరీక్షించుచు వచ్చినచో ఆ శక్తులెట్లువృద్ధియగుచుండునో తెలియగలదు. మన పాఠశాలలలోని ఉపాధ్యాయులు యీవిషయములను తెలిసికొనుచుండిన యెంతబాగుండును? ప్రతిపిల్లవాని మానసిక శక్తులను తెలిసికొని, వానిని వృద్ధినొందించుటకు బదులు, అనవసరముగ అతని మెదడుకు మించిన లేక సరిపోవని విషయములను బలవంతముగ వానిగొంతుకలో పోయరు కదా! మెదడు చావగానే, ఆత్మయనునది మరియొక వస్తువున్నయెడల, అదియు చచ్చినదనే యెంచవలెను. అవినాశిగా ఆత్మయనునది వేరుగానుండి, శరీరము నశించిన తరువాత దానిని వదలి యెక్కడనో నిలచియుండునని వాదము చేయు మతగ్రంథములు, మతగురువుల నమ్మకములు, ఒట్టి ఊహాజన్యములు. మస్తిష్కమేఆత్మయనిన మనకెట్టి యభ్యంతరము లేదుగాని, అది అవినాశియెట్లగును? ఆధునిక యుగములో భార్యాభర్తల సంయోగమే లేక, చైతన్యముగల పిల్లలను పుట్టించు యంత్రములు బయలుదేరు చుండగా యికయాత్మయనునది, వేరుగా యెక్కడనుండివచ్చును?

ఇప్పుడుకూడ, మూఢులై చదువురాని అడవి మనుష్యుల మస్తిష్కమును, విద్యలు నేర్చినవారి మస్తిష్కమును, పోల్చి చూచిన యెడల, వీరి భేదము స్పష్టపడును. మానవకోటిలోని వివిధజాతుల తెలివితేటలు, ఆకారములు, శరీరచ్ఛాయ, పోలికలు, మొదలైనవానిసగురించి బోధించుశా

స్త్రమునకు Ethnology యని పేరు. మనుష్యుల గుణములు—వారి పుట్టుక, వారి పరిస్థితులమీద యాధారపడినవిగాని వారికి ప్రత్యేకముగా దేవునిచేత సృజింపబడిన యాత్మల వలన కలుగలేదని తెలియగలదు. కాబట్టి నిష్పక్షపాత బుద్ధితో పై విషయములను పరిశీలించిన యెడల అవినాశి యగు నొకయాత్మయనునది మనలో లేనే లేదని స్పష్టపడును. ఆయా దేశజుల పూర్వసాంప్రదాయములను బట్టియు, అనాగరిక మనుష్యులకు యీప్రకృతిలో అనుదినము సంభవించు కార్యముల వలన కలుగు భయమును బట్టియు, మనకు చిన్నతనమునుండి పాఠశాలలలో నేర్పిన విషయములను బట్టియు, మనకు అనుశృతముగా అనేకవేల సంవత్సరములనుండి వచ్చుచున్న నమ్మకములను విడువజాలము. స్వతంత్రాలోచనలు, స్వతంతాభిప్రాయములు మన మతకర్తలు, గురువులును చంపివేయుచుండిరి.

మానవుడు తాను పుట్టినపుడు తనకు వంశపారంపర్యముగవచ్చు గుణములచేతను, తరువాత తనజీవితకాలములో తనకు సంభవించిన లేక తన్ను పరివేష్టించిన పరిస్థితులచేతను, కొన్ని కర్మలలోనికి, తనయిచ్ఛలేనిదే, యీడ్వబడుచున్నాడుగాని యితనికి యేపనిచేయుటకును, చేయకపోవుటకును స్వాతంత్ర్యములేదు. కాని యిదిపూర్వజన్మ కర్మఫలమని కొందరు మతగురువులు దీనికి పేరుపెట్టుటకు కారణమేమియుకనుపడదు. మతము, నీతి, సంఘము, న్యాయశాస్త్రము, ఒకవ్యక్తినడతను

పైకి ప్రేరేపించునట్లు కనపడునుగాని, నిజముగా, పుట్టుక, పరిస్థితులే (Heredity and environment) అనని చిత్తమును బంధించును.

చిత్తస్వాతంత్ర్యమునుగురించియు, ఆత్మయనుదాని అవినాశిత్వమునుగురించియు జనుల మూఢనమ్మకములతో పాటు ఒక ప్రత్యేకమూర్తియగు దేవుడొక డున్నాడని మరియొక మూఢనమ్మకము వ్యాపించి యున్నది. ఆయనకు మనుష్యునికిగల ఆకారమును, గుణములను కొన్నిమతములు ఆరోపించుచున్నవి. ఈరెండును లేని దేవుడు మనకచింత్యుడు గనుకనే మనవేదాంతులు, ఆయన ప్రకృతియంతయు నిండియున్నాడనియు (Pantheism) ఆయనే పరమాత్మ యనియు, చేతనాచేతనము లన్నిటిలో ఆయనయే పృథగాత్మల స్వరూపమున నిలిచియుండుననియు, మనలోని ఆత్మయే బ్రహ్మాండమంతలోను ఉన్నదనియు, మనవేదాంతు లూహించెదరు. ఈఅద్వైతమతము (Spiritual monism) క్షేత్ర క్షేత్ర జ్ఞానవిచారమును క్షరాక్షరవిచారమును కూలంకషముగచేసి యేదిపిండమందు కలదో అదియే బ్రహ్మాండమంమును కలదని శిద్ధాంతీకరించినది. ఇదియే శుద్ధాద్వైతము.* కాని మనలోనే కాణాదుని యారంభవాదము (Atomic theory) కపిలుని ఉత్క్రాంతవాదము (Evolu-tion theory) మన జడాద్వైతశిద్ధాంతమునకు (materialistic monism) సమీపములో నున్నవి. సాంఖ్యుల ప్రకృతిపరిణామమును మన వేదాంతులు ఒప్పుకొనుచు, పైమెట్టున

ప్రకృతి పురుషుల యన్యోన్య సంబంధమును గురించి వేరు వేరు మార్గములు త్రొక్కిరి. తుదకు ఋగ్వేదములోని నాసదీయ సూక్తములో, యీ ప్రకృతియొక్క ఆద్యంతములు యీశ్వరుడొకడున్నను వానికిని తెలియవేమోయని సందేహమును కనుపరచిరి. ఈ యూహలన్నియు యెట్లున్నను, యీ వేదాంతము, ప్రస్తుతము ప్రచారములోనున్న మతముల నన్నిటిని త్రోసివేయును. మూఢవిశ్వాసములు, అమానుష క్రియలు, దుష్టశిక్షణ, శిష్టరక్షణకొరకు దేవుని యవతారములు, స్వర్గనరకములు మొదలగు వానిని నిరాకరించక తప్పదు. ఈ మతానమ్మకములచేతనే, మనము ప్రస్తుత మనోశానిసత్వములో మునిగియున్నాము. సృష్టిక్రమ వికాసమును, భౌతిక శాస్త్రజ్ఞానముగుండా మనము గ్రహించి, చిన్నతనము నుండి బాలురకు దానిని బోధచేయుచున్నగాని, లేనియెడల మూఢ విశ్వాసములు, వారు పెద్దలైన తరువాతకూడ వారిని వదలవు. సత్యాన్వేషణుడు పరులనిందలనుగాని, పొగడ్తలను గాని లక్ష్యపెట్టడు గనుక, యీ వ్యాసము ప్రజాబాహుళ్యమునకు మనస్సంకటము కలిగించినను ప్రకృతిశాస్త్రములెట్లు ఖండించిచెప్పుచున్నవో వ్రాయుటకు వెనుదీయడు.

ఈ పరిణామవాదమును విమర్శించదలచినవారికి, ముందుగా యీ వ్యాసమున చివర నుదహరించిన పట్టికలోని శాస్త్రములను కొద్దిగనైనను చదువుకొననిదే, దానిని త్రోసి పుచ్చుటకెట్టి యధికారము లేదు. న్యాయమునుకాదు. ఈవట్టి

కలోని ఒక్కొక్క శాస్త్రమే, కూలంకషముగ చదివి, స్వయముగా ప్రకృతిలోని ఆయావిషయములనుచూచి, పరీక్షచేసి, పరిశోధించి, అనుభవముమీద తుదినిర్ణయములకు రావలెనన్న, జీవితకాలమంతయు పట్టును. కాని, యీ శాస్త్రములలోని ప్రాతిపదిక సూత్రములను తెలుపు ప్రథమ పాఠకపుస్తకములను అందరునుచదివి, తమ న్యాయబుద్ధి నుపయోగించి నిర్ణయమునకు సులభముగా రావచ్చును. ఈసృష్టి పరిణామ శిద్ధాంతమునంతయు ఒప్పుకొన్న,పదార్థ విజ్ఞానశాస్త్రములో మాత్రము అఖండపండితుడగు సర్. ఆలివర్ లాడ్జిగారే, యీ ప్రకృతికి సర్వజ్ఞుడొక డుండవచ్చుననియు, ఒకయవినాశకరమగు ఆత్మయను పదార్థముకూడ నుండునేమో యనియు ఊహించుచున్నపుడు, చిరకాలానుగత సాంప్రదాయములను, నమ్మకములను సామాన్యులు వదలగలరా? లాడ్జిగారి నిస్సారతను, లంకాస్టరు అను మరియొక గొప్ప శాస్త్రజ్ఞుడు కఠినముగ విమర్శించెను. ఈ ప్రకృతికి నిర్మాతయొకడున్నాడని ఒప్పుకొన్నను, మన ప్రకృతి రహస్యసమస్య అట్లేనిలచియున్నది. ఆయన యెందుండి వచ్చెను? శూన్యమునుండి యీ ప్రకృతి పురుషులెట్లు ఉద్భవించిరి? వీనిని యేశిద్ధాంతము పరిష్కరించజాలదు. పురుషుడు అనగా పరమాత్మ, యీ ప్రకృతినంతయు నిండియున్నాడను మన శుద్ధాద్వైత శిద్ధాంతమును ఒప్పుకొన్నయెడల, అతను ఉదాసీనుడై, మనము ఒనరించు కార్యములకు తాను త్తరవాది

కాదు సరేకదా, న్యాయాధిపతిగానుండి, శిష్టరక్షణ, దుష్ట శిక్షణలనుకూడ చేయును. ఈ సృష్టిలో ప్రతిజీవమును, ప్రత్యేక ప్రత్యేకముగా సృజించి, వానిలో తనలోని భాగమును ప్రవేశ పెట్టుచుండడు. తానే ప్రకృతియైనపుడు, మనమందరము దేవుళ్లమే. మనము ఒక ప్రత్యేక వ్యక్తిని ప్రార్థించనక్కర లేదు. అతనిమీద నాధారపడిన లాభములేదు. నిర్వికారుని, నిరవయవుని, సర్వవ్యాపిని, నిరంజనుని, అచింత్యుని ప్రార్థించు టెట్లు? దీనినిబట్టి జ్ఞాన, భక్తి, ధ్యానకర్మయోగముల ప్రయోజనమేమో ఆలోచించుకొనుడు. భగవద్గీతలో ప్రతిపాదించిన యీ మార్గము లవలంబించనిచో, నీతికి స్థానమెక్కడున్నదని కొందరు ప్రశ్నించవచ్చును. సాంఘికనీతి, మానవుల యనుభవమునుబట్టి ఆ యాసంఘ సంరక్షణకును, అభివృద్ధికిని నిర్మింపబడుచున్నది. నీతిపరిణామముకూడ, ప్రకృతి పరిణామములో ఒక భాగమే. దయ, ప్రేమ, విశ్వాసము మొదలైన సుగుణములును, హింస, క్రౌర్యము, మొదలగు దుర్గుణములును క్రింది జంతువులు, పక్షులు మొదలగు వానియందు కూడ కనుపడుచు రానురాను, మానవసంఘములు యేర్పడి, స్వసంరక్షణకు నీతిసూత్రముల నేర్పాటు చేసికొని, రాజకీయ శిక్షలచేతను, సాంఘిక కట్టుబాట్లచేతను, వానిని జనులనుసరించునట్లు నిర్బంధింపజేయుచున్నవి. లోకానుభవమే, సమస్త నీతిశాస్త్రమునకును, నిజమైన పునాదియని, మన బాలురకు సదా నచ్చజెప్పుచున్నయెడల, దైవశిక్షల భయములేకుండ,

హేతువాదము మీదనే,యీనైతిక సూత్రావశ్యకతను గ్రహింపగలరు. అహింసా సత్యసూత్రములకును, స్వసంరక్షణ సూత్రమునకును అప్పుడప్పుడు కలుగు సంఘట్టనలను కూడ వారు పెద్దలైనకొలది గ్రహించగలరు. ఒకవేళ న్యాయాధిపతియగు సృష్టికర్త ప్రత్యేకముగ నున్నాడని ఊహించువారు కూడ, మానవసేవయే దైవసేవయను మతము నవలంబించవలెనే గాని, యిప్పటి మత సాంప్రదాయముల నన్నిటిని త్రోసివేయ వలసినదే. అట్టివాని నొకనిని తలపెట్టక పోయినను, అహింసా సత్యసూత్రముల మీద నాధారపడిన వానికి యెన్నటికిని నష్టముండదు.

ముఖ్యమైన ప్రకృతి శాస్త్రముల పట్టిక:—

1. Physics. పదార్థ విజ్ఞానశాస్త్రము
2. Chemistry రసాయనశాస్త్రము
3. Biology. జీవశాస్త్రము
4. Botany. వృక్షశాస్త్రము
5. Geology. భూగర్భశాస్త్రము
6. Astronomy. ఖగోళశాస్త్రము
7. Mathematics. గణితశాస్త్రము
8. Psychology. మానసశాస్త్రము
9. Sociology. సాంఘికశాస్త్రము
10. Anthropology. మనుష్యవర్ణనశాస్త్రము

11. Physiology. జంతుదేహధర్మశాస్త్రము
12. Anatomy. అంగవిన్యాసశాస్త్రము
13 Pathology. రోగలక్షణశాస్త్రము
14. Embryology. పిండోత్పత్తిశాస్త్రము
15. Palaeontology. మృతకళేబరముల పరిశీలనశాస్త్రము
16. Phrenology. కపాలపరీక్షశాస్త్రము
17. Ontology. సత్వవిచారశాస్త్రము
18. Philosophy. తత్వశాస్త్రము
19. Phenology. శీతోష్ణస్థితితో సంబంధించిన జీవశాస్త్రము
20. Morphogeny. జీవములలో అంగవిన్యాసములను పోల్చు శాస్త్రము
21. Ethnology. మానవసంఘశాస్త్రము
22. Anthropogeny. జీవవర్ణనశాస్త్రము
23. Eugenics. సత్సంతానోత్పత్తిశాస్త్రము

I

# రు 12000 లకు డిక్లరేషన్ ఆఫు ట్రస్టు దస్తావేజు

ఆ 1931 సం॥ యేప్రియల్ 9 వ తారీఖున, పశ్చిమ గోదావరిజిల్లా కొవ్వూరు రిజిస్ట్రేషన్ సబుడిస్ట్రక్టు, కొవ్వూరు గ్రామకాపురస్తులు బ్రాహ్మణులు, హైకోర్టు అడ్వకేటున్ను లేటు వల్లూరి వెంకటకృష్ణయ్యగారి కొమారుడున్ను నగు వల్లూరి సూర్యనారాయణరావు వ్రాసిన డిక్లరేషన్ ఆఫు ట్రస్టుదస్తావేజు.

1. నా చిరకాలపు స్నేహితుడును, నిర్మలస్వార్థత్యాగముతో చిన్నతనములోనే తన న్యాయవాదవృత్తిని వదలుకొని, సుమారు 15 సంవత్సరములు కష్టించి తన ధనమును, ఆరోగ్యమును తుదకు తన ప్రాణములనుకూడ నర్పించి, కొవ్వూరు గ్రామములో యేబదివేల రూపాయిల స్థిరాస్తితో "ఆంధ్రగీర్వాణ విద్యాపీఠ మను" నొక సంస్థాపనను నిర్మించిన వాడగు లేటు తల్లాప్రగడ సూర్యనారాయణ రావు గారు ది 6-3-26 తారీఖున శివసాన్నిధ్యమును చేరినారు. ఆయన నామము ఆచంద్రార్కముగ నుండునట్లు తోడ్పడుట నావిధాయక కృత్యమని యెంచి, నాస్వార్జితమగు తూర్పుగోదావరి జిల్లా రామచంద్రపురం తాలూకా ఆలమూరు కోఆపరేటివ్ ల్యాండు మార్టగేజి బాంకులోనున్న నెం 31 to 42 నెంబర్లు గల పండ్రెండువేల రూపాయిల డిబెంచర్లను యీక్రింది షరతులతో యీక్రింది వివరింపబోవు విషయములను నెర

వేర్చుటకు కోవ్వూరు ఆంధ్రగీర్వాణ విద్యాపీఠ పాలకసంఘము వారిని ట్రస్టీలుగా యేర్పరచి యీడిక్లరేషన్ ఆఫు ట్రస్టు దస్తావేజును వ్రాయుచున్నాను.

2. పైన ఉదహరించిన డిబెంచర్లమీాద ప్రతి ఆరు మాసములకు వచ్చువడ్డీని మాత్రమే కోవ్వూరు విద్యాపీఠ పాలకసంఘము ఖర్చుచేయుచుండవలెను గాని, అసలు మొత్తము శాశ్వతమూలనిధిగా, యెల్లకాలముండవలెను. ఈ డిబెంచర్ల గడువానంతరముకూడ వీనిమీాదవచ్చు వడ్డీతగ్గినను, హెచ్చినను కోఆపరేటివుల్యాండు మార్టేజి బ్యాంకులలోనే యీా అసలు మొత్తము వేయుచుండవలెను. గాని భూములు, యిల్లు మొదలగు స్థిరాస్తులను కొనకూడదు.

3. నేనున్ను, నాయిద్దరు కొమాళ్ళు కృష్ణమోహన్ M. A. B. L. Advocate మద్రాసున్ను, జగన్మోహన్ L. E. E. Electrical Engineer బొంబాయిన్ని, కోవ్వూరు ఆంధ్రగీర్వాణ విద్యాపీఠ పాలకసంఘములో జీవితకాలవు మెంబర్లుగా నుండవలెను. ఈముగ్గురులో యెవరైనను అన్య గ్రామములలో నున్నపుడు సదరు విద్యాపీఠ పాలకసంఘ కార్యనిర్వాకహాసంఘ సమావేశములలో పాల్గొని వోట్లువేయు టకును, ఉద్యోగీయులుగా నుండుటకును, వారి యిష్టము వచ్చినవారిని, మరియొక్కొక్కరిని రాజమహేంద్రవరము, కోవ్వూరు గ్రామస్థులలోనుండి మెంబర్లుగా నామినేటుచేసి, పాలక సంఘు సెక్రటరీకి ముందుగా తెలియచేసి, తగిన యేర్పాట్లు చేసికొనుటకు అధికారము కలిగియుందురు.

4. పైన ఉదహరించిన ట్రస్టుఫండుమీద రాగల వడ్డీలోనుంచి నెలకు యిరువది (రు 20) రూపాయల చొప్పున కొత్తగా స్థాపింపబడిన ఆంధ్రగీర్వాణ విద్యాపీఠమున కనుబంధముగా నెలకొల్పబడిన శ్రీవాడ్రేవు జోగాయమ్మ బహద్దరు జమీందారు గారి కళాశాలాధ్యక్షుని (Principal) గౌరవభృతిక్రింద నిచ్చుచుండవలెను. ఒకవేళ యీ స్వల్పమొత్తమును తన ఖర్చులకు స్వీకరించుటకు ఆయన యిష్టపడనియెడల సదరు కళాశాలలో పరిశోధనకును (research) అధ్యాపకమునకును (teaching) సమర్థుడగు ఒక పండితుని జీతముక్రింద నీయవలయును.

5. పై మొత్తము పోగా మిగిలిన వడ్డీని ఆంధ్రభాషలో సులభశైలిని పండిత పామరులకు బోధపడునట్లు చిన్నచిన్న గ్రంథములను యీక్రింద నుదహరించిన విషయములలో విద్యార్థికులచేత కొద్ది పారితోషిక మిచ్చిగాని, ఉచితముగాగాని, వ్రాయించి అచ్చొత్తించి ఆంధ్రదేశములోని ముఖ్యమైన గ్రంథాలయములకు ఉచితముగ పంచిపెట్టుటకును, వ్యక్తులకు స్వల్పఖరీదుకు విక్రయించుటకును, విద్యాపీఠ పాలకసంఘము వారు వినియోగించుచుండవలెను.

(ఏ) వేదకాలము నాటినుండి హైందవుల ఆర్యమతము లోని శ్రౌతస్మార్త కర్మకాండల జ్ఞానకాండల పరిణామము, ప్రస్తుతము వారిలోనున్న సాంఘికాచారములు, విశ్వాసములు, సాంప్రదాయములు, పట్టింపులు, వర్ణములు, వివాహములు,

స్త్రీల విద్యాస్వాతంత్ర్యములు, జ్యోతిషములు, మంత్ర తంత్రములు, దేవతలు, దయ్యములు, వర్జములు, లగ్నములు, శకునములు, గ్రహణములు, మంచి చెడుదినములు, అశుచి, ప్రాయశ్చిత్త ఆచారకాండలు, తద్దినములు, దృష్టిదోష, పంక్తిదోష, అంటుదోష, వాయుదోషములు, సాముద్రికము, రసవాదము మొదలగువానిని గురించి మూఢవిశ్వాసములను సప్రమాణముగ ఖండించి విమర్శించుట.

(బి) షోడశ కర్మలను గురించి ఆంధ్రటీకాతాత్పర్యములతో గ్రంథములను వ్రాయించి అనవసరమని తోచిన కర్మకాండ విభాగములను సంకుచిత పరచి వేదలక్షణ నేర్చుకొని తగు విమర్శన జ్ఞానమును తెలివియుగల పురోహితులను, దేవాలయార్చకులను, అన్నివర్ణములలోను బయలుదేరునట్లు చేయుట, ప్రపంచములో తక్కిన జాతుల మతములు, సాంఘికాచారములు, నీతి, వీని పరిణామములు, మొదలగునవి తెలియజేయుట.

(సి) ఆర్యమతమునుండి బయల్వెడలిన బౌద్ధమతము, జైనమతము, బ్రహ్మసమాజమతము ఆర్యసమాజమతము మొదలగు వానిలోని సూత్రములను, తెలియజేసి విమర్శించుట, ప్రపంచములో వ్యాప్తినొందియున్న యితరమతములతో ఆర్యమతమును పోల్చి వానిని గురించి ప్రజలకు బోధించుట.

(డి) మన పూర్వులు రచించిన మానసిక భౌతికశాస్త్రములు, కళలు, అధునిక పరిశోధనలను బట్టి విమర్శించి,

వానిలో అవసరమగు మార్పులను జేసి మనదేశీయ పారిభాషిక పదములతో ఆంధ్రములో గ్రంథములను వ్రాయించుట.

(౩) గాంధిమహాత్ములవారి సత్యాగ్రహతత్వములు, వానిలో నిమిడియున్న వేదాంతము, నానారాష్ట్రపరిపాలనా విధానములు, ప్రపంచములో యిదివరకు జరిగిన, యిప్పుడు జరుగుచున్న సమస్త సాంఘిక రాజకీయార్థిక విప్లవములు, ఉద్యమములు, గ్రామ పునర్నిర్మాణము, సహకార, అసహకారోద్యమములు, నానావిధ సమిష్టివాదములు, మొదలగు వానిని గురించి గ్రంథములను ప్రచురించుట.

6. పైన వ్రాసిన విషయములను నిర్భయముగను, నిర్మొగమాటముగను, సత్యము తప్పకుండ సప్రమాణముగ సంపూర్ణ మనస్స్వాతంత్ర్యములతో (Free thought) ఆంధ్రులయెదుట వారి భాషలో పెట్టుచుండవలెను. ఏగ్రంథము గాని రూపాయకంటె హెచ్చు వెలను కలిగియుండకూడదు. నాజీవితకాలములో నే నంగీకరించిన గ్రంథములనే ప్రచురించవలెను. నాజీవితానంతరము విద్యాపీఠ పాలక సంఘమువారు యిప్పు డేర్పరచు పండితబృందము (Academic Council) చే అంగీకరింపబడిన పిమ్మట ఆసంఘమువారి శాశ్వతసభ్యుల మెజారటీ వారి యామోదమును బడయనిదే యేగ్రంథము గాని వెలువడకూడదు.

7. నాపై యుద్దేశములను నెరవేర్చుటకు యితర దాతలనేకమంది ట్రస్టుఫండుకు సహాయపడుదురని నేను నమ్ముచున్నాను. అప్పటి దేశకాలపరిస్థితులను బట్టి పైన నేను

తెలియజేసిన విషయములలో దేనికైనను యీనిధిమీద వచ్చు వడ్డీని అంతగాని కొంతగాని వీలుకొలది ప్రజోపయోగ మునకు వినియోగించవచ్చును. సాలుకు ఒక చిన్నగ్రంథము వెలువడినను నాయాత్మ తృప్తినొందగలదు.

8. నే నిదివరకు ది 16-5-1928 తేదీని కొవ్వూరు ఆంధ్రగీర్వాణ విద్యాపీఠమునకు కొవ్వూరులో నాయింటి మీద రిజస్టరుడీడ్డు ద్వారా యేర్పరచిన రు 120 లు వార్షికము యీ ట్రస్టుడీడ్డు మొత్తములోనే చేరి యున్నందున సదరు చార్జి రద్దు అయినట్లు భావించుకొని యీట్రస్టును ఆంధ్ర గీర్వాణ విద్యాపీఠ పాలక సంఘమువారు అంగీకరించవలెను.

9. ఏకారణమువలన నయినను నాపై యుద్దేశములను కొవ్వూరు, ఆంధ్రగీర్వాణ విద్యాపీఠ పరిపాలక సంఘమువారు సరిగా నెరవేర్చజాలనిచో ఆంధ్రవిశ్వవిద్యాలయాధికారులు శివిల్ కోర్టుగుండా యీట్రస్టుఫండును స్వాధీనము చేసికొని దీనిలో నుదహరించిన కార్యవర్గములను సక్రమముగ యీ కోవూరు విద్యాపీఠములోనే నెరవేర్చుచుండవలెను.

ఇది నాసమ్మతిని నా స్వదస్తూరీని వ్రాసియిచ్చిన డిక్ల రేషన్ ఆఫ్ ట్రస్టు దస్తావేజు.

అడ్వకేటు వల్లూరి సూర్యనారాయణరావు,
సెక్రటరీ
ఆంధ్రగీర్వాణ విద్యాపీఠము
కోవూరు
పశ్చిమ గోదావరిజిల్లా
9–4–31.

# APPENDIX II రెండవ అనుబంధము.

—: వ్రాయతగిన కొన్ని విషయముల పట్టిక :—

1. వర్ణములు. 2. అంతర్వర్ణ, అంతర్జాతీయ వివాహములు 3. వితంతు, రజస్వలానంతర వివాహములు—3. వావి 4. వివాహచ్ఛేదనము. 5. స్త్రీల విద్యాస్వాతంత్ర్యములు. 6. ప్రకృతి పరిణామము. 7. మతపరిణామము. 8. నీతి పరిణామము. 9. నీతిమత సంబంధము. 10. విగ్రహారాధనము. 11. పితృపూజ. 12. ఆర్యబ్రాహ్మణ మతములు. 13. పునర్జన్మ. 14. స్వర్గనరకములు. 15. దేవుళ్లు దయ్యములు. 16. దైవప్రార్థనము. 17. పురాణములు. 18. హైందవ ధర్మశాస్త్రకాలనిర్ణయము. 19. దైవస్వరూప పరిణామము. 20. అవతారములు. 21. ఆత్మస్వరూప పరిణామము. 22. మంత్రతంత్రములు. 23. కర్మజ్ఞాన భక్తి మార్గములు. 24. యోగవిద్య. 25. దృష్టిపంక్తి అంటు వాయుదోషములు. 26. మంచిచెడు దినములు. 27. శకునములు, వర్జములు, లగ్నములు. 28. జ్యోతిషము. 29. యజ్ఞములు, యాగములు. 30. శుద్ధాద్వైత జడాద్వైతములు. 31. అహింస, జీవహింస. 32. ఆత్మహత్య. 33. విశ్వాస సంశయయాత్మ తత్వములు. 34. దానధర్మములు. 35. అపక్వశాకాహారము. 36. సమిష్టివాదములు. 37. మహాత్మ గాంధిగారి సత్యాగ్రహ తత్వము. 38. రాజకీయ, సాంఘిక విప్లవములు. 39. భౌతిక శాస్త్రములు. 40. బాలుర విద్యా విధానము.



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA115B114 |
| పుస్తకం పేరు | మన స్వాతంత్ర్యము 03 |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 183 |
| పెద్ద సైజు పేజీలు | No |
| ఖాళీ పేజీలు | II,VI, [illegible] |
| లేని పేజీలు | No |
| తయారు చేసినది | munisha |
| పేజీలు విడదీసినది | munisha |
| స్కాన్ చేసినది | thasin |
| పరీక్ష చేసినది | PRATHYUSHA |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |

Blanks, = 8, 10, 11, 12, 14.